# సశాస్త్రీయ వాస్తు సారము

(దేవాలయ వాస్తు విషయములతో సహా)

సేకరణ - రచయిత



దృక్ సిద్ధాంత పంచాగ కర్త, వైఖానస ఆగమ ప్రవర, సిద్ధాంతి,

స్థానాచార్యులు - శ్రీ వేంకటేశ్వర స్వామి వారి దేవస్థానం

**ముత్తేవి శ్రీనివాస శశికాంత్**

**శ్రీ విఖనస ఆర్ష ధర్మ పీఠం**

**మచిలీపట్నం**

# ముందుమాట

ఈ సృష్టిలో ప్రతిప్రాణి అది నివసించటానికి ఒక నిర్మాణాన్ని చేసుకుంటుంది. ఒక చీమ దాని జీవనం కోసం దాని కుటుంబం నివసించడం కోసం చక్కని ఒక క్రమపద్ధతిలో నివాసయోగ్యమైన పుట్టను నిర్మించుకుంటుంది. చిన్నదైన పిచ్చుక అత్యద్భుతమైన శిల్పనిర్మాణ కౌశలం ఉట్టిపడేలా దానికి నివాసయోగ్యమైన "పిచ్చుక గూళ్ళను" నిర్మించుకుంటుంది. అలానే బుద్ధిబలం, జ్ఞానం కలిగిన మానవులకు, వారికి నివాసయోగ్యతకొరకు

శ్లో॥ భృగు రత్రిర్వసిష్ఠశ్చ విశ్వకర్మా మనుస్తథా
నారదో నగ్నజిచ్చైవ విశాలక్షః పురందరః
బ్రహ్మాకుమారో నందీశః శౌనకో గర్గ ఏవచ
వాసుదేవో నిరుద్ధశ్చతథా శుక్రబృహస్పతీ
అష్టాదశైతే విఖ్యాతా శ్శిల్ప శాస్త్రోపదేశకాః (మత్స్యపురాణం)

పూర్వులైన ఈ ఋషులందరూ భూగోళ, ప్రాకృతిక, నిర్మాణ, శిల్ప, చిత్రలేఖన, ప్రతిమాలక్షణ, యంత్రాది విషయములను చెప్పియున్నారు, ఈవిద్యలన్నిటిని కలిపి వాస్తుశిల్పము అను పేరుతో పూర్వాపరాలను పరిశీలించి, పరిశోధించి, జ్ఞానదృష్టులతో విమర్శించి నిగ్గుతేలిన పద్ధతులను సూత్రబద్ధం చేసి లోకకళ్యాణకారకములైన గృహనిర్మాణ, దేవాలయ నిర్మాణ శాస్త్రాన్ని రూపొందించారు. అదే వాస్తు శాస్త్రముగా నేడు ప్రసిద్ధి పొందింది. ఆ విషయములను అన్ని గ్రంథముల నుండి సేకరించి ఆవాస్తు సారాన్ని ప్రామాణిక శ్లోకముల తో దేవాలయ వాస్తు విషయములను కూడా విశేషముగా అందించుటకు చేసిన చిన్న ప్రయత్నం. దీనిని క్షీర నీర న్యాయముచే గ్రహించి, ఆచరించి, శుభఫలములను పొందెదరని ఆశిస్తున్నాను.

ఇట్లు
ముత్తేవి శ్రీనివాసశశికాంత్
విఖనస ఆర్షధర్మపీఠం
మచిలీపట్టణం

# విషయ సూచిక

# గృహము యొక్క ప్రయోజనము

**పిట్టలకు గూడులూ, మృగములకు చెట్లూ – పొదలూ, కొండ గుహలూ, చీమలకూ–పాములకూ పుట్టలు, జలచరములకు నీరూ, అవి నివసించుటకు అవసరము. అలాగే పురాతన మానవ సమాజమునకు చెందిన వారందరునూ తమ ఆనందమునకునూ చలి, వాన, ఎండలు, అగ్ని, వరదలు భూకంప ములు మున్నగు వానినుండి తమనూ, తమ సంతానమునూ రక్షించు కొనుటకునూ, జాతి అభివృద్ధికినీ గుహలనూ, వృక్షములనూ నివాసములుగా ఏర్పరచుకొనిరి. అలనాటి గుహలే నేటి గృహములుగా పరివర్తనము చెంది, మానవుని అవసరములకు అనుగుణముగా గాలీ, వెలుతురూ వచ్చుటకు వీలుగా కిటికీలు వాకిళ్ళు ఏర్పరచుకొని, గృహనిర్మాణము చేసుకున్నారు. ఈ సంస్కృతి రాబోవు తరముల వారికి అందటముకోసం సశాస్త్రీయమైన గృహనిర్మాణము, దాని ఆవశ్యకతను వాస్తుశాస్త్ర రూపమున విశ్వకర్మ, మయబ్రహ్మ, ఋష్యాదులు ఎందరో అందించిరి !**

**వాస్తు అనగా – మయవాస్తులో**

శ్లో॥ అమర్త్యా దైవ మర్త్యాశ్చ యత్ర యత్ర వసన్తి హి
త ద్వస్తితి మతం తజ్ఞై స్తద్భేదంచ వదామ్యహమ్॥

శ్లో॥ భూతానామాది భూతత్వా దాఉదారా జగతః స్థితే
భూరేవ ముఖ్యవస్తుస్యా త్తత్ర జాతాని తానిహి॥

శ్లో॥ ప్రాసాదీనిచ వస్తూని వసుత్వా ద్వస్తు సంశ్రయాత్
వస్తూన్యేవ హితాన్యేవ ప్రోక్తాన్యస్మిన్ పురాతనైః ॥

**తా॥ దేవతలూ, మానవులూ, రాక్షసులూ ఎచ్చటెచ్చట వసింతురో (ఆ భూమియే) ఆ వస్తువునే వాస్తువు అందురు, పంచభూతములలో మొదటిది భూమి. సర్వజీవులను భరించుచూ, వాటికి ఆధారభూతమైనది, కావున అదియే వస్తువు "వాస్తుస్వరూపము" మేడలు మొ॥ వసతులన్ని ఏర్పరచుకుని జీవులకు సుఖముగా నివసించుటకు ఆశ్రయ భూతమై శ్రేయస్సునూ, హితమునూ, అభివృద్ధినీ కల్గించునది భూమియే, కనుక అదియే వాస్తువు.**

శ్లో॥ యథా మాతర మాశ్రిత్య జీవంతే సర్వ జంతవః ।
తద్వత్ గృహస్థ మాశ్రిత్య వర్ధంతే చాఽఖిలాశ్రమాః ॥

**తా॥ తల్లిని ఆశ్రయించి సర్వజీవులును ఎట్లు సుఖముగా జీవించుచున్నవో అట్లే గృహస్థులను ఆశ్రయించి తక్కిన మూడు (బ్రహ్మచర్య - వానప్రస్థ- సంన్యాస) ఆశ్రమముల వారునూ సఫల మనస్కులగుచూ ఉన్నారు.**

శ్లో॥ గృహస్థస్య క్రియా స్సర్వే న సిద్ధ్యన్తి గృహం వినా । (మాత్స్యే)

**తా॥ సొంత ఇల్లులేనిదే గృహస్థుడు చేయు శుభ కర్మల ఫలము వానికి సిద్ధింపదు.**

శ్లో॥ పరగేహే కృతాన్ సర్వా శ్రౌత స్మార్త క్రియా శ్శుభాః ।
నిష్ఫ లాస్స్యు ర్యత స్తాసాం భూమిశః ఫల మశ్నుతే ॥ భవిష్యోత్తరే

**తా॥ సొంత ఇల్లులేనివారు, ఇతరుని ఇంటిలో వుండి చేయు వేద విహిత స్మృతివిహితమగు సకల శుభకర్మలునూ నిష్ఫలమై పోవును. ఆ శుభ కర్మల ఫలితము ఇంటిని అద్దెకు ఇచ్చిన యజమానికి చెందును.**

శ్లో॥ కోటిఘ్నం తృణజే పుణ్యంః, మృణ్మయే దశసంగుణమ్ ।
ఐష్టికే శతకోటి ఘ్నం శైలేఽనంతం ఫలం గృహే ॥

**తా॥ 1. పూరిల్లు కట్టుకొనిన కోటిపాపములను నశింపచేసి పుణ్య ఫలములను కల్పించును.**

**2. మట్టితో కట్టిన పదికోట్ల పాపములు నశింపజేయును.**

**3. ఇటుకలతో కట్టుకొనిన నూరుకోట్ల పాపములు నశించును !**

**4. శిలలతో (కొండరాళ్ళతో) ఇల్లుకట్టుకొనిన అనంత పుణ్య ఫలము లభించును. ! మానవ జీవితము బాల్యము, యౌవనము, కౌమరము, వార్ధక్యము అను నాలుగు అవస్థలు పొందును. ఈ నాలుగు అవస్థలు గల మానవ జీవితమునకు నాలుగు ఆశ్రమములు విధింబడినవి. అవి బ్రహ్మచర్యాశ్రమము, గృహస్థాశ్రమము, వానప్రస్థము, సన్యాసము అనునవి. ఇందు గృహస్థుడే మిగిలిన మూడు ఆశ్రమములందు ఉన్నవారికి**

**ఆధారభూతుడు. ఉత్తమ గృహస్థునకు గృహమే ధర్మ, అర్థ, కామ, మోక్షములు అను చతుర్విధ పురుషార్థ సాధన మగుచున్నది. అట్టి గృహస్థునకు "సొంత గృహము" లేనిచో –**

శ్లో॥ స్త్రీ పుత్రాదిక భోగ సౌఖ్యజనకం ధర్మార్థ కామప్రదం
జంతూనాం నిలయం సుఖాస్పదమిదం శీతాంబుఘర్మాపహమ్
వాపీదేవ గృహాది పుణ్యమఖిలమ్ గేహాత్ సముత్పద్యతే
గేహం పూర్వముశన్తి తేన విబుధాః శ్రీ విశ్వకర్మాదయః ॥"
(వాస్తు రాజవల్లభమ్)

**పై ప్రమాణమును అనుసరించి పరిశీలించినచో ధర్మార్థ కామ మోక్షములకు చతుర్విధ పురుషార్థములకు గృహమే ముఖ్య సాధనమని ఋజువగుచున్నది. గృహస్థుడు తానాచరించు సమస్త శ్రౌత స్మార్త కర్మలను తన సొంత యింటియందు కాక యితరుల యింటియందాచరించినచో ఆయా శ్రౌతస్మార్త కర్మల యొక్క ఫలితము ఆయా గృహ యజమానికే చెందగలవని శాస్త్రములు స్పష్టముగా వక్కాణించుచున్నవి. అందుచే ప్రతి గృహస్థుడు తనకొక సొంతయిల్లు నిర్మించుకొనుట ముఖ్యావసర మగు చున్నది. అంతేగాక శీత, వాతాతపాదుల నుండి ప్రకృతి సహజముగా కలుగు కష్ట నష్టముల నెదుర్కొని గృహమే గృహస్థుని సంరక్షించి సుఖ పెట్టుచున్నది. అందుచేతనే మయ, విశ్వకర్మ, నారద, సనత్కుమారాది ఋషిపుంగవులు మానవులకు గృహనిర్మాణము ప్రథమ కర్తవ్యముగా నొక్కివక్కాణించి యున్నారు.**

## భూ పరీక్ష

శ్లో॥ భూపరీక్షా ప్రయత్నేన వాస్తుకర్మ సమాచరేత్ ।
భూపరీక్షా విధానేన సర్వంనిష్ఫల మాదిశేత్ ॥ (గృహవాస్తు శిరోమణి)

**తా॥ గృహనిర్మాణము చేయదలచిన భూమిని మొదట బాగా పరీక్ష చేయవలెను. భూపరీక్ష చేయకుండా గృహనిర్మాణము చేసినచో సర్వము నిష్ఫల మగును.**

శ్లో॥ ఉత్తమా మధ్యమా భూమి రధమాచేతి సాత్రిధా ।
విభక్తా గుణభేదేన శాస్త్రజ్ఞైః పూర్వసూరిభిః ॥ (వి॥వా॥శా॥)

**తా॥ భూమిగుణ భేదములు కలిగి ఉత్తమ, మధ్యమ, అధమములని మూడు విధములుగా ఉండును. ఇట్టి భూమిని నిర్మాణముల కొరకు అర్వణములరీత్యా నిర్ణయింపబడిన దిశలయందు ముందుగా పరీక్షింప వలెనని శాస్త్రములు తెల్పుచున్నవి.**

## స్థల పరీక్ష

**గృహనిర్మాణ సందర్భమున మొట్టమొదట బాగుగా పరీక్షించ వలసినది స్థలము. గృహనిర్మాణమునకు గ్రహింపదలచిన స్థలము యొక్క ఆకృతిని, ఉచ్ఛ, నీచములను, నీటి పారుదల, వాటములను బాగుగా పరిశీలింప వలసియున్నది. గృహనిర్మాణ స్థలమునందలి మట్టియొక్క రుచి, రంగు, వాసనలు, గూడ పరిశీలింప వలసినవని శాస్త్రములు పైమూడు విషయములను గూర్చియే ప్రథమముగా చెప్పుచున్నవి. ఇదియే ఆచరణ సాధ్యము. స్థలము యొక్క ఆకృతి పరిసరములను గూర్చి ముయుడు –**

"దేవానాం ద్విజానాం చ చతురశ్రాయతా శృతాః
వస్త్వాకృతి రనింద్యాసా వాక్ ప్రత్యగ్దిక్ సమున్నతా"
(మయమతం)

**దేవాలయములకు గాని, గృహములకు గాని ఉపయోగింపదలచిన స్థలము చతురస్రముగా గాని లేదా ఆయతము అనగా దీర్ఘ చతురస్రముగా గాని ఉండవలయును. ఈ రెండు ఆకృతులు గల స్థలములు మాత్రమే గృహనిర్మాణమునకు శుభప్రదమైనవని మయుని అభిప్రాయము.**

"ఆయతే సిద్ధయః సర్వాచతురస్రే ధనాగమః"

**వాస్తుశాస్త్ర గ్రంథములన్ని ఈ చతురస్ర దీర్ఘ చతురస్రములను ఏకగ్రీవముగా అంగీకరించి ఉన్నవి. కాబట్టి గృహాది నిర్మాణములకు ఈ రెండు ఆకృతులు గల భూములనే గ్రహించుట శుభప్రదము.**

## చతురస్రము :

చతురస్రము అనగా నాలుగు భుజములు అనగా నాలుగు దిశల కొలతలు సమానముగా గల స్థలము ఉదాహరణకు –

తూర్పు సరిహద్దు పొడవు 12 గజములు, దక్షిణపు సరిహద్దు పొడవు 12 గజములు, పడమర సరిహద్దు 12 గజములు, ఉత్తర సరిహద్దు పొడవు 12 గజములు ఉన్నదనుకొనిన, అట్టి స్థలము చతురస్రమనబడును. అయితే యిట్టి చతురస్రాకారపు స్థలము యొక్క నాలుగు మూలలు మూల మట్టమునకు సరిపడియుండవలయును. అనగా ప్రతి మూలయు 90 డిగ్రీలు గలదిగా యుండవలయును. ఇట్టి చతురస్రాకారపు స్థలము నిర్మాణమునకు మిక్కిలి ప్రశస్తమైనది, ఐశ్వర్యప్రదమైనది.

## ఆయతము :

ఆయతము అనగా దీర్ఘచతురస్రాకారము గల స్థలమని వివరింపబడినది. ఇట్టి ఆయత స్థలము యొక్క ఎదురెదురు భుజములు లేక దిక్కుల కొలతలు సమానముగా నుండును. ఉదాహరణకు – ఒక స్థలము యొక్క తూర్పు పడమర దిశల కొలతలు 20 గజములు ఉన్నవనుకొనిన. దక్షిణోత్తర దిశల కొలతలు 15 గజములున్నవనుకొనిన. ఆ స్థలము యొక్క నాలుగు మూలలు మూలమట్టమునకు సరిపడియున్నచో అట్టిస్థలము దీర్ఘ చతురస్రము లేదా ఆయతము అని పిలువబడుచున్నది. ఇట్టి స్థలము నందు గృహనిర్మాణము చేసుకొని నివసించు జనులు ఇష్టకామ్యార్థ సిద్ధి పొంది సుఖింతురు.కాబట్టి సమస్త గృహ నిర్మాణములకు పైన ఉదహరించిన చతురస్రము, ఆయతము – అను రెండు ఆకృతులు గల భూములనే పరిగ్రహించుట శ్రేయోదాయకము.

ఆయత వాస్తును గూర్చి మరియొక వివరణము

ఆయతము రెండువిధములు. 1. తూర్పు పడమరలు పొడవు, దక్షిణోత్తరములు వెడల్పుగా గలది. 2. దక్షిణోత్తరములు పొడవుగా తూర్పు పడమరలు వెడల్పుగాను గల స్థలము. ఈ రెండింటి యందును రెండవదగు దక్షిణోత్తర ములు పొడవుగల ఆయతక్షేత్రము మిక్కిలి శ్రేష్ఠమైనదని "శిల్పరత్నము" నందు వివరింపబడినది.

"దక్షిణోత్తరమాయామాం వాస్తోః సర్వత్ర కీర్తితః"

అను ప్రమాణముచేత దక్షిణోత్తరములు పొడవుగల ఆయతము గృహనిర్మాణమునకు మిక్కిలి శుభప్రదమైనది.

వాస్తు శాస్త్రములలో స్థలముయొక్క ఆకృతులు మరికొన్ని చెప్పబడినవి. కాని అందు మనము గమనింపదగినవి. మయునిచేత నిషేధింపబడినవి అగు నాలుగు ఆకృతులు గల భూములు.

"వృత్త త్రికోణ విషమా వజ్రాభా కచ్ఛపోన్నతా" (మయమతం)

గుండ్రని ఆకారముగల భూమి, ముక్కోణములు గల భూమి, విషమాకారము గల భూమి, వజ్రాయుధమువలె పొడవుగల భూమి, తాబేలువలె బాదామీ ఆకారముతో నుండి మధ్య మిక్కిలి ఎత్తైన భూమి మిక్కిలి నింద్యమని వివరింపబడినది.

"చక్రే దారిద్ర్య మిత్యాహుః విషమే శోక లక్షణం
రాజభీతి త్రికోణేస్యాత్ శూర్పే ధనక్షయం విదుః"

వృత్తాకారము గల భూమియందు యిల్లుకట్టి నివసించువారు దరిద్రులగుదురు. విషమకోణములు గల భూమియందు నివసించువారు దుఃఖితులగుదురు. ముక్కోణముగల స్థలమునందు యిండ్లు కట్టి నివసించువారు సివిలు క్రిమినలు కేసులయందు తగుల్కొని పీడింపబడుదురు. చేట వంటి ఆకారము గల భూమియందు యిల్లుగట్టి నివసించు ప్రజలు ఎంతటి ధనవంతులైనను క్రమముగా ఋణగ్రస్థులై దరిద్రులగుదురు కాబట్టి ఈ స్థలాకృతి విశేషములను బాగుగా ఆలోచించి యోగ్య మగు స్థలమునందు గృహనిర్మాణము చేయుట శ్రేయోదాయకము.

గృహనిర్మాణమునకు గ్రహింపవలసియున్న భూములు సహజ సిద్ధముగా చతురస్రముగా కానీ, ఆయతముగా కానీ ఉండుట అరుదగు విషయము కాబట్టి మనము యోగ్యముగా ఉన్నదని భావించిన భూమిని చతురస్రముగా గాని, ఆయతముగా గాని సరిహద్దులేర్పరచుకొని శాస్త్రానుకూలమగు ఆకృతిని సాధించి గృహనిర్మాణము చేయవలయును.

స్థల పరీక్షయందు గమనింపవలసిన రెండవ విషయము పరిసరములు, గృహనిర్మాణ స్థలము యొక్క పరిసరములలో ఉన్న వాతావరణ పరిస్థితి ఆ యింటిలో నివసించు వారిపై ప్రభావము చూపును. అందుచేత గృహనిర్మాణ స్థలముయొక్క పరిసరములను బాగుగా పరిశీలింప వలసి యున్నది.

## భూమి ఎత్తు - పల్లములు

శ్లో॥ భువః ప్లవం ప్రవక్ష్యామి నరాణాం చ శుభా–శుభం ।
పూర్వప్లవా వృద్ధికరే, ఉత్తరా ధనదా స్మృతా॥ (వాస్తు విద్యా)

**తా॥ తూర్పు పల్లముగా వుండినచో ఆ యింటి యందు నివసించు వారికి సర్వవిధ వృద్ధులు లభించును. ఉత్తర దిశపల్లమైనచో సంపదలు విస్తారముగా కలుగును.**

## గజపృష్ఠ భూమీ - ఫలము

శ్లో॥ దక్షిణే, పశ్చిమే చైవ నైర్భతే, వాయుకోణకే –
ఏభి రుచ్చే భవే ద్భూమౌ గజపృష్ఠో విధీయతే ॥
గజపృష్ఠే భవేద్వాసః, స లక్ష్మీ ర్ధన పూరితః ।
ఆయుర్వృద్ధి కరో నిత్యం జాయతే, నాఽత్రసంశయః ॥

**తా॥ దక్షిణము, పడమర, దిక్కులూ, నైరృతీ, వాయవ్యముల యందు ఎత్తును కలిగి ఉన్నభూమికి గజపృష్ఠభూమి అనిపేరు, అట్టిదానిలో గృహము నిర్మించి, నివసించిన, శ్రీ లక్ష్మీకటాక్షము, ఆయువూ, ధనములతో నిత్యమును వృద్ధి పొందుదురు. ఇందు సందేహము ఏ మాత్రమునూ లేదు.**

## కూర్మపృష్ఠ భూమీ - ఫలము

జ్యోతిర్నిబంధమ్ –

శ్లో॥ మధ్యేతూఽచ్చం భవే ద్యత్ర, నీచంచైవ చతుర్దిశామ్ ।
కూర్మపృష్ఠం విజానీయాత్ తత్ర వాసం సమాచరేత్ ॥

కూర్మపృష్ఠే భవేద్వాసో నిత్యోత్సాహ సుఖప్రదః ।
ధన ధాన్యం భవేత్తస్య నిశ్చతం విపులం శుభమ్ ॥

**తా॥ నడుమ మెఱక, నాలుగు దిక్కులూ పల్లము గలిగియున్న భూమి కూర్మపృష్ఠభూమి అని పేరుగలది. దానియందు ఇల్లుకట్టుకొని కాపురమున్న వారికి నిత్యము ఉత్సాహము సుఖము, ధన, ధాన్యాభివృద్ధియును, సకల శుభములునూ విపులముగా నిశ్చయముగా కలుగును.**

## దైత్యపృష్ఠ భూమీ - ఫలము

శ్లో॥ పూర్వాఽగ్ని శంభు కోణేషు చోఽన్నతి శ్చ యదా భవేత్ ।
పశ్చిమే చ యదా నీచం దైత్య పృష్ఠో విధీయతే ॥
దైత్య పృష్ఠే భవేద్వాసో లక్ష్మీ నాఽయాతి మందిరే ।
ధన పుత్ర పశూనాం చ హాని రేవ న సంశయః ॥

**తా॥ తూర్పు దిశ, ఆగ్నేయ ఈశాన్యకోణములు, ఎత్తుగానూ, పడమరదిశ పల్లముగానూ వుండిన నేలను 'దైత్య పృష్ఠభూమి' అందరు. ఇటువంటి (దైత్య పృష్ఠ) భూమియందు గృహము నిర్మించి నివసించిన ఆ యింటివారికి, లక్ష్మీకటాక్షము కలుగదు. ధనము, పుత్రులు, పశువులు మున్నగు సర్వ సంపదలు తప్పక నశించును.**

## నాగపృష్ఠ భూమీ ఫలము

శ్లో॥ పూర్వ పశ్చిమ యోర్దీర్ఘో దక్షిణోఽత్తర ఉచ్చతా ।
నాగపృష్ఠం విజానీయా త్మర్తు రుచ్చాటనం భవేత్ ॥
నాగృష్ఠే యదావాసో మృత్యురేవ న సంశయః ।
పత్నీహానిః పుత్రహాని శత్రు వృద్ధిః పదే పదే ॥

**తా॥ తూర్పు పడమరలు పొడవుగానూ, దక్షిణ ఉత్తరములు ఎత్తుగానూ ఉండిన భూమిని 'నాగపృష్ఠ భూమి' అందురు. ఈ 'నాగపృష్ఠ భూమి'యందు గృహమును నిర్మించి నివసించిన, యజమానికి మరణము తప్పక కలుగును.**

**మాటి మాటికినీ భార్య, బిడ్డలూ నశింతురు ! శతృవృద్ధి క్షణక్షణమునకునూ ఎక్కువ అగును !**

**కావున వాస్తుశాస్త్రరీత్యా గృహనిర్మాణము చేయదలచికొన్నవారు దుష్ట ఫలముల నొసంగు నట్టి దైత్యపృష్ఠ, నాగవృష్ఠ భూములను పరిగ్రహింపక వదిలివేసి, శుభఫలములను ఇచ్చునట్టి హస్తి (గజ) పృష్ఠ కూర్మపృష్ఠ భూముల యందు గృహములను మేలగు వాస్తుతో నిర్మించుకొని లక్ష్మీకటాక్షమును, శాశ్వతముగా శుభములను పొందవలసినది.**

శ్లో॥ అత్యంత వృద్ధిదం నృణా, మీశాన ప్రా గుదుక్ ప్లవమ్ ।
అన్యదిక్షు ప్లవం నేఽష్టం శశ్వ దత్యస్త హానిదమ్ ॥ **నారదసంహితా**

**తా॥ ఉత్తర, ఈశాన్య, తూర్పు దిశలు పల్లముగా వుండిన భూమి మానవులకు అత్యంత వృద్ధిని కల్గించును, భూమికి ఇతర దిక్కులు పల్లమైనచో అత్యంత హానిని కలిగించును.**

## యోగ్యభూమి

**వశిష్ఠ సంహిత :**

శ్లో॥ మనస శ్చక్షుషో ర్యత్ర సంతోషో జాయతే భువి ।
తస్యాం కార్యం గృహం సర్వై రితి గర్గాఽది సమ్మతమ్ ॥

**తా॥ యజమాని యొక్క మనసునకునూ, చూపులకునూ ఏ ప్రదేశమున గల భూమి సంతోషమును కల్గించునో – ఆ ప్రదేశమున ఇంటిని నిర్మింప వలెను.**

శ్లో॥ మనోరమా చ యా భూమిః పరీక్షేత ప్రయత్నతః ।

శ్లో॥ సర్వేషాం చైవ వర్ణానాం, సమభూమి శ్శుభాఽవహా ॥**విశ్వకర్మ**

**తా॥ ఏభూమి గృహయజమానికి మనోహరముగా నుండునో దానిని ప్రయత్నపూర్వకముగా పరీక్షించి దానియందు గృహమును నిర్మింపవలెను.**

ఎత్తు పల్లములు, దిశలు-మూలలు హెచ్చుతగ్గులు లేని, శాస్త్ర దూష్యము కానటువంటిది సమభూమి. అందు నివసించు వారికి సర్వశుభములును సిద్ధించును. మిఙ్ఞ పల్లములు ఇంటిలోపల పనికిరావు. ఇంటి వెలుపల మాత్రమే చూచుకొనవలెను. అన్ని కులముల వారికినీ మేలు కల్గించును.

## దిక్ - సాధన

ప్రాచీన కారికా -

శ్లో॥ ప్రథమే సు సమే క్షేత్రే ప్రాచీం సంసాధయే స్ఫుటమ్ !

**తా॥ ఇల్లుకట్టుకొను కోరిక గలవారు మొట్టమొదటగా దిక్కులు (తూర్పు- దక్షిణ - పశ్చిమ - ఉత్తరములు) సమానమగు కొలత స్ఫుటముగా గల ఎత్తు పల్లములు లేని సమతల భూమిని శుద్ధమగు తూర్పును వాస్తు శాస్త్ర ప్రకారము నిర్దుష్టముగా సాధించుకొనవలెను.**

నారదీయే -

శ్లో॥ ప్రాసాదే - సదనేఽలిందే-ద్వారే-కుండే-విశేషతః ।
దిఙ్మోఢే కులనాశస్స్యా, త్తస్మా త్సం సాధయే ద్దిశః ॥

**తా॥ దేవాలయములు, ఇళ్లు, గదులు, వాకిళ్లు, యజ్ఞకుండములు, దిక్కులు సరిగాలేనిచో యజమానికి వంశనాశనము సంభవించును. కనుక దిక్కులను సరియైన రీతిలో సాధన చేసి నిర్ణయించుకొని నిర్మాణము చేసినచో, సకల విధ అభివృద్ధులునూ కలుగును.**

విశ్వకర్మప్రకాశికా -

శ్లో॥ చతురశ్రాం సమాం శుద్ధాం భూమిం కృత్వా ప్రయత్నతః
తస్యాం దిక్ సాధనం కార్యమ్ ...... ॥

**తా॥ నాలుగు దిశలునూ సమమగు కొలతలు గల దానినీ, పరిశుద్ధమగు భూమినీ, ప్రయత్నపూర్వకముగా దిక్ సాధన కావింపవలెను.**

దైవజ్ఞ విలాసము –

శ్లో॥ దిశాం కోణాస్తు చత్వారో నశస్తా ఆయలక్షణే ।
తస్మా త్సర్వ ప్రయత్నేన శుద్ధ ప్రాచీం సమాౖశ్రయేత్ ॥

**తా॥ తూర్పు–పడమరలూ, ఉత్తర–దక్షిణములూ, కోణములగు ఆగ్నేయ, నైఋతి, వాయవ్య, ఈశాన్యమూలల వైపునకు ఏమాత్రమునూ పెరిగి వుండకూడదు, తిరిగి ఉండరాదు. కనుక, ప్రయత్నపూర్వకముగా విశేషశ్రమ చేసి ఐననూ 'శుద్ధ ప్రాచీనదిక్కును' పొంది, గృహనిర్మాణము జరుపవలెను. అలాకాక దిక్కులలో విదిక్కులలో పెరిగిన నాశనము కలుగును.**

నారద :

శ్లో॥ హస్తమాత్రం ఖనేత్ ఖాతం నిశాౖదౌ జలపూరితమ్ ।
ప్రాత ర్దృష్ట జలే వృద్ధిః – నమే పఙ్కే – వ్రణ క్షయః ॥

**తా॥ ఇల్లు కట్టుటకు నిశ్చయించుకొనిన భూమియందు రెండు అడుగుల (హస్త) లోతుగల గొయ్యిని త్రవ్వి ఆగోతిలో సాయంత్ర సమయంలో నీటితో నింపవలెను. మరునాడు సూర్యోదయ వేళలో చూడవలయును.**

**(1) అపుడు ఆగోతిలో జలము ఏమాత్రము ఉండిననూ – ఆచోట యిల్లు కట్టుకొనినచో అన్ని విధముల అభివృద్ధి కలుగును.**

**(2) నీరు అంతయూ ఇంకిపోయి, బురద అగుపించినచో మధ్యమ ఫలితమును ఇచ్చును.**

**(3) నీరు అంతయూ ఆరిపోయి భూమి బీటలు బారినచో ఆచోట యింటిని కట్టిన వారికి వినాశము కల్గును. ఇది నారద మహర్షి చెప్పిన గృహ నిర్మాణ యోగ్య భూమీ లక్షణము ! అనగా 'ఇల్లు కట్టుకొనుటకు తగిన నేల' అనుటకు సరియైన గురుతు.**

**అశాస్త్రీయ గ్రంథములను లెక్కకు మిక్కిలిగా వ్రాసి, ప్రచురించి, ప్రజల మీదకు ప్రయోగించి ప్రజలను గందరగోళపరచు చున్నారు. దయచేసి ప్రజలు**

**అశాస్త్రీయ మగు వానిని నమ్మవలదు. మీకునూ, మీవారికినీ, లోకమునకునూ మేలుచేసి ఆయువు, ఆరోగ్యము, భోగము, భాగ్యము, సుఖ సంతోష కీర్తి ప్రతిష్ఠ పుత్ర పౌత్రాది సంపదలు కలిగించు ఉత్తమవాస్తును ఆశ్రయించి సుఖముగా జీవించగలరు !**

"సభా చైత్య సమీపస్థా నృపమందిర సంస్థితా
దేవాలయ సమీపస్థా కంటకద్రుమ సంయుతా
ఛండాలావాసగచ్ఛాయా వజ్రాభా కచ్ఛపోన్నతా
ఏక ద్వి త్రి చతుర్మార్గా తరితా వ్యక్త మార్గకా
శ్మశానం చాశ్రమస్థానం కపి సూకరసన్నిభమ్
బహుప్రవేశమార్గం చ మార్గవిద్దంచ గర్హితమ్" (మయమతం)

**సభలు, సమావేశములు జరుగు పబ్లిక్ స్థలములకు, చైత్యాలయ ములకు, దేవాలయములకు, రాజమందిరములకు, శ్మశాన భూములకు, సన్యాసులు నివసించు ఆశ్రమములకు, సమీపమున గల స్థలములయందు, గ్రామపొలిమేరల యందు. శివారు సమీపముల యందునుగల భూములు, గృహనిర్మాణ స్థలమునకు నాలుగు దిశలయందు వీధులున్న స్థలము, అనేక ప్రవేశమార్గములు గల స్థలము, సరియగు ప్రవేశమార్గము లేని స్థలము, ముండ్లు గల చెట్లున్న లేదా ముండ్లు గల పొదలున్న స్థలము, పుట్టలు గల స్థలము గృహనిర్మాణమునకు యోగ్యము గావని నిషేధింప బడినవి. కావున ఇట్టి స్థలములను గృహనిర్మాణములకు వినియోగింపరాదు.**

## విడువదగిన భూములు

శ్లో॥ నదీఘాతాశ్రితామూర్ధాన్ మృతవత్సాం తథైవ చ ।
దరిద్రా నశ్మమధ్యస్థా గర్తావస్థా మృషాయుతాన్ ॥
వివరో పశు పుత్రార్తదాయినీ సౌఖ్యహారిణీ ।
వక్రాతివక్రాన్ జనయేత్ పుత్రాన్ విద్యావిహీనకాన్ ॥
శూర్పమార్జాల లకుటనిభాభీతిసుతార్తిదా ।

ముసలా ముసలాన్ పుత్రా జనయేద్వంశఘాతకాన్ ॥
ఘోరాఘోరప్రధా వాయుపీడితా వాయుభీతిదా ।
భల్లభిల్లక సంయుక్తా పశుహాని ప్రదాసదా ॥
వికటా వికటాన్పుత్రాన్ శ్వసృగాల నిభాంస్తథా ।
దదాతిరూక్షా పరుషా దుర్వచాఙ్జనయో త్సుతాన్ ॥
గృహ స్వామిభయం చైత్యే వల్మీకే విపదః స్మృతా ।
దూర్తాలయ సమీపేతు పుత్రస్యమరణం ధృవమ్ ॥
చతుష్పథే త్వకీర్తిస్స్యా దుద్వేగో దేవసద్మని ।
అర్థహానిశ్చ సచివేశ్వభ్రే విపద ఉత్కాటాః । (విశ్వకర్మ ప్రకాశిక)
గర్తాయాంతు పిపాసాస్యాత్ కూర్మాభేధన నాశనమ్ ॥

**నది ఒరిపిడిగల భూమి మృత సంతానమునుగాని మూర్ఖపు పుత్రులను గాని కలుగజేయును. మహాపాషాణయుతభూమి సంతానమును దరిద్రులను జేయును. గోతులు గల భూమి అసత్యవాదులను కల్గించును. బొరియలు గల భూమి అసౌఖ్యము పశుపుత్ర పీడలు కల్గించును. వక్రభూమి సంతానము నకు అంగ వక్రత్వం కల్గించును. లకుట భూమి సంతానమునకు కష్టములు కలిగించును. రోకలి వంటి భూమి పొడవైన శుష్క దేహంగల సంతానమును కలిగించును. ఘోరమైన భూమి ఘోర అకృత్యములను చేయించును. వాయుపీడిత భూమి వాత వ్యాధులచే బాధలు కల్గించును. క్రూరమృగములు గల భూమి పశువులకు హానిచేయును. వికటరూప భూమి, కుక్కలు నక్కలు గల భూమి అంగహీనులైన సంతతినిచ్చును. కర్కశమైన భూమి, పరుషమైన భూమి దుర్భాషల ద్వారా కష్టములు కల్గించును. బౌద్ధాలయాదులు గల భూమి భయమును కలిగించును. పుట్టలు మొదలుగా గల భూమి ఆపదలు యొనగూర్చును. ధూర్తులున్న భూమి దాని సమీప భూమి పుత్ర మరణము కలిగించును. చతుష్పథ భూమి అపకీర్తి కల్గించును. దేవాలయమున్న భూమి ఉద్రేకము నొసంగును. మంత్రి నివాసిత భూమి ధనహాని చేయును. గోతులు గల భూమి గొప్ప ఆపదలనిచ్చును. దూరాశ్రిత భూమి దుఃఖము నొసంగగలదు.**

## అష్టదిశల ఎత్తు పల్లాలు - వాటి ఫలితములు

| దిశలు | ఎత్తు | పల్లములు |
|---|---|---|
| **తూర్పు** | సంతాన నాశనము | ఐశ్వర్యాభివృద్ధి, పూర్ణఆయుష్షు, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. |
| **ఆగ్నేయం** | వాయువ్య, ఈశాన్య దిశల కన్న ఎత్తున్నా ధనలాభము, నైఋతి కన్న ఎత్తుగా ఉన్న అశుభము. | వాయువ్య, ఈశాన్యముల కన్నా పల్లమైన చెడుఆలోచనలు, శత్రుభీతి, అగ్ని ప్రమాదాలు కలుగును. |
| **దక్షిణము** | ఆర్థికాభివృద్ధి, సంతృప్తి కరమైన ఆరోగ్యం కలుగును. | వ్యాధులు, ఆర్థిక ఇబ్బందులు కలుగును. |
| **నైఋతి** | ధనాదాయము, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. | దీర్ఘ వ్యాధులు, దుర్మరణాలు, చెడు వ్యసనాలు ఉండగలవు. |
| **పడమర** | సంతానాభివృద్ధి, పేరు – ప్రతిష్ఠలు పెంపు ఉండును. | అనారోగ్య పీడనము, సంతాన నష్టము కలుగును. |
| **వాయువ్యం** | ఈశాన్యదిశకన్న ఎత్తున్న కార్య లాభము, ధనప్రాప్తి. నైరుతి, ఆగ్నేయముల కన్న ఎత్తున్న అశుభం. | ఈశాన్యం కన్న పల్లమున్న వ్యాధులతో బాధపడుట, తగాదాలు, నైఋతి, ఆగ్నేయము కన్న పల్లమైన అన్ని విధముల శుభము ! |
| **ఉత్తరం** | అన్ని విధముల అరిష్టము. | సర్వదా శుభప్రదము |
| **ఈశాన్యము** | అన్నింటా దరిద్రము | సకల సంపదలు చేకూరును. |

గృహే వాయవ్య భాగేతు పీఠే రత్నాది సంయుతే ప్రతిష్ఠాప్య సమావాహ్య నిత్యం విధివదర్చయేత్. **(భృగు)**గృహేవాయవ్యభాగే ప్రతిష్ఠా **(శ్రీసూత్రే)** గృహస్య మారుత్యాం దిశి స్థాపయేత్ **(క్రియాకైరివ చంద్రిక)**

**తా॥ గృహమునందు వాయవ్య భాగమున దేవతా మందిరమును ఏర్పాటు చేసుకొనవలెను.**

# దిశల హెచ్చుతగ్గులు - వాని ఫలము

## ఆగ్నేయము :

ఆగ్నేయ దిశయందున్న స్థలం ఎక్కువగా పెరిగి యున్నయెడల అనేక కష్టనష్టములను కలుగచేయును, క్రమముగా దరిద్రమును కలుగచేయును. ఈ ఆగ్నేయము పెరుగుదల మూడు రకములుగా నుండును అందు 1) తూర్పు దిక్కుతో కలసి ఆగ్నేయము పెరుగుట., 2) కేవలం ఆగ్నేయము మూలగా పెరుగుట, 3) దక్షిణ దిక్కుతో కలసి పెరుగుట.

u ఇందు తూర్పుతో గూడిన ఆగ్నేయము పెరిగి యున్నచో సంతానముండదు. లేక అల్పసంతతి గలుగవచ్చును.







u దక్షిణ దిశతో ఆగ్నేయముచేరి పెరిగియున్న యెడల కుటుంబ కలహములు, రోగబాధలు, మనస్తాపము, అశాంతి, అధిక నష్టములు కలుగుచుండును.

u కేవలం ఆగ్నేయం మూలగా పెరిగిన యెడల సంతానము, ధనలాభము కలుగుచున్నను, ఆధనము అనవసరముగ దుర్వ్యయమగును. మరియు రోగ బాధలు, కోర్టు వ్యవహారములు కలుగును.




ఆగ్నేయము సమానముగానున్న ఐశ్వర్యము, సాహసము, భోగము, ఆయుర్వృద్ధి, గౌరవము, రాజ సన్మానములు గలుగును.

**నైఋతి :**

నైఋతి దిశ యందున్న స్థలం ఎక్కువగా పెరిగియున్న యెడల తరుచుగా రోగ బాధలు ప్రబలమైన శత్రుబాధలు, ధననష్టము కలుగును. ఇందు నివసించువారు నీచకార్యములను చేయుచుందురు.

- దక్షిణముతో కలసి నైఋతి భాగం పెరిగి యున్నచో రోగ బాధలు ప్రాణ భయము, అపమృత్యువు మున్నగునవి గలుగును.





- పశ్చిమ భాగముతో కలసి నైఋతి భాగం పెరిగిన యెడల ధన నష్టం గలుగును. ఇందు నివసించువారు చెడు సహవాసములను చేయుట, దుష్టకృత్యము లొనర్చుట దుర్వ్యసనముల కలవాటుపడుట, మూర్ఖపు పట్టుదల చేతను, అవివేకం చేతను, అధిక ధనవ్యయము చేయువారుగ నుందురు.

- కేవలము నైఋతి మూలగా పెరిగిన యెడల శత్రుబాధలు, ఋణ బాధలు, వ్యవహారచిక్కులు గలుగును. ఇందు నివసించువారు క్రూరత్వ ములు, నీచకార్యములు చేయుట యందు సమర్థమైనవారుగ నుందురు.



నైఋతి భాగము సమముగానున్నయెడల గౌరవం, ఐశ్వర్యం, సర్వజనపూజ్యత, సుఖభోగ ఆరోగ్యములు, సంతానవృద్ధి గలుగును.

**వాయువ్యము :**

వాయువ్య దిశయందున్న స్థలం ఎక్కువగా పెరిగియున్నయెడల కష్టనష్టములను, అధిక ధనవ్యయమును, దుఃఖమును, శోకమును, మనః క్లేశమును, దారిద్ర్యమును, పుత్రనష్టమును కలుగజేయును.

- పశ్చిమముతో కలసి వాయువ్యము పెరిగి యున్నచో మనశ్చాంచల్యము, అవమానము, కష్ట నష్టములు, ధన నష్టము, అధికవ్యయము గలుగును.





- ఉత్తరముతో గూడిన వాయువ్యము పెరిగి యున్న యెడల దారిద్ర్యము, సుఖహాని, సంతాన నష్టము, పరాభవము, మనఃక్లేశము, దుఃఖ శోకములు గలుగును.

- కేవలం వాయువ్యము మూలగాయున్న యెడల ధనధాన్య పశ్వాదులకు హానియు, శత్రువృద్ధియు, సంతానమునకు సుఖ హీనత గలుగును.



వాయువ్యము సమముగానున్నయెడల సర్వవిధముల ఐశ్వర్యము, భోగము, వంశవృద్ధి, దీర్ఘాయుర్ధాయము, రాజసన్మానము మున్నగునవి కలుగును.

**ఈశాన్యము :**

ఈశాన్యముననున్న స్థలము పెరిగియున్నయెడల పుత్రపౌత్రాభివృధి, వంశవృద్ధి, సుఖభోగములు, ఐశ్వర్యముగలుగును. ఈశాన్యము ఎంత ఎక్కువగా పెరిగియున్న అంత విశేషముగా ధనవృద్ధి, ఐశ్వర్యము, భోగము, కుటుంబవృద్ధి గలుగును. ఇందు నివసించు వారు మిక్కిలి భోగభాగ్యవంతులు, అదృష్టవంతులు అగుదురు.

u ఉత్తరంతో కలసి ఈశాన్యం పెరిగి యున్నచో విశేషముగా ఐశ్వర్యవృద్ధి, అధిక ధనాదాయము, చరస్థిరాస్తులకు వృద్ధి గలుగును. ఇందు నివసించువారు ధనమును ఖర్చు చేయుట కిష్టపడని వారగుదురు.







u తూర్పులో కలసి ఈశాన్యము మూలగా పెరిగి యున్నయెడల యశస్సు, పుత్రపౌత్రాభి వృద్ధి, వంశవృద్ధి, ఐశ్వర్యము మున్నగునవి గులుగును.




u కేవలం ఈశాన్యమూలగా పెరిగియున్న యెడల గొప్ప అదృష్టము సంప్రాప్తించును. ఇందు నివాసము చేయు వారు విశేషముగా చర, స్థిరాస్తులను సంపాదించుచు గౌరవవంతులు, పలుకుబడి గలవారు అగుదురు.

ఈశాన్యమున నున్న స్థలం తగ్గియున్నచో సంతాన నష్టం ధననష్టం గలుగును. ఇందు నివసించువారు కొంత కాలమునకు దరిద్రులగుదురు.

ఇంతయేగాక ఈశాన్యము నందుగల ఖాళీస్థలము ఖాళీగానే విడువ వలయును కాని అందు ఏ విధములగు కట్టడములుగాని, వసారాలు గాని పంచలు, శాలలు మున్నగువానిని కట్టగూడదు. అట్లు కట్టినయెడల అపరిమిత కష్టనష్టములు, వంశనాశనము, ధనక్షయము కల్గును.

# శల్యములు

కు॥ కలహమగుఁ బెంకు లుండిన
వెలిమిడి రోగంబు, పొట్టు పేఁదఱికము, బొ
గ్గులు మృతియుఁ, గట్టె లగ్ని
జ్వలితము కులనాశనంబు శల్యము లభవా ! (శ్రీ కృష్ణవాస్తు)

**తా॥ 1. భూపరిశోధన కాలమున పెంకులు కనబడిన కలహమును.**
**2. బూడిద యుండిన రోగములను 3. పొట్టు యున్న పేదరికమును.**
**4. బొగ్గులుండిన మరణమును. 5. కట్టెలు కనిపించిన అగ్ని భయమును 6. ఎముకలు కానవచ్చెనేని వంశ నాశనమును గలుగను. కనుక అటువంటి శల్యములు లేకుండా ఇండ్లు కట్టు కొనవలయును.**

శ్లో॥ తప్తానా మిష్టకాదీనాం గృహశల్య విచారణా ।
నకర్తవ్యేతి బహవః ప్రవదంతి మనీషిణః॥ (వాస్తుసారం)

**తా॥ ఇటుకలు, పెంకులు మొదలైనవి కాల్చబడినవైయున్న ఎడల గృహ శల్యములుగావని, వాటివల్ల దోషములేదని తెలుసుకునవలయును.**

శ్లో॥ పిపీలికా షోడశపక్షనిద్రా భవన్తిచేత్తత్ర వసేన్నకర్తా ।
తుషాస్థివీర్యాణీ తథైవభస్మా । న్యణ్డానిసర్పా మరణప్రదాస్యుః ॥
వరాటికా దుఃఖకలిప్రదాత్రీ । కార్పాసఏవాతి దదాతిరోగమ్ ।
కాష్ఠంప్రదగ్ధం యదిరోగభీతిః భవేత్కలిః ఖర్పరదర్శనేన ॥
లౌహేన కర్తుర్మరణం నిగద్యం విచార్యవాస్తు ప్రదిశన్తిధీరాః ॥
(వాస్తురత్న ప్రదీపం)

**తా॥ చీమలు, కప్పలు, దుష్ట కీటకములు మొదలగునవి భూమి యందున్న యజమానులకు శుభములు కలుగును . ఊక, ఎముక, బూడిద, చర్మము, అండములు (గ్రుడ్లు) ఉండిన నాశనం చేయును. గవ్వలున్న దరిద్రము, దూది, కొంత కాలిపోయిన కట్టెలు, బొగ్గులు మొదలగునవి యున్న రోగవృద్ధి**

**కాగలదు. ఇనుపముక్కలు, బొచ్చెలు, పగిలిన కుండపెంకులు మొదలగు వాటిని భూశల్యములు అందురు. ఈ శల్యముల వలన గృహకర్తకు మారకము సంభవించు అవకాశము కలదు.**

## వృక్షములు - స్థితి - వాని ఫలములు



**శ్లో॥** దుష్టో భూత సమాశ్రితాఽపి విటపి
నో చ్ఛిద్యతే శక్తితః ।
తద్వి ద్బిల్వ శమీ త్వశోక వకుళౌ ॥
పున్నాగ స చ్చంపకౌ ।
ద్రాక్షా పుష్పక మండపం చ తిలకాన్ ॥
కృష్టాం వసే ద్దాడిమీం ।
సౌమ్యాదిః శుభదౌ కపిత్థక వటా ॥
వౌదుంబరాఽశ్వత్థకౌ ॥ (వాస్తురాజవల్లభం)

**తా॥ దుష్ట (నింద్య) వృక్షములుగాని, భూత, ప్రేత, పిశాచ, బ్రహ్మ రాక్షసాదుల ఆశ్రయమైయున్న (చెట్లు క్రింద దేవతలున్న స్థలము) వృక్షములుగాని స్థలములో వున్న యెడల వానిని కొట్టివేసి అందు గృహమును నిర్మించకూడదు. మారేడుచెట్లు, ఆశోక వృక్షములు, పొగడచెట్లు, సురపొన్న చెట్లు, సంపెంగ చెట్లు, ద్రాక్షతీగెలు, పువ్వులగుత్తులు గల మొక్కలు, తీగెలు, తిలక వృక్షములు, గచ్చపొదలు, దానిమ్మచెట్లు ఈ జాతులకు చెందిన చెట్లుగాని, మొక్కలుగాని, తీగెలుగాని స్థలములో వున్నయెడల వానిని కొట్టించి, పూర్తిగా వేళ్ళతోకూడా తీసివైచి గృహము కట్టవచ్చును. గృహమునకు ఉత్తరమునందు వెలగచెట్లున్నను, తూర్పు దిక్కునందు మఱ్ఱి చెట్లున్నను, దక్షిణ భాగమందు అత్తిచెట్లున్నను (మేడిచెట్లు). పశ్చిమ భాగమున రావి చెట్లున్నను ఆ గృహము శుభ దాయకముగా వుండును.**

శ్లో॥ ఆశ్వత్థే తు భయం బ్రూయా త్ప్ల క్షేభూయా త్పరాభవం ।
న్యగ్రోధే రాజతః పీడా నేత్రామయ ముదుంబరే ॥
(బృహత్సంహితా యాం గర్గః)

**తా॥ గృహావరణములో ప్రధాన గృహమునకు తూర్పు భాగమునందు రావిచెట్టు ఉన్నయెడల భయము, దక్షిణ భాగముయందు జువ్విచెట్టు ఉన్న యెడల పరాభవము, పశ్చిమమునందు మఱ్ఱిచెట్టు ఉన్న యెడల రాజ పీడనము, ఉత్తరదిశ యందు మేడిచెట్టు ఉన్న యెడల నేత్రరోగము కలుగును. కావున అట్టి స్థలమునందు గృహనిర్మాణము చేయకూడదు.**

శ్లో॥ చింతలు మారేళ్లు శ్రీతాళజాలముల్
నింబలు మొలచిన నీరసంబు
జంబీర తరుషండ జంబూ సమాజంబు
లున్నను వేడుక సన్నగిల్లు
బర్బర కర్జూర బదరీ నగంబులు
నింటి ప్రక్కలనున్న మంటగోరు
క్రముక భల్లాతకి కాంచన చూతముల్
కుంకుడు చెట్లుండగూడదెపుడు
మద్దిమ్రాకులు నల్ల మద్ది మ్రాకులు రావి
జువ్వి చెట్లున్నను జూడదగదు
ముందర దానిమ్మ మునగ తంగేళ్ళున్న
భార్యకు జాడ్యంబు ప్రబులుచుండు

గీ॥ వరుస తోడుత జైమినీ వాస్తుశాస్త్ర
గతులు మదినెంచి గృహములు కట్టుకొన్న
జనుల కెల్లను సౌఖ్యంబు సంభవించు
సరసగుణధామ । భైరవ స్వామి నామ ॥

**తా॥ గృహావరణమునందు చింత, మారేడు, శ్రీతాళ వృక్షములు (తాడి చెట్టు), వేపచెట్లు ఉన్నయెడల నీరసము కలుగును. నిమ్మ నేరుడు, వృక్షములు వున్న యెడల కీర్తి నశించును, ఖర్జూర వృక్షములు, రేగుచెట్లు ఉన్న అగ్ని**

భయము, పోకచెట్లు, జీడిచెట్లు, ఉమ్మెత్త మొక్కలు, మామిడిచెట్లు, కుంకుడుచెట్లు వున్నయెడల సుఖము నశించును. మద్దిచెట్టు, అవిశిచెట్టు, రావిచెట్టు, జువ్విచెట్టు వున్నయెడల దుఃఖము గలుగును. గృహమునకు ఎదుట దానిమ్మ, మునగ, తంగేడు మొక్కలు వున్న యెడల భార్యకు ప్రబలమైన వ్యాధులు గలుగుచుండును. పైన పేర్కొనబడిన వృక్షములుగాని, మొక్కలుగాని లేకున్న సర్వసపందలు, సమస్త సుఖములు కలుగజేయును.

## శంకువు - లక్షణము - కొలతలు

శ్లో॥ శంకో రామాయ సంఖ్యాయాం తదర్థ మావృతం తథా ।
శంకుం షడంగులం వృత్తం ద్వాదశాంగుల మున్నతమ్ ॥
శంకుం త్రిథావిభజ్యాఽ ద్యం చతురస్రం తతఃపరమ్-
అష్టాశ్రం చ తృతీయాంశ మనశ్ర మృజు మవ్రణమ్ ॥

తా॥ శంకువు ఆరు (6) అంగుళములు మందము, పండ్రెండు (12) అంగుళముల ఎత్తు వుండవలెను. ఆశంకువు పొడవును మూడు భాగములుగా విభజించి, క్రింది భాగము నాలుగు పలకలుగానూ, రెండవ (మధ్య) భాగము ఎనిమిది పలకలుగానూ, పై భాగము గుండ్రముగా (మల్లెమొగ్గవలె) చేయ వలెను. ఈ శంకువునకు కోతలుగానీ, గంట్లుగానీ, తొర్రలుగానీ, పగుళ్ళు గానీ, పుచ్చుగానీ, ఊలిపోయిగానీ ఉండరాదు.

## శంకువునకు పనికివచ్చు దారువులు

శ్లో॥ అశ్వత్థం ఖాదిరం చైవ న్యగ్రోధం దంతధావనమ్ ।
రక్తచందన ముఖ్యంతు శ్రీగంధాఽగరు రేవ చ ॥
వేణు బిల్వం చ కారంజ స్త్యాజ్యా దగ్ధ విభీతకాః ।
స్వర్ణ తామ్రం మౌక్తికాద్యై శంకుం వై స్థాపయే త్ఖనే ॥

తా॥ శంకువు చేయుటకు ప్రశస్తమగు దారువులు రావి, చండ్ర, మఱ్ఱి, కానుగ, రక్తచందనము, శ్రీగంధపుమ్రాను మొదలుగునవి, లోపల మఱియు వెలుపల చేవకలిగినవి శ్రేష్ఠమైనవి. ముడులు, తొర్రలు, వంకరలున్నవి, వెదురు, వేప, మారేడు, దయ్యములు నివసించుచెట్లు తగులబడిన వృక్షములు,

**ముళ్లచెట్లు, చేవలేని కర్రలు ఉపయోగించరాదు. బంగారము, రాగి, ముత్యములు మున్నగు నవరత్నములు, ఉంచి శంకువు స్థాపించవలెను.**

**శ్లో॥** కారం జార్జునసాలనీ వకురజాః పారాదమందారకా
బిల్వావైణవ యుగ్మపత్ర ఖదిరావృక్షా శ్శుభాస్సద్మసు
త్యాజ్యాదగ్ధ విభీతకాన్ను హినటా నింబాశ్చయే కంటకా
హ్యశ్వద్ధామ్ర కపిత్థతాళవకుళ ప్లక్షా అగస్త్యాదయః (కాలామృతే)

**తా॥ కానుగ, మద్ది, యేపె, కడప, కొడిశపాల, శ్రీ తాళము, పారిజాతము, వెదురు, దేవకాంచనము, చంద్ర, ఈ వృక్షములు, శుభకరములు, కాలిన చెట్లు, తాండ్ర, జెముడు, అత్తి, రావి, మామిడి, మర్రి, ముండ్లుగల చెట్లు, వెలగ, తాడి, జువ్వి, అవిశ ఈ మొదలగు చెట్లు అశుభకరంబులగును. శంకు వృక్షములలో విశేషమత భేదములు గానరావు. కొన్ని గ్రంథములందు నింబ (వేప) వృక్షము కూడా శుభమని చెప్పబడి యున్నది.**

## శంకువులు - భేదములు

గృహ వాస్తు కల్పద్రుమే –

**శ్లో॥** దేవాఽగారే శిలాశంకుః । గృహేఽదారుమయం తథా ।
మానాంగుళంతు దేవానం । నృణాం మాత్రాంగుళం భవేత్ ॥

**తా॥ దేవాలయములకు మానాంగుళముల కొలతలతో శిలాశంకువునూ, మానవగృహములకు మాత్రాంగుళముల కొలతలతో దారు (కొయ్య) శంకువును స్థాపించవలెను.**

**1. శిలా = రాయి ; 2. దారు = కొయ్య**

## శంకుస్థాపన స్థల నిర్ణయము

**శిల్పశాస్త్రే –**

**శ్లో॥** వాస్తో శ్శిరసి పుచ్ఛే చ యామ్యకుక్షౌ చ పృష్టతః ।
ఆయుః కామః ఖనేన్నైవ వామకుక్షౌ ఖని శ్శుభా ॥

**తా॥ వాస్తుపురుషుని శిరము, తోక, పొట్టకు కుడివైపున నూతేండ్లు బ్రతుక దలచినవాడు శంకుస్థాపనకు గోతిని త్రవ్వకూడదు. వాస్తు పురుషుని పొట్టకు ఎడమభాగమున త్రవ్వి శంకువును ప్రతిష్ఠించిన సర్వశుభములు కలుగును.**

**లల్లః–**

**శ్లో॥** త్యజేద్దశ శిరోభాగే బాహ్యే సప్తదశాంశకాన్ ।
మధ్యే నాభిం విజానీయాత్ తత్ర శంకుం ప్రతిష్ఠయేత్ ॥

**తా॥ గృహక్షేత్రము మొత్తమునూ 28 భాగములుగా విభజించి వాస్తుపురుషుని శిరము వైపు పదిభాగములను, వెనుకవైపు (పాదముల వైపు) పదునేడు భాగములున్నూ వదలి మధ్య భాగము వాస్తు పురుషుని నాభిగా తెలిసికొని ఆచోట శంకువును దృఢముగా నిలుపవలెను.**

**సనత్కుమార–**

**శ్లో॥** పుత్రస్య నాశ శ్శిరసి ప్రఘాతే, స్త్రియ క్షయః పాదతల ప్రఘాతే,
ఘాతేతు పృష్టే భయ రోగ పీడా పుత్ర లాభం ధనం చ కుక్షౌ

**తా॥ (ఈశాన్యమున) వాస్తు పురుషుని శిరమునందు శంకువు, స్థాపించిన పుత్ర నాశనము, పాదములయందు స్థాపించిన స్త్రీ వినాశనము, వీపుయందు నిలిపిన భయ, రోగ బాధలు నిశ్చయముగా గృహకర్తకు కలుగును.**

**సనత్కుమార–**

**శ్లో॥** నవభాగం గృహక్షేత్రం, కుర్యా న్మధ్యం త్రిథా పునః ।
భాగద్వయ మధోభాగే, శేషం, నాభిః ప్రకీర్తితమ్ ॥

**తా॥ ఇల్లు కట్టుకొనుటకు నిశ్చయించిన చోటును సరిగా కొలచి నిలువుగా తొమ్మిది భాగములుగాను, అడ్డముగా తొమ్మిది భాగములుగానూ విభజింప వలెను. వాస్తు పురుషుని పాదముల వైపు నాలుగు భాగములునూ, శిరము వైపు నాలుగు భాగములునూ విడచి, నడుమ నున్న భాగమునందు మరల మూడు భాగములొనర్చి దానిలో క్రింది రెండు భాగములు దక్షిణమున రెండు భాగములూ, విడచి మిగిలిన భాగమును వాస్తు పురుషుని నాభి**

**స్థానముగా నిర్ణయము చేసికొని ఆచోట శంకువును స్థిరముగానుండునట్లు స్థాపింపవలెను. నవపదబ్రహ్మస్థానములో ఈశాన్యమున శంకువు నిలుప వలెను.**

**శ్లో॥** మధ్యమే దేవతాగారే ఈశాన్యం మనుజాలయే ।
రాక్షసానాంతు నైరుత్యాం శంఖు స్థాప్య సుమంగళమ్ ॥

**తా॥ దేవాలయములకు మధ్యభాగమునందు, గృహమునకు ఈశాన్యము నందు, రాక్షస ఆలయమునకు నైరుతి భాగమునందు శంఖుస్థాపనము జేయుట ఉత్తమము.**

**శ్లో॥** ఇంద్రేచపుత్ర వృద్ధిశ్చ ఈశాన్యే శుభదంభవేత్
మధ్యేచస్థాపనం శంకుః కర్తావృద్ధిః ప్రజాయుతే (గ్రంధాంతరే)

**తా॥ తూర్పు, ఈశాన్య మధ్య భాగముల యందు యెచ్చటనైనను శంకుస్థాపన పనికివచ్చునని తెలియుచున్నది.**

## పునః (మరల) శంకుస్థాపనావసరము

**శ్లో॥** చోరా ద్యుత్పాటితే శంకౌ సప్త వింశ ద్దినాఽ ంతరే ।
గృహకృత్యేఽ నారబ్ధే పునః శంకుం ప్రతిష్టయేత్ ॥ **(వాస్తుసారే)**

**తా॥ దొంగలు పెకలించి తీసికొని వెళ్ళిననూ, శంకుప్రతిష్ఠ చేసి 27 దినములు దాటకముందే ఇంటిపనులు మొదలు పెట్టి చేయనపుడునూ, మరల యజమానికి శుభప్రదమగు పంచాంగశుద్ధి కలిగిన దినమున శంకువును (పాత దానిని తీసివేసి) నూతనముగ చెక్కిన దానిని విధిగా సశాస్త్రీయముగా నెలకొల్పవలయును.**

## శంకుస్థాపనకు కూడని కాలములు

**శ్లో॥** వృద్ధౌక్షయే వ్యాధిభయే రాజాటంక రజస్వలే ।
చారేక్రూరే దుర్ముహూర్తే శ్రాద్ధే మాసాంతికే తథా ।
తస్మిన్ శంకుం వినిక్షిప్య మృత్యుం హానించ నంలభేత్ ॥

**తా॥ జాతాశౌచ మృతాశౌచముల యందును, రోగపీడితుడై యున్నపుడును, రాజులవలన ఆటంక మేర్పడినప్పుడును, భార్య రజస్వలయై యున్నపుడును, గర్భవతిగా నున్నపుడును, పాప గ్రహ చారలయందును, దుర్ముహూర్తములందును, శ్రాద్ధ దినములందును శంకుస్థాపన చేసిన యెడల హానియు, మృత్యువును గలుగును.**

## జీర్ణ గృహముల నిర్మాణము

**గృహవాస్తు కల్పద్రుమే :**

శ్లో॥ జీర్ణోద్ధారే జలాఽగ్న్యాది భయతః పతితే గృహే ।
శ్రావణోఽర్జే, తథామాఘే, కారయే త్సుఖదం గృహమ్ ॥

**తా॥ శిథిలమైన దానినీ, అగ్ని, జలము మొదలగు వాని వలన ధ్వంసమైన దానినీ, శ్రావణ, కార్తిక, మాఘ మాసములయందు అయినను పునర్నిర్మాణము చేసికొనవచ్చును. సుఖము కలుగును.**

## దోషగ్రస్థ శంకువిషయము

**గృహ వాస్తు కల్పద్రుమే –**

శ్లో॥ కృతే భిన్నే చ యా స్థాణే యద్వా పక్షి సమారుహేత్ ।
తస్మిన్నాశో భవే క్షిప్రం గౌతమస్య వచోయథా ॥

**తా॥ శంకువు స్థాపించిన తరువాత యజమాని దానిచుట్టునూ నాల్గు దిక్కుల యందునూ, పై భాగమునందునూ కదలని రీతిగా దానిని దృఢముగా బిగింపవలెను. లేని యెడల శంకువు విఱిగిననూ, శంకువుపై పక్షులు వాలిననూ, ఆ గృహయజమానికి తప్పక నాశనము కలుగును.**

## వాస్తుపురుష స్థితి, స్థిరవాస్తు

శ్లో॥ నభస్యాదిషు మాసేషు త్రిషు త్రిషు యథాక్రమమ్ ।
పూర్వదిక్ శిరా వామ పార్శ్వ శాయీప్రదక్షిణమ్ ॥ (నారదీయే)

తా॥ భాద్రపద–ఆశ్వీజ–కార్తిక మాసములు తూర్పుతలగానూ,
మార్గశిర–పౌష్య–మాఘమాసములు దక్షిణ శిరస్సుగానూ,
ఫాల్గుణ–చైత్ర–వైశాఖమాసములు పశ్చిమ శిరస్సుతోనూ,
జ్యేష్ఠ–ఆషాఢ–శ్రావణమాసములు ఉత్తర శిరస్సుతోనూ,

**శ్రీవాస్తుపురుషుడు ఎడమప్రక్కకు తిరిగి పరుండి వుండునని తెలుపబడి ఉన్నది.**

**దీని విషయమున ఒక అత్యంత ముఖ్యమగు సందేహము ఒకటి ఉన్నది. గుడ్డెద్దు చేలో పడినట్లు ఆచరణ పనికిరాదు.**

**1. శంకు స్థాపన సమయమున – శంకువును వాస్తు పురుషనాభిస్థానము నిశ్చయించి స్థాపింపవలెనని కలదుగదా ! ఎడమ ప్రక్కకు తిరిగి పరుండిన వాస్తుపురుషుని నాభిని గృహనిర్మాణ భూమిలో నిర్ణయించుట ఎట్లు ?**

**2. తూర్పు శిరమున వాస్తు పురుషుడు ఎడమ ప్రక్కకు తిరిగి శయనించిన కాలమున అతని దృష్టి దక్షిణ పశ్చిమముల ప్రసరించును, ఆ దిక్కు సింహ ద్వార గృహమునే నిర్మింపవలెనుకదా, గృహనిర్మాణము ఆలస్యమై ఆవాస్తు పురుషుడు నాలుగు నెలల తరువాత దక్షిణ శిరస్సు గలవాడై–పశ్చిమ ఉత్తర దిశాదృక్కులుకలవాడైనచో దక్షిణ సింహద్వారము పనికిరాకుండా అయిపోయి కర్తకు అశుభములు కలుగుతాయికదా ?**

**స్థిరమగు అభిప్రాయముతో ఆలోచించినట్లయితే –**

**తూర్పు (ఈశాన్యము అని కొందరు) శిరస్సుతో స్థిరముగ వాస్తు పురుషుడు చేతులూ–కాళ్లూ బారుగాచాపుకొని బోర్లపరుండియున్న రూపము తోనే నాభిస్థానమున శంకువును నిలుపవలెననియూ; అతని దృష్టులు అధో ముఖముగా భూమిలోనికే చూచుచూ వుండినందున, ఏదిక్కు సింహ ద్వారము నైననూ యజమాని యొక్కయు, గృహము యొక్కయు అవసరములకు అందముగా, భద్రముగా క్షేమముగా నెలకొల్పు కొనవచ్చునని నిశ్చయాభి ప్రాయముగా స్వీకరించవచ్చు !**

మహర్షులే చెప్పిననూ, మహర్షుల పేరుతో ఇతరులు చెప్పిననూ–

శృతిర్విభిన్నాః స్మృతయశ్చ భిన్నాః

అను ఆర్యోక్తి చొప్పున ఒక్కొక్క మహర్షిగానీ, లేక శాస్త్రవేత్తగానీ, తమ అనుభవములనుచెప్పి వుండవచ్చునుగాక; మనము అన్నిటినీ ఆచరింప చూచినచో – గృహనిర్మాణము అసాధ్యమగుట తథ్యము !

అనేక మంది ధనవంతులు తమశక్తికొలది నోరూరించే అనేక పదార్థములు పెట్టవచ్చును. కాని, తినేటువంటివ్యక్తి తనకు ఏవి సరిపడునో, ఎంతమాత్రము తినిన శ్రేయోదాయకమో, తెలిసికొని తగినంత మాత్రమే తిని, సుఖమును పొందవలెను. మితములేని ఆశతో భుజించినచో వ్యాధి గ్రస్థుడై మరణించును.

ఆజీర్ణే భోజనం విషమ్ ! వృద్ధస్య తరుణీ విషమ్ !
మూర్ఖస్య పథ్యం విషమ్ ! ఆలస్యా దమృతం విషమ్

ఎంత గొప్పవారు చెప్పిననూ, తనకేది మేలు చేయునో దానిని బాగుగా తెలిసుకొని ఆచరించిన మానవులు మాత్రమే సుఖమును పొందుదురు. సూర్యచారము వలన కలుగు రాసుల తత్త్వము స్థిర–చర–ద్విస్స్వభావములుగా నిర్ణయింపబడినవి. అందు స్థిరరాశులు పరమశ్రేష్ఠమైనవి; ద్విస్స్వభావ రాశులు మధ్యమ ఫలదాయకములు; చరరాశులు అశుభఫలములను కల్పించును అని పెద్దలు శాస్త్రగ్రంథములలో చెప్పియున్నారు–

ఆ సూర్యునిచారమువలన కలుగు భాద్రపదాది మాసములు వాస్తు పురుషుని చరవాస్తువునకుమూలముకదా, అటువంటి సందర్భమున స్థిరవాస్తు అశుభదాయకమనియూ; చరవాస్తువు శుభదాయకమనియు తెల్పుట అసంబద్ధముగా వున్నది.

ప్రతిమూడు మాసములకునూ మారునటువంటి వాస్తుపురుష శయన స్థితి వలన శంకుస్థాపన నాటి సింహద్వారముఖము నాల్గుమాసముల తరువాత వేరొక దిక్కునకు మారును, ఆ విధముగా దాదాపు సంవత్సరకాలము సాగెడు గృహనిర్మాణము దాని దిశలు కకావికలై గృహనిర్మాణము అసాధ్యమగును.

**ఎడమవైపు తిరిగి శయనించిన వాస్తు పురుషుని నాభిస్థాన నిర్ణయము చేయుటెట్లు ? కావున స్థిరవాస్తువు మాత్రమే ఆచరణీయము ! చరవాస్తు వర్జనీయము ! స్థిరమాసములూ; స్థిరరాశులూ, స్థిరాంశలూ గృహనిర్మాణానికి కావాలి అనివాదుతూ ఉన్నపుడు స్థిరవాస్తు పనికిరాదు అనుట సరికాదు.**

## బావి - దిక్కులు - ఫలము

**వరాహ సంహితా -**

**శ్లో॥** ప్రాచ్యాఽది స్థలే సలిలే సుతహాని శిఖి భయం రిపు భయం చ ।
స్త్రీకలహః స్త్రీదౌష్ట్యం నైస్వం విత్తాఽత్మజ వివృద్ధిః ॥

**తా॥ తూర్పున బావి త్రవ్విన కుమారుల మరణము, ఆగ్నేయమున త్రవ్విన అగ్నిభయము, దక్షిణమున త్రవ్విన శతృభయము, నైఋతి యందు త్రవ్విన స్త్రీవలన పోరు, పడమర దిక్కున త్రవ్విన చెడునడవడిక కలుగును. వాయవ్యమున త్రవ్విన (సంపద) ఏమియు మిగులదు. ఉత్తరమున త్రవ్వినధనవృద్ధి, ఈశాన్యమున త్రవ్విన వంశవృద్ధి కలుగును.**

**విశ్వకర్మ ప్రకాశికా -**

**శ్లో॥** సర్వాసు దిక్షు స్సలిలం ప్రకుర్యా ద్విహాయ
నైర్ఋత్య, యమాఽగ్ని వాయూన్ ।
పూర్వోఽత్తరేఽశాన, జలేశ, దిక్షుః
కృతం జలం, సౌఖ్య, సుతప్రదంచ ॥

**తా॥ నైఋతి, దక్షిణ, ఆగ్నేయ వాయువ్య దిక్కులను వదలి, తక్కిన దిక్కుల యందు బావులు మున్నగు నీటి పట్టులు ఏర్పరచు కోవలెను. తూర్పు ఉత్తర, ఈశాన్య పడమర దిశలయందు జలాశయములు నెలకొల్పినచో సౌఖ్యము, కుమారులతో అభివృద్ధిని పొందెదరు.**

**కాలాఽమృతే-**

**శ్లో॥** సౌమ్య, ప్రాక్ జలధీశ కూప ఖననం కర్తు శ్చ లక్ష్మీ ప్రదమ్ ।

**తా॥ తూర్పు, ఉత్తరము, (ఈశాన్యము) పడమరల యందు బావులు త్రవ్విన గృహయజమానికి లక్ష్మీకటాక్షము కలుగును.**

**ముహూర్త గణపతి –శ్లో॥గేహేస్య మధ్యభాగేఽర్ధనాశః కూప కృతే ర్భవేత్**

**సంస్కృత వాచస్పత్యమ్ –శ్లో॥కూపే వాస్తు ర్మధ్యదేశే అర్థనాశంతు, నిశ్చయమ్**

**తా॥ ఇంటి మధ్యభాగము నందు బావిత్రవ్వినచో ఐశ్వర్యహాని జరుగుట నిశ్చయము.**

ఇంటి నిర్మాణము చేసుకునేటువంటి యజమాని మున్ముందుగా స్థలము సమతలముగా చేయుట, శంకుస్థాపనము చేయుట, ప్రాకార బంధనము, బావిత్రవ్వుట చేసి, అప్పుడు గృహమునకు పునాదులు మున్నగు నిర్మాణము క్రమముగా చేయవలెను.

## కూప ఆరంభ శుభ మాసములు

**వాస్తుసారిణి :**

**శ్లో॥** మార్గే, మాఘే చ, వైశాఖే, జ్యేష్ఠఽం తేపి, కార్తికే ।
కూప వాప్యాఽది కాఽరంభే మాసాస్యు శ్చోఽత్తమాః శుభాః ॥

**తా॥ బావులు, చెఱువులు, కోనేరులు, కోటల ముందు రక్షణకై ఏర్పరచు అగడ్తలు, ఇతర జలాశయములను వైశాఖము, జ్యేష్ఠము, కార్తీకము, మార్గశిరము, మాఘ, ఫాల్గుణ మాసములయందు ఏర్పరచుట ఉత్తమము.**

## బావి త్రవ్వుటకు మంచి తిథులు

1. వాస్తు సారిణీ : 2. గృహవాస్తు కల్పద్రుమమ్

శ్లో॥ తృతీయా పంచమీ చైవ సప్తమీ దశమీ తథా ।
అష్టమ్యేకాదశీ చైవ కూపాఽరంభే సుశోభనా ॥

**తా॥ బావి మున్నగు జలాశయములను ఏర్పరచుటకు తృతీయా, పంచమీ, సప్తమీ, అష్టమీ, దశమీ, ఏకాదశీ తిథులు శుభము.**

## బావి - వార ఫలము

**వాస్తు సారణీ, గృహ వాస్తు కల్పద్రువమ్ ।**

శ్లో॥ రవి వారే జలం నాస్తి । చంద్రే పూర్ణ జలం శుభమ్ ।
భూసుతే వాలుకా చైవ । చంద్రపుత్రే జలం బహు ॥
వాక్పతౌ యిష్ట తోయంచ । క్షారం చైవ భృగో ర్దినే ॥
శనౌతు జలహాని స్యా, ద్వారిజం ఫలమీదృశమ్ ॥

**తా॥ ఆది వారము నీరు పడదు. సోమవారము పూర్ణజలము పడును. మంగళవారము గులక, ఇసుక, రాళ్ళుపడును, (నీరు తక్కువ). బుధవారము నీరు ఎక్కువపడును. గురువారము తనుకోరిన తియ్యని, ఎక్కువ నీరు కలుగును. శుక్రవారము ఉప్పు రుచిగల నీరు పడును. శనివారము నీరు పడదు.**

## దోషములేని వీధి

శ్లో॥ వీధిర్గృహే యాప్రధితా సదృష్టి ।
ర్వీధిః ప్రదాయా పురః ప్రసిద్ధా ।
తాస్వా ప్రధానేన తు శూల మస్తి ।
నాస్త్వ ప్రధానేన వదేద్గుణజ్ఞః ॥ (వాసుతత్వ వివేకః)

శ్లో॥ వీధీ విశాలా గేహాచ్చేత్ – వీధీవాభ్యంతరే యది ।
న వేధ స్స్యా త్తదా వేధః – పురో వీధీకృశా యది ।

**తా॥ నిలువుగాఉన్న ఎదుటి వీధి ఇంటికంటె ఎక్కువ వెదల్పు కలిగి ఉన్నప్పుడు, వీధి అడ్డుదల కలిగి యున్నప్పుడు వేధదోషము ఎంత మాత్రమును లేదనియు, వీధి అడ్డముగాలేక తక్కువ వెదల్పు గల వీధి ఇంటికెదురై నిలువుగా నున్నప్పుడు వేధ దోషము కలుగును. స్థలమునకుగాని, గృహ మునకుగాని, అడ్డముగానొక వీధియుండి నిలువుగాకూడ ఒక వీధి యున్నయెడల, ఆ నిలువుగానున్న వీధిపోటు అడ్డవీధి కన్నను చిన్నదిగా నున్నయెడల వీధిశూల దోషము సంభవించదు.**

**క్రింద తెలుపబడినవి ఏ విధమైన వీధిశూలలు అయినప్పటికినీ ఆవీధిశూల ఖాళీ స్థలమునకు సంబంధించి ఉండవలెను. నిర్మించిన గృహము యొక్క ఏ భాగమునకు శుభ అశుభవీధి శూలలు ప్రాప్తించకూడదు. 'ఉపగృహములకు' శూలలు ఉన్నను దోషములేదని పెద్దల వచనము.**




ఇంటిస్థలమునందు వీధి పోటును తప్పించి, గృహ నిర్మాణం గావించి నివసించుచుండిన యెడల నిరుపేద కూడ అఖండ భోగ భాగ్య ఐశ్వర్యవంతుడై ధనాభరణ భూ వాహనాది అష్టైశ్వర్యవంతుడుకాగలడు.




## గృహమునకు 'వీధి-శూల' ప్రభావము

**1. పశ్చిమ - నైఋతి వీధి శూల :** ఇటువంటి వీధి శూల ప్రభావమున్న గృహమునందు నివసించెడి పురుషులకు చెడు ఫలితములు కలుగుచుండును. శుభకార్యములు వాయిదా పడుతూవుంటాయి. అందివచ్చిన అదృష్టము చేజారిపోతుంది.

**2. పశ్చిమ - వాయువ్య వీధిశల :** ఇటువంటి వీధిశూల శుభ మరియు కొన్ని అశుభములను కలుగజేయగలదు. ఈ శూల ప్రభావము ఇంటి యజమాని మీద, ఇంటియందుండు పురుషుల మీద ఉండగలదు. పదిమందిలో గుర్తింపు పొందగలరు. నమ్మకస్థులుగా పేరుగాంచుతారు. సంపాదించి నిలువచేసేదేమి వుండదు.

**3. తూర్పు - ఈశాన్య వీధిశూల :** ఈ శూల ప్రభావము గృహమునందలి పురుషులకు సర్వాధికారములను తెచ్చిపెడుతున్నది. ఈ గృహము నందు నివసించు పురుషులు ఇంటా బయటా కూడా ఒకేలా ఉంటారు. స్వాభిమానమునకు, ఆత్మ విశ్వాసమునకు కట్టుబడియుంటారు. అధికారుల మన్ననలు పొందగలుగుతారు.

**4. దక్షిణ - ఆగ్నేయ వీధిశూల :** ఇటువంటి వీధిశూల అశుభదాయకము ! గృహ యజమానికి ఆటంకములు, అపకీర్తి శత్రు, రోగ ఋణపీడలు కలిగించగలదు. బంధుమిత్రుల రాకపోకలతో గృహము సందడిగా యుంటుంది. ధనార్జన యందు కష్టములుండగలవు.




**5. దక్షిణ - నైఋతి వీధిశూల :** ఈ గృహమునందు నివసించెడి స్త్రీలకు చెడుఫలితాలు కలిగిస్తుంది. అనారోగ్యములు కలుగుట అవమానములకు గురిఅగుట. భార్యాభర్తల మధ్య సఖ్యతలోపించుట అనునవి జరుగుచుండ గలవు.

**6. ఉత్తర - వాయువ్య వీధిశూల :** ఇటువంటి వీధిపోటుకు గురైన గృహ మందలి యువతుల మీద దీని చెడు ప్రభావం అధికముగా ఉంటుంది. చదువుల యందుగానీ, ఏ ఇతర కార్యములందుగానీ శ్రద్ధ లేకపోవుట, పెళ్ళి సంబంధములు కుదరకపోవుట జరుగుతూఉండును.

శ్లో॥ క్షేత్రస్యాకచటాః క్రమాతపయశా వర్గాసురష్టాస్థితాః
ప్రాగాదౌ ఖగరాడ్బిడాలమృగరాట్ఛ్వాహ్యా ఖునాగాశ్వశిః
స్యాద్వర్గాద్యదిపంచమోరి రధదిగ్వరేషు యోనిస్త్రియమ్
దౌదౌదిక్షు విదిక్షు చైక మఖిలం మేషాదిపూర్వాదితః

గృహము నిర్మించే భూమికి తూర్పు మొదలు ఈశాన్యము వరకు 50 అక్షరములను 8 ప్రధమాక్షరములు కల వర్గులు గాను వాటికి ఇంద్రాది దిక్పతులు వర్గాధిపతులుగాను, గురుడ, మార్జాల, సింహ, శునక, సర్ప, మూషిక, గజ, శశములను వర్గ జంతు సంజ్ఞలుగాను ఏర్పడినవి.

## అష్టవర్గు నిరూపణ చక్రము

| యోనులు | అష్టదిక్కు వర్గమునందలి పేర్లు | |
|---|---|---|
| | అ. వర్గు : అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః | |
| | అధిపతి : గరుడపక్షి | |
| | దిక్కు : తూర్పు | |
| | రాశులు : మేష, వృషభములు | |
| | దికృతి : ఇంద్రుడు | |
| | ఆయము : ధ్వజాయము | |
| | గ్రహం : రవి | |
| | క. వర్గు : క ఖ గ ఘ ఙ | |
| | అధిపతి : పిల్లి | దిక్కు : ఆగ్నేయము |
| | రాశి : మిధునము | దిక్పతి : అగ్ని |
| | ఆయము : ధూమాయము | గ్రహం : శుక్ర |
| | చ. వర్గు : చ ఛ జ ఝ ఞ | |
| | అధిపతి : సింహము | దిక్కు : దక్షిణము |
| | రాశులు : కర్కాటక – సింహ | దిక్పతి : యమ |
| | ఆయము : సింహాయము | గ్రహం : కుజుడు |
| | ట. వర్గు : ట ఠ డ ఢ ణ. | |
| | అధిపతి : కుక్క | దిక్కు : నైఋతి |
| | రాశి : కన్య | దిక్పతి : నిఋరుతి |
| | ఆయము : శ్వాన | గ్రహం : రాహువు |

| యోనులు | అష్టదిక్కు వర్గమునందలి పేర్లు |
| --- | --- |
| | త. వర్గు : త థ ద ధ న<br>అధిపతి : నాగుపాము దిక్కు : పశ్చిమ<br>రాశులు : తుల–వృశ్చికములు దిక్పతి : వరుణుడు<br>ఆయము : వృషభాయము గ్రహం : శని |
| | ప. వర్గు : ప ఫ బ భ మ<br>అధిపతి : మూషికము దిక్కు : వాయువ్యం<br>రాశి : ధనుస్సు దిక్పతి : వాయువు<br>ఆయము : ఖర గ్రహం : చంద్రుడు |
| | య. వర్గు : య ర ల వ<br>అధిపతి : గజము దిక్కు : ఉత్తరము<br>రాశులు : మకర – కుంభములు దిక్పతి : కుబేరుడు<br>ఆయము : కాకాయము గ్రహం : బుధుడు |
| | శ. వర్గు : శ ష స హ ళ క్ష ఱ<br>అధిపతి : కుందేలు దిక్కు : ఈశాన్యము<br>రాశి : మీనము దిక్పతి : ఈశ్వరుడు<br>ఆయము : కాకాయము గ్రహం : గురువు, కేతువు |

గృహ నిర్మాణము చేయదలచిన యజమాని యొక్క నామాక్షరముల యందలి ప్రథమాక్షరము ఏ వర్గునందు కలదో ఆ వర్గు దిశ ఆ యజమానికి బలము గలది యగును.

శ్లో॥ వర్గేశాశాశ్తాక్ష్య మాపక సింహశా సర్ప మూషకాః ।
ఇభేణౌపూర్వతస్తేషాం స్వవర్గా త్పంచమోరిపుః ॥

**తా॥ యజమాని స్వవర్గమునకు ఐదవ వర్గు శత్రువర్గు అగును. స్వవర్గు ఎంత బలం గలదో శత్రువర్గు అంతటి అపకార మొనర్చును. ఈ వర్గాధిపతులైన జంతువుల యొక్క సహజ బలాబలముల ననుసరించి గృహము నిర్ణయించవలెను.**

**శ్లో॥** ఏకేన ధనలాభం ద్వితీయం చవవీసకమ్।
తృతీయం విషమిత్యాహుః చతుర్ధం వ్యాధిపీడితం ॥
పంచమం రిపుస్థానం షష్టంతు కలహప్రదమ్ ।
సప్తమం సర్వ సౌభాగ్యం అష్టమం మరణం ధృవమ్ ॥
(కామేశ్వరవాస్తుసుధాకరము)

తా॥ గృహయజమాని పేరు నందలి మొదటి అక్షరము ఏ వర్గము నందుండునో అది లగాయితు 1వర్గు స్వవర్గు, ధనలాభము, 2 వర్గు అర్ధబలం, 3వ వర్గు వీసబలము, 4 వర్గు వ్యాధిభయము, 5 వర్గు శతృభయము, 6 వర్గు షష్టమము కలహస్థానము, 7 వర్గు సప్తమము సకల సౌభాగ్యము, 8 వర్గు మృత్యుభయము.

జనార్ధనుడు అను పేరుగల వారికి "చ" వర్గు దక్షిణము, స్వస్థానము నైఋతి 'ట' వర్గు శుభము. ఈ "ట" వర్గు రెండవ స్థానము, మూడవదియైన "త" వర్గు పశ్చిమము సుఖప్రదము నాల్గవ స్థానము "ప" వర్గు వాయువ్యము వ్యాధి భయము. ఐదవ స్థానము "య" వర్గు ఉత్తరము శతృస్థానము, ఆరవ స్థానమైన "శ" వర్గు ఈశాన్యము కలహము, ఏడవ స్థానమైన "అ" వర్గు తూర్పు సర్వ సౌభాగ్యము, ఎనిమిదివ స్థానమైన "క" ఆగ్నేయమున మరణ భయము ఆరీతిగ పేరు నందలి మొదటి అక్షరము ఏ వర్గునకు సంభందించినదో తెలుసుకొని, ఆ వర్గునకు చెప్పబడిన స్థానము లగాయతు 4,5,6,8 స్థానములను వదలి మిగిలిన స్థానములలో గృహనిర్మాణము చేయవలయును.

శ్లో॥ స్వవర్గ షష్టా విజయంచ లక్ష్మీ త్రిసప్తకో భోగమతీవ సౌఖ్యమ్
అష్టం చతుర్ధి నిధనం దరిద్రతా బాణేచ మృత్యుశ్చ యధాక్రమేణ.

**తా॥ 1,6 వర్గులు విజయము, లక్ష్మీకరము, 3,7 వర్గులు భోగ, సౌఖ్య ప్రదములు, 5వ వర్గు అరిష్టము, 8 వ వర్గు మృత్యుప్రదము అని తెలుసుకో వలెను. ఇది పక్షాంతరముగా ఉపయోగిస్తున్నారు.**

# క్షేత్ర అర్పణము

ఆనందరావు, అనంతరావు, ఇందిర, ఈశ్వరరావు, ఉమా మహేశ్వర రావు, ఊబయ్య, ఋష్యేంద్రబాల, ఏకాంబరము, ఓబులరెడ్డి, ఐశ్వర్య, ఔరంగజేబు అను పేరు గలవారు "అ" వర్గువారు అగుదురు. ఇలా అన్నిఅక్షరములతో ప్రారంభమగుచున్న పేరులు కలవారు వారి వారి వర్గుల అర్పణములు చూచుకొనవలెను.

| దిశలు | "అ" వర్గు. 1 | | |
|---|---|---|---|
| తూర్పు | 1. స్వస్థానము | "అ" వర్గు | ధనలాభము, సుఖము |
| ఆగ్నేయము | 2వ స్థానము | "క" వర్గు | సామాన్య సౌఖ్యము |
| దక్షిణము | 3వ స్థానము | "చ" వర్గు | భోగ భాగ్యము |
| నైఋతి | 4వ స్థానము | "ట" వర్గు | వ్యాధి భయము |
| పశ్చిమము | 5వ స్థానము | "త" వర్గు | శతృ భయము |
| వాయువ్యము | 6వ స్థానము | "ప" వర్గు | కలహము |
| ఉత్తరము | 7వ స్థానము | "య" వర్గు | సుఖము |
| ఈశాన్యము | 8వ స్థానము | "శ" వర్గు | మరణము |
| | "క" వర్గు. 2 | | |
| ఆగ్నేయము | 1వ స్వస్థానము | 'క' వర్గు | శుభము |
| దక్షిణము | 2వ స్థానము | "చ" వర్గు | స్వల్ప సౌఖ్యము |
| నైరుతి | 3వ స్థానము | 'ట' వర్గు | సౌఖ్యము, భోగము |
| పశ్చిమము | 4వ స్థానము | 'త' వర్గు | రోగభయము |
| వాయువ్యం | 5వ స్థానము | 'ప' వర్గు | శతృవృద్ధి |
| ఉత్తరము | 6వ స్థానము | 'య' వర్గు | కలహము |
| ఈశాన్యము | 7వ స్థానము | 'శ' వర్గు | భాగ్యము |
| తూర్పు | 8వ స్థానము | 'అ' వర్గు | దరిద్రము |

| | "చ" వర్గు. 3 | | |
|---|---|---|---|
| దక్షిణము | 1.స్వస్థానము | 'చ' వర్గ | సుఖము |
| నైఋతి | 2వ స్థానము | 'ట' వర్గ | స్వల్ప లాభము |
| పశ్చిమము | 3వ స్థానము | 'త' వర్గ | విశేష సుఖము |
| వాయువ్యము | 4వ స్థానము | 'ప' వర్గ | రోగము |
| ఉత్తరము | 5వ స్థానము | 'య' వర్గ | శతృదోషం |
| ఈశాన్యము | 6వ స్థానము | 'శ' వర్గ | కలహము దరిద్రము |
| తూర్పు | 7వ స్థానము | 'అ' వర్గ | ధనం, మిత్రసౌఖ్యం |
| ఆగ్నేయము | 8వ స్థానము | 'క' వర్గ | మరణ ప్రదము |
| | "ట" వర్గు. 4 | | |
| నైఋతి | 1వ స్థానము | 'ట' వర్గ | సుఖము |
| పశ్చిమము | 2వ స్థానము | 'త' వర్గ | స్వల్ప సుఖము |
| వాయువ్య | 3వ స్థానము | 'ప' వర్గ | అధిక సుఖము |
| ఉత్తరము | 4వ స్థానము | 'య' వర్గ | రోగము |
| ఈశాన్యము | 5వ స్థానము | 'శ' వర్గ | శతృవృద్ధి |
| తూర్పు | 6వ స్థానము | 'అ' వర్గ | కలహము |
| ఆగ్నేయము | 7వ స్థానము | 'క' వర్గ | సౌభాగ్యము |
| దక్షిణము | 8వ స్థానము | 'చ' వర్గ | మరణము |
| | "త" వర్గు. 5 | | |
| పశ్చిమము | 1వ స్థానము | 'త' వర్గ | ధన లాభము |
| వాయువ్య | 2వ స్థానము | 'ప' వర్గ | స్వల్ప శుభము |
| ఉత్తరము | 3వ స్థానము | 'య' వర్గ | అధికలాభము |

| | |
|---|---|
| ఈశాన్యము | 4వ స్థానము 'శ' వర్గు వ్యాధి |
| తూర్పు | 5వ స్థానము 'అ' వర్గు శతృవృద్ధి |
| ఆగ్నేయము | 6వ స్థానము 'క' వర్గు కలహము |
| దక్షిణము | 7వ స్థానము 'చ' వర్గు లాభము, సౌభాగ్యం |
| నైఋతి | 8వ స్థానము 'ట' వర్గు మరణము |
| | **"ప" వర్గు. 6** |
| వాయువ్య | 1.వ స్వస్థానం "ప" వర్గు భాగ్యము |
| ఉత్తరము | 2వ స్థానము 'య' వర్గు శుభము |
| ఈశాన్యము | 3వ స్థానము 'శ' వర్గు లాభము |
| తూర్పు | 4వ వర్గు 'అ' వర్గు రోగ భయము |
| ఆగ్నేయము | 5 వర్గు 'క' వర్గు శతృ భయము |
| దక్షిణము | 6 వర్గు 'చ' వర్గు కలహము |
| నైఋతి | 7 వర్గు 'ట' వర్గు సౌభాగ్యము |
| పశ్చిమము | 8 వర్గు 'త' వర్గు మరణము |
| | **"య" వర్గు. 7** |
| ఉత్తరము | 1వ స్వస్థానం "య" వర్గు ధన లాభము |
| ఈశాన్యము | 2వ స్థానము 'శ' వర్గు సుఖము |
| తూర్పు | 3వ స్థానము 'అ' వర్గు అధిక సౌఖ్యము |
| ఆగ్నేయము | 4వ స్థానము 'క' వర్గు వ్యాధి భయము |
| దక్షిణము | 5వ స్థానము 'చ' వర్గు శతృ భయము |
| నైఋతి | 6వ స్థానము 'ట' వర్గు కలహము |
| పశ్చిమము | 7వ స్థానము 'త' వర్గు భాగ్యము |
| వాయువ్యము | 8వ స్థానము ప' వర్గు మరణము |

| | "శ" వర్గు. 8 | | |
|---|---|---|---|
| ఈశాన్యము | 1వ స్వస్థానం | "శ" వర్గ | ధన లాభము |
| తూర్పు | 2వ స్థానము | 'అ' వర్గ | శుభము |
| ఆగ్నేయము | 3వ స్థానము | 'క' వర్గ | అధిక లాభము |
| దక్షిణము | 4వ స్థానము | 'చ' వర్గ | వ్యాధి భయము |
| నైఋతి | 5వ స్థానము | 'ట' వర్గ | శతృ భయము |
| పశ్చిమము | 6వ స్థానము | 'త' వర్గ | కలహము, రోగము |
| వాయువ్య | 7వ స్థానము | 'ప' వర్గ | అధిక లాభము |
| ఉత్తరము | 8వ స్థానము | 'య' వర్గ | మరణము |

## ఆయములకు - ముఖ భాగము పృష్ఠము

శ్లో॥ గజాభిదృష్టిః సింహస్స్యాత్ వారుణాభిముఖో ధ్వజః ।
వృషభః ప్రాచ్యభిముఖో గజో యామ్య ముఖ స్తథా ॥
సన్ముఖా యామ్యోత్తరాశ్చ అశస్తాః పృష్ఠతోముఖాః ।
నస్వకీ స్వకీవై స్థానే చ ప్రశస్తాశ్చ త్రిదిక్షుచ ॥

(అపరాజిత పృచ్ఛ)

తా॥ ధ్వజాయ గృహము, తూర్పు దిక్కున ఉండి, పశ్చిమమును చూచెడిదగుట వలన దానికి పడమర సింహ ద్వారమును పెట్టవలయును. అనగా పశ్చిమ సింహ ద్వారము గల గృహములు తూర్పు ఇండ్లు లేక ఆవర్గమునకు చెందిన గృహములని తెలియవలెను. ఇదే విధముగా సింహాయ గృహము దక్షిణమున ఉండి ఉత్తరమును చూచెడిదగుట వలన దానికి ఉత్తరము నందు సింహద్వారమును పెట్టవలెను. వృషభాయము పశ్చిమ దిశయందుండి తూర్పును చూచుటవలెను గాన దీనికి తూర్పు సింహద్వారమును ఏర్పరచవలెను. గజాయముగల గృహము ఉత్తరదిశ యందుండి దక్షిణమును చూచుటవలన దీనికి దక్షిణ సింహద్వారము

నుంచలవలెను. ధ్వజ-వృషభములు, సింహ-గజములు పరస్పరాభి ముఖములు గలిగియుండును. అంతేకాక ఈ ఆయములు వాటి ఉభయ పార్శ్వములందు దృష్టి యోగ్యమైన నాల్గు ఆయములలో నొక్కొక్క ఆయము మూడు దిక్కులకు దృష్టిగలవై ఆ దృష్టిగల దిశయందు సింహద్వారము లుంచుట వలన శుభములను గూర్చగలవు. ధ్వజాది ఆయములకు తమ దిశ స్వవర్గములందు పృష్ఠభాగము గలవి. కావున ఆ దిశయందు సింహ ద్వారము పెట్టకూడదు.

### 1. ధ్వజాయ గృహము

ధ్వజాయ గృహమునకు తూర్పు దిశ స్వస్థానము మరియు పృష్ఠ భాగము కావున తూర్పు దిశ విడిచి దక్షిణ, పశ్చిమోత్తర దిశలందు సింహ ద్వారము ఈ గృహమునకు పెట్టుట యోగ్యము. గృహము మాత్రము స్థలము నందలి తూర్పు దిశయందే నిర్మించవలయును.

### 2. సింహాయ గృహము :

సింహాయ గృహమునకు దక్షిణము స్వస్థానము, పృష్టభాగము (వెనుక భాగము) గావున దక్షిణదిశ విడిచి పశ్చిమోత్తర, తూర్పు దిశలకు సింహ ద్వారమును ఉంచవలెను.

### 3. వృషభాయ గృహము :

వృషభాయ గృహమునకు పశ్చిమదిశ స్వస్థానము, పృష్ఠభాగము గావున పశ్చిమదిశ విడిచి ఉత్తర ,తూర్పు, దక్షిణములకు సింహ ద్వారములను, పెట్టవలెను.

### 4. గజాయ గృహము :

గజాయ గృహమునకు ఉత్తరము స్వస్థానము పృష్ఠభాగము గావున ఉత్తరదిశను విడచి తూర్పు, దక్షిణ, పశ్చమదిశలకు సింహద్వారము నుంచదగి యున్నది. ఏ ఆయము ఏ దిశలకు చెందినదో ఆయా గృహమును స్థలము నందలి ఆ దిశయందే నిర్మించవలెను. శత్రువర్గ స్థానమందు నివాసము

చేయరాదని (గృహమును నిర్మించ కూడదని) మాత్రమే శాస్త్రకారులు చెప్పి యన్నారు. శతృవర్గదిశయందు సింహద్వారము కూడదని తెలుపలేదు. విశేషించి ఆయా వర్గములందలి ఆయాగృహములు తన ఐదవ వర్గాయము లందు దృష్టికలిగి యుండుట వలన ఐదవ వర్గము నందే తప్పక సింహద్వారము కలిగి యుండుట బహుశాస్త్ర సమ్మతం, అయితే స్వవర్గము నందే గృహము నిర్మించి ఆ వర్గదిశయందే సింహద్వారము పెట్టుటకు కొన్ని ప్రత్యేక లక్షణములు కూడ తెలుపబడినవి.

## సింహ ద్వారము అర్వణము

శ్లో॥ అకచాః పశ్చిమద్వారం టవర్గః పశ్చిమోత్తరే ।
ధనదై 'త' ప వర్గేచ యశౌ పూర్వేతుపశ్చిమే ॥

(గృ॥వా॥శోరోమణి)

**తా॥ ఎనిమిది వర్గులకు చెప్పబడిన అక్షరములను బట్టి ఎవరికి ఏదిశ సింహద్వారము, అర్వణమో శ్లోకములో చెప్పబడెను. "అ,క, చ" వర్గుల వారికి పశ్చిమ సింహ ద్వారము అర్వణము "ట" వర్గునకు పశ్చిమ, ఉత్తర ద్వారములను 'త,ప' వర్గులకు ఉత్తర సింహ ద్వారమును, 'య, శ' వర్గులకు తూర్పు పశ్చిమ సింహ ద్వారములు అర్వణము, సింహ ద్వారము వర్గుల ననుసరించి పెట్టుట శుభ ప్రదము.**

## సింహద్వార ఫలములు

శ్లో॥ దిశాభిముఖ దిగ్గేహం ద్వారాభిముఖ దిగ్గృహం ।
స్థలముద్దిశ్య గేహం చ వదంత్యేవం యదేచ్ఛయా ॥
ద్వారస్య పశ్చాద్యా దిక్స్యాత్తదిక్షు గృహమిష్యతే –
తన్ముఖద్వార ముద్దిశ్య ప్రాగాది గృహనిర్ణయః ॥

(వాస్తుసారము)



**తా॥ గృహమందు ప్రవేశించుటకు ఏ దిశాభి ముఖముగా వెళ్ళుట జరుగునో ఆ దిశా గృహమని కొందరు, గృహమునకు సింహద్వారం యే దిశ యందు గలదో ఆ దిశా గృహమని**

**కొందరు గృహమునకు ముందు వెనుకల వదలబడిన ఖాళీ స్థలము ననుసరించి తక్కువ ఖాళీ స్థలము గల దిశయందు గృహమని కొందరు భిన్నాభిప్రాయముల కలవారైయున్నారు. కానీ శాస్త్రసాంప్రదాయంలో సింహ ద్వారమునకు వెనుక ప్రక్క ఏ దిశకలదో ఆ దిశా గృహముగానే గృహ దిశా నిర్ణయము గావించుట యుక్తముగా చెప్పబడినది. అనగా తూర్పు సింహ ద్వారముగల గృహము పశ్చిమ గృహము, దక్షిణ సింహ ద్వారముగల గృహము ఉత్తర గృహము, పశ్చిమ సింహ ద్వారము గల గృహము తూర్పు గృహము, ఉత్తర సింహ ద్వారము గలది దక్షిణ గృహముగా తెలుసుకున వలయును.**

శ్లో॥ నవీధ్య భిముఖం గేహపృష్ఠం కుర్యా త్కదాచన ।
వాధిబ్యాం మధ్యమేగేహం ప్రశస్తం సర్వభూమిషు ॥ వాస్తువిద్య

**తా॥ గృహమునకు సింహద్వారము వీధి వైపున ఉంచుట శ్రేయ స్కరము కొన్ని సందర్భములలో ప్రక్కలకు కూడ ఉంచవచ్చును. కాని ఇంటివెనుక ద్వారము వీధి వైపున ఉంచుట చాలా దోషప్రదము, ఇంటికి వెనుక ముందు వీధులున్న ఈదోషము వర్తించదు.**

శ్లో॥ పూర్వా శాలాతు చైకం తద్వారం పశ్చిమేభవేత్ ।
దండకం దక్షిణేశాలా తద్వారం చోత్తరేదిశి ॥
ఏకశాలా యథా ప్రత్యక్ద్వారం ప్రాగ్దిశి స్తథా ।
ఉదగ్దండక శాలానాం కుర్యాద్వారంతు దక్షిణే ॥ (వాస్తు విద్య)

**తా॥ స్థలమునందు దిగ్ నిర్ణయము చేసిన పిమ్మట యజమానికి అనుకూలమైన వర్గు ననుసరించి గృహ నిర్ణయము చేసిన తరువాత ద్వార నిర్ణయం గావించుటవల్ల స్వ వర్గురీత్యా ఉండవలసినది గృహమే కాని ద్వారము కాదని గ్రహించవలయును. కొందరు ఆధునిక పండితులు యోగ్యమైన వర్గులయందున్న గృహములకు సింహ ద్వారం శత్రు వర్గమునందు ఉన్నది కాబట్టి దోషమని తెల్పుచున్నారు. ఇందుకు ప్రమాణములు కానరావు.**

"పృష్ఠేక్షణా నంతరమేవ బాహ్యాత్ గృహప్రవేశో నశుభం కరోఽసే"

**తా॥ అను ప్రమాణము ననుసరించి గృహమునకు పృష్ఠ (వెనుక) భాగమందు పెట్టిన ద్వారము నుండి లోపలికి ప్రవేశించరాదను నియమము ఉన్నది. ఈ విధముగా ఏ దిశా నిర్మాణముగల గృహమునకు ఆదిశయందు ద్వారము పెట్టకూడదు. అయితే రాజవీధి ఆ దిశయందు ఉన్నప్పుడు మాత్రము. విధిగా ఆ దిశయందే గృహమునకు సింహ ద్వారము పెట్టవలెను. అప్పుడు ఆగృహమునకు పెట్టిన ద్వారమునకు పృష్ఠభాగ దోషము కలుగదు. రాజవీధి నుండి గృహమందు ప్రవేశించుట వలన ఆ దోషము సంక్రమింప జాలదు.**

## ద్వార స్థాన నిర్ణయము

**శ్లో॥** దిగ్గతం మందిరం కార్యం తద్వారం తు విశేషతః ।
విదిగ్గతం గృహం ద్వారం సర్వ దోషకరం భవేత్ ॥

(వాస్తు చంద్రిక)

తా॥ **గృహమును గాని, ద్వారమును గాని తూర్పు, దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిక్కుల యందు మాత్రమే నిర్మించవలయును. దానివలన సమస్త శుభములు సమకూరును. విదిక్కులగు ఆగ్నేయ, నైఋతి, వాయువ్య, ఈశాన్య దిశలయందు గృహమును నిర్మించినను, ద్వారమును పెట్టినను సమస్త దోషములు కలుగును.**

**శ్లో॥** వాయవ్యే చతథాఽగ్నేయే కృతం ప్రతిముఖం యది ।
అగ్నినా దహ్యతే గేహం ఇత్యాహ భగవాన్ భృగుః ॥

తా॥ **గృహమునకు సింహద్వారమును వాయువ్య ఆగ్నేయ దిశలను చూచునట్లు పెట్టిన యెడల ఆ గృహము అగ్ని దగ్ధమగునని భృగు మహాముని చెప్పియున్నారు.**

**శ్లో॥** నైరృత్యాం యది చేశాన్యాం కృతం చ ప్రతి వేశ్మకం ।
నాశ మాప్నోతి శీఘ్రం తు వ్యాధిశ్చ విపులా భవేత్ ॥

(ప్రాచీన కారిక)

**తా॥ గృహమునకు సింహద్వారమును నైఋతి ఈశాన్య ముఖముగ పెట్టిన ఎడలనుగాని ఆ గృహము వ్యాధులను గలుగజేయును. వంశ నాశనమును కలిగించును.**

**ఆ.తె** తెలియఁగా వాస్తు పురుషుఁ డేదిక్కుఁ జూచు ।
నచట ద్వారము లుంచ నర్థాప్తి సుఖము ।
నితర మగుచోట్ల నుంచిన ధృతి దొలంగీ ।
రోగశోకంబు లగును సరోజనాభ ॥ (కృష్ణ వాస్తు)

**తా॥ వాస్తు పురుషుడు ఏ దిక్కును చూచుందునో ఆదిశ యందు తలవాకిలి పెట్టిన యెడల ధనప్రాప్తియు శుభములు కలుగును. వాస్తు పురుషునకు పాదముల యందుగూడ దృష్టి కలిగి యుండును. కాబట్టి తక్కిన దిశలలో ద్వారములుంచిన రోగములును శోకమును సంభవించును.**

**శ్లో॥** మధ్యేద్వారం నకర్తవ్యం మనుజనాం కథంచన ।
మధ్యేద్వారే కృతేతత్ర కులనాశనః ప్రజాయతే ॥ (వా॥శా॥వి॥)

**తా॥ సింహద్వారమును గృహము యొక్క మధ్యభాగము నందు పెట్టరాదు. అట్లు పెట్టిన యెడల కులనాశనం కాగలదు. అనగా గృహము యొక్క పొడవునందలి మధ్యభాగమున ద్వార నిర్మాణము నిషిద్దమని విశ్వకర్మాది శాస్త్రకారులు చెప్పియున్నారు.**

శ్లో॥ బ్రహ్మస్థానే నవిధ్యేత । నాగద స్త స్థలానిచ ।
మృద్దారుబి ర్గవాక్షైశ్చ । మానపాకై సదైవచ ।
శయ్యాభాగైః కథంచన । స్వామినో మరణంతత్ర ।
మహా దుఃఖేన పార్థివ ॥ (బృహ॥ సంహి)

**తా॥ బ్రహ్మస్థానం అనగా గర్భ మధ్యంలో (గృహ మధ్యలో) మట్టి కొయ్యలతో చేయబడిన వస్తువులను గాని, రంధ్రములను గాని, నిర్మించుట క్షేమము కాదు. కావున గృహ మధ్యము నందు సింహ ద్వారములు నిర్మించుట కూడదు.**

శ్లో॥ ద్వారం ద్వారేణ వావిద్ధ మశుభా యోపపద్యతే ।
అనిష్ట ద్రవ్యసంయుక్తం ధనధాన్య వినాశనమ్ ॥ (విశ్వ॥క॥ప్రా)

తా॥ **ద్వారమునకు ఎదురుగా మరొక ద్వారము ఉండవలెనని అటుల లేకుండుట దోషమని భావించువారు పై ప్రమాణ శ్లోకార్థమును గమనించ వలసి యున్నది. ద్వారమునకు సరిగా ఎదురు ద్వారము ఉండుట వలన ద్వార విద్ధ సంభవించి అశుభములు ప్రాప్తించగలవు. ద్వారమును అయోగములగు పరికరములు (దారువులు) ఉపయోగించుట వలన ధనధాన్య వినాశనము కాగలదు.**

**నూతన గృహమునకు నిర్మించు సింహ ద్వారమునకు పాత కలప వాడకూడదు. అట్లు పాతకర్ర కలిపి వేయబడిన సింహద్వారము పెట్టిన పరహస్తగతము కాగలదు. కర్రల యొక్క చివరి భాగములు క్రిందకు బెట్టి ద్వారములు చేయకూడదు. ఇందువలన ఏదో ఒక భయము వెన్నంటి యుండగలదు. అదే విధముగా ద్వారమును ఒకే జాతికి సంబంధించి వృక్ష దారువులచే నిర్మించవలెను గాని చెక్కలయందు జాతి భేదము పనికిరాదు. సింహద్వారము మిగిలిన అన్ని ద్వారములు కన్నను పొడవు, వెడల్పుల యందు పెద్దదిగా ఉండవలెను.**

## ద్వార ఫలములు

**గృహమునకు ప్రధానమైనది సింహద్వారము, ఇతర ద్వారములు కూడా కొంత వరకు ప్రాధాన్యము కలిగియే యున్నవి. అట్టి ద్వారములు నెలకొల్పుటకు, తగిన సమయము, వాటికి కావలసిన దారువులు, వాటి ప్రమాణములు, వాటిని ఏర్పాటు గావించు స్థలము ముఖ్యములై యున్నవి. ద్వారములు తయారు గావించుటకు తగిన దారువులను (కట్టెలు) మయమత, శిల్పరత్నాది వాస్తు గ్రంథము లందు ఈక్రింది విధముగా చెప్పియున్నవి.**

**అంబాళము, ఇప్ప, చంద్ర, తుమికి, వెదురు, తాడి, కరిగొట్టు, రేల, సరల, దేవదారు, నిమ్మ, టేకు, వేప, పనస, మామిడి, నేరేడు, మద్ది,**

వేగిస, కొడిశ, మంగ, జమ్మి, కానుగ, నెల్లి, బంగారు, దేవదారు, చెట్ల యొక్క చెక్కలు, గృహాంగములైన సింహద్వారాది ద్వారములకు, కిటికీలకు, అల్మారాలకు, దూలములకు, కడ్డీలు మొదలగు ఇతర పరికరములు జేయుటకు యోగ్యమైనవిగా తెలుపబడినవి.

## ద్వార స్థాపన భిత్తి నిర్ణయము

శ్లో॥ భిత్తి మధ్యేకృతం ద్వారం ధన ధాన్య వినాశనం ।
అవహే త్కలహం శోకం నారీర్వా సంప్రదూషమేత్ ॥ (వి॥ ప్రకాశిక)

**తా॥ గోడకు మధ్యభాగము నందు ద్వారమును పెట్టినయెడల ధన, ధాన్య వినాశనము కలుగును. లేక యెల్లప్పుడు కలహములు వచ్చుచుండును. స్త్రీ దోషము కూడాకలుగును. కనుక గోడకు మధ్యభాగము నందు ద్వారము పెట్టకూడదు కొంచెము వెలుపలి భాగమందు పెట్టవలెను.**

శ్లో॥ గవాక్ష ద్వార దారూణి సంఖ్యా నిర్ణయ వక్ష్యతే ।
పూర్ణానుస్వార సంఖ్యా సంఖ్యా విషమ వర్జయేత్ ॥
సమసంఖ్యా శుభప్రోక్తం త్వష్టృ వాక్యేన నిశ్చయః ॥ (కామేశ్వర వాస్తు)

**తా॥ కిటికీలు, ద్వారములు, సున్న లేకుండా సమసంఖ్యగా ఉండవలెను. అనగా 10, 20, 30 ఉండరాదు.**

**సమసంఖ్యలు అనగా 2, 4, 6, 8 మొదలగు సంఖ్యలు ఉండవలెను బేసి సంఖ్యలు అనగా 1, 3, 5, 7 మొదలగునవి ఉండరాదు. బేసి సంఖ్య ఉన్నను సమ సంఖ్యలున్నను అశుభము కలుగును. అని త్వష్ట బ్రహ్మ నిర్ణయము కిటికీలు సమసంఖ్య గాను ద్వారములు సమసంఖ్య గాను మొత్తము రెండు సంఖ్యలు కలుపగా సున్న లేకుండా యుండవలెను. గర్భమునే కాక వసారాలతో సహా లెక్కించవలెను. "గృహాది ద్వారమారభ్యా" అనుటచే గర్భము వసారాలతో సహా గృహమగుచున్నది. కాన వసారాలు గర్భముతో సహా లెక్క చూచుకొనవలెను.**

## ద్వార సంఖ్యా ఫలము

**శ్లో॥** గృహాది ద్వారమారభ్యా ద్వియాంతం గృహముత్తమమ్ ।
గృహాది ద్వార తృతీయే శతృవృద్ధికరం భవేత్ ॥
దీర్ఘాయుష్యం చతుర్ ద్వారం మృత్యురోగాది పంచకమ్ ।
షష్టమం పుత్రలాభంచ సప్తమం మృతకం భవేత్॥
అష్టమం సర్వసౌభాగ్యం నవమం గృహదాహకమ్ ।
దశమం ద్వాదశోభం చ స్త్రీ నాశనం చోరబాధితమ్ ॥
ఏకాదశం ధన క్షీణం ద్వాదశం దైత్యమర్ధనమ్ ।
త్రయోదశం మృతం శీఘ్రం చతుర్థశం సంపత్కరమ్ ॥
పంచాదశాన మోక్షంచ షోడశం శుభదాయకమ్ ॥
(కామేశ్వరవాస్తు॥)

**తా॥ గృహములో ఉన్న ద్వారములు లెక్క చూచునప్పుడు గర్భములో ఉన్న ద్వారములు, వసారాలలో ఉన్న ద్వారములు మొత్తం ద్వారముల లెక్క చూడవలయును 2 ద్వారములు శుభము 3. శతృవృద్ధి 4. దీర్ఘాయువు 5. రోగ, మృత్యు ప్రదము 6. పుత్ర లాభం 7. మృత్యువు 8. సౌభాగ్యం 9. అగ్ని భయము 10. స్త్రీ నాశనము, చోర భయము 11. దరిద్రము 12. శతృజయము 13. శీఘ్ర మరణం 14. సంపద 15. ఫల శూన్యము 16. ద్వారములు శుభప్రదము.**

## ద్వార విన్యాసములు

**సూ॥** అహైశాన్యాది కోణేషు గృహస్య బాహ్యతః ఏతాని
వసంతి । ఈశాన్యే చరకో, అగ్ని కోణే విదారి, నైరు
త్యాం పూతనా, వాయవ్యే రాక్షసి । తస్మా
ద్గ్రామ పుర భవన కోణేషు వాసో న శుభదః కిమ్ ॥ (కామేశ్వర వాస్తు)

**విదిక్కులయందు గృహమునకు వెలుపల ద్వారము పెట్టిన ఫలములు**

**1. ఈశాన్య కోణమందు ద్వారము పెట్టిన - చరక అనియు**
**2. ఆగ్నేయ కోణమందు ద్వారము పెట్టిన - విదారి అనియు**

**3. నైఋతి కోణమందు ద్వారమున్న పూతన అనియు**

**4. వాయువ్య కోణమందు ద్వారమున్న రాక్షసి యనియు చెప్పబడెను. కావున పుర గ్రామ, గృహ, భవనములకు పై కోణములందు ద్వారములు పెట్టరాదు.**

## ఒక దిశలో ఉండు ద్వారములు

శ్లో॥ ఏకోదిశే బహిద్వారం మహదైశ్వర్య కారణమ్ ।
ద్వారద్వయం భోగవృద్ధిః ద్వారత్రయ మశోభగమ్ ॥
దుఃఖదం రోగదంచైవ దారా పుత్ర వినాశనమ్ ।
బహుళద్వార నిచయం దోషకృద్వ్యగ్రభాగతః ॥
గృహంతే ద్వార నిచయం సక్షయా సమయాస్మృతమ్ ।
షోడశ ద్వార పర్యంతం శుభా శుభ ఫలం విదుః ॥ (కామేశ్వర వాస్తు)

**తా॥ గృహమునకు ఒక దిశ యందు వెలుపలకు వచ్చు ద్వారము ఒకటి యుండిన ఐశ్వర్యవృద్ధి, రెండు ఉన్న భోగవృద్ధి, మూడు ఉన్న అశుభములు కలుగును. 5 ద్వారములున్న దుఃఖము కలుగును. 7 ద్వారములున్న రోగ భయము గలుగును. 9 ద్వారములున్న దారాపుత్ర నష్టము కలుగును. ఈ విధముగా 16 ద్వారములు వరకు శుభాశుభములు చూచుకొనవలయును. ప్రతిదిశకు ఈ ప్రకారము చూచుకొనవలయును.**

శ్లో॥ ఉత్తరం పంచమం ద్వారం బ్రహ్మణో విద్ధ ముచ్యతే ।
తన్మాతస్యశిరాహ్యేవ మధ్యేచైవ విశేషతః ॥
ద్వారాన్న కారయేద్ధీమాన్ ప్రాసాదేతు విపర్యయః ।
దేవతా సన్నిధానేతు శ్మశానాభిముఖే తథా ॥
స్త్రీనాశం సంభవేద్ధే స్యా త్పాషాణేచ తద్దైవచ ।
దేవతా సన్నిథానాస్థే గృహే గృహపతే క్షయః ॥
శ్మశానాభిముఖే గేహే రాక్షాసా ద్భయమాదిశేత్ ॥ (కామేశ్వర వాస్తు)

**తా॥ ఉత్తర దిక్కు నందు పంచమ ద్వార ముండెనేని బ్రహ్మ విద్ధ మనబడును. గృహ మధ్యమందు ద్వారము పెట్టరాదు. ప్రాసాదము నందు**

విపర్యయముగా అనగా విపులముగా చేయవలయును. మరియు దేవతా సన్నిధానము నందును, శ్మశానాభి ముఖము నందును ద్వారము పెట్టరాదు. ద్వారము పెట్టిన స్త్రీ నాశనము తప్పక కలుగును. దేవతాముఖ ద్వారమునకు గృహద్వారముండెనేని గృహపతి నాశనము, శ్మశానమునకు అభిముఖముగా ద్వారముండెనేని ఆగృహము నందు రాక్షస బాధలు సంభవించును.

## ద్వార వేధ లక్షణము వాటి ఫలములు

శ్లో॥ రథ్యా విద్ధం ద్వారం నాశో కుమార దోష తరుజమ్ ।
పంక ద్వారో శోకోవ్యయో అంబుధి ర్నారద ప్రోక్తః ॥
(కామేశ్వర వాస్తు)

1. వీధికి ఎదురుగా సింహద్వారము ఉండిన యజమాని నాశనము
2. వృక్షమునకు ఎదురుగా ద్వారము వుండిన పుత్ర నాశనము
3. ఎదుటి ఇంటి గోడ మూలకు ఎదురుగా ద్వారము వుండిన దుఃఖము కలుగును.
4. జల ప్రవాహమునకు ఎదురుగా ద్వారము వుండిన ధన క్షయము కలుగును.

శ్లో॥ తరువేధం విజానీయా ద్యది ద్వార ముఖేస్థితమ్ ।
కుమార మరణం జ్ఞేయం నానారోగశ్చ జాయతే ॥ (కామేశ్వర వాస్తు)

తా॥ ద్వారము యొక్క ముఖము నందు దూలమున్న తరువేధ అనబడును. అట్లు తరువేధగల ద్వారము పుత్రులకు మరణము కలుగజేయును. మరియు నానా విధ రోగములు కలుగజేయును.

శ్లో॥ జల స్రావ స్తథా ద్వారే మూరే నర్థచయో భవేత్ ।
ద్వారాగ్రే దేవసదనం బాలానామార్తి దాయకమ్ ॥ (కామేశ్వర వాస్తు)

తా॥ ద్వారము అడుగు భాగమున నీరుపోవు మార్గము ఉండిన అనర్థములు కలుగును. ద్వార అగ్రస్థానమున దేవసదనము ఉండిన బాలురకు రోగములు కలుగజేయును.

**శు॥** బిత్తి సంముఖ భాగ్యాపి నస్థాప్యం సంభ సంముఖమ్ ।
యుగ్మ యుగ్మ విభేదేన సమసంఖ్యాం ప్రకల్పయేత్ ॥
(వాస్తువిద్య)

**తా॥ ఒక గది గోడకు మరొక గది ద్వారము ఎదురుండకూడదు. అదే విధముగా అన్ని గోడల యొక్క సంధి స్థానములకు స్తంభములకు విదిక్కులకు అభిముఖముగా (ఎదురుగా) ద్వారములు పెట్టకూడదు. గదులు (గృహము నందు) బేసి సంఖ్య కల్గియుండకూడదు. గదులన్నియు ఒకే ప్రమాణం కలిగియుండవలెను. అన్ని గదులకు వుంచిన ద్వారములు కూడా సమాన కొలతలు కలిగి ఉండవలెను.**

## గృహ దోషములు

శ్లో॥ గురుతర దూలము క్రిందను
యర యగ ద్వారంబుగాని, మలమర కిటకీల్
స్థిరముగ బెట్టిన కీడని
ధరణిస్థలి రాముడనియె, దశరథరామా ॥

**క॥ ఇంటికి సింహ ద్వారము**
**వెంటను పరికింపజేసి వెలయంగ వలయున్**
**జంటగ గృహమొ త్తమునన్ ।**
**దంటకి సరిపెట్టవలయు దశరథరామా ॥**

**క॥ గుమ్మము లొక్క గదికిని ।**
**యిమ్ముగ మూడుండెనేని యీశ్వర దృష్టా ॥**
**సమ్మతి ద్వయచతురంబుల్ ।**
**యెమ్మెయి బెట్టంగవచ్చు నినకులరామా ॥**

శ్లో॥ ద్వారయుక్తం ద్వారహీనం క్వచి త్తచ్చ ప్రకల్పయేత్ ॥
కవాట యుగలోపేతం పార్శ్వయో స్సగవాక్షమ్ ॥
(వాస్తువిద్యా)

**తా॥ శాల వైశాల్యము గది యొక్క నిర్మాణ స్థితి ననుసరించి 1 నుండి 4 వరకు ద్వారములు పెట్టవలెను. ద్వారము లేకుండా గదిని నిర్మించ వచ్చును. ద్వారమునకు రెండు తలుపులు ఉండవలెను. ద్వారమున కిరువైపుల యందు కిటికీ ఏర్పాటు చేయవలెను.**

శ్లో॥ ఎదురింటి వెన్ను క్రిందను
తనవాకిలి కెదురు వెన్ను తగ దని భువిలో
తనవాకి లడ్డగోడయు
తనభూమిని నెగువగృహము తగదను మఱియున్.
(జ్యోతిష ప్రభావము)

**తా॥ ఎదురింటి వెన్ను క్రింద తన ఇంటి వాకిలి ఉండగూడదు. తన వాకిలి ఎదుట వెన్నుపోటు ఉండగూడదు. తన ఇంటి వాకిలి కడ్డముగా గోడ యుండగూడదు. తన భూమి యందు ఎగువ భాగమున ఇల్లు కట్టగూడదు.**

శ్లో॥ దారువులు రెంట ద్వారబంధంబు తగదు ।
మంచమును మూడ జాతు లమర్పరాదు ॥
తలుపు సరిపల్కలైయున్నఁ దగదటండ్రు ।
తొడరి దూలము నడుముగా నడవరాదు ॥ (శ్రీకృష్ణవాస్తు)

1. **రెండు జాతుల దారువుతో ద్వారబంధమును చేయరాదు.**
2. **మూడు జాతులు గల దారువుతో మంచమును చేయకూడదు.**
3. **తలుపులకు బేసిగా పలకలు పెట్టవలయును. సరిపలకలను పెట్టరాదు.**
4. **ఇంటిచొచ్చునపుడు దూలమునకు అడ్డముగా నడవరాదు.**

## సింహద్వార రూప లక్షణము

శ్లో॥ మూలద్వారం నాన్యైరభిసంధీత రూపవృద్ధ్యా ।
ఘటఫలపత్ర ప్రమదాదిబి శ్చతస్యంగకైశ్చిహ్నితమ్॥(బృహత్సంహిత్)

**తా॥ ప్రధాన (సింహ) ద్వారము ఇతర ద్వారములకంటే రూపములో పెద్దదిగా నుండవలయును గాని ఇతర ద్వారములతో సమము గాని చిన్నది గాని వుండకూడదు. ప్రధాన ద్వారమునకు పూర్ణ కుంభము ఆకులు, పండ్ల నృత్య దేవతలు మున్నగు మంగళ చిహ్నములుండుట వలన మిక్కిలి శ్రేయః ప్రదముగా ఉండును.**

## గ్రహ భాగ ద్వార నిర్ణయము

**సీ॥** శివశిఖిదైత్యవాయువు లాదిగాఁగఁ బ్రా
గ్దక్షిణపశ్చిమో త్తరములందు
నవ భాగములు సేయ రవిశశికుజ బుధే
జ్యక విసూర్యాత్మజ సైంహికేయ
కేతు స్థలములౌను గీష్పతిపైదేవ ।
తలకు శుక్రుని మీఁద నిలుచు నరుల

గీ॥ యిండ్లకుఁ బశువుల కెలమి సౌమ నిమీఁద
మునిచి యచటఁ గవాటంబు లుంచవలయు
మఱియుఁ బాపగ్రహస్థాన మధ్యమమున
నిలుపరాదు బహిద్ద్వా రనియఁతి గృష్ణ । (శ్రీ కృష్ణవాస్తు)

**తా॥ ఈశాన్యము ఆగ్నేయము, వాయువ్యం, నైఋతి అను నాలుగు మూలలను హద్దులుగా చేసికొని తూర్పు ద్వారమునకు ఈశాన్యము మొదలుగా ఆగ్నేయము వరకు కొలిచి ఆబారు కొలతను తొమ్మిది భాగములుగా చేయ వలయును. అటుల గావించిన వానిలో 1) సూర్యుడును, 2) చంద్రుడును, 3) అంగారకుడును, 4) బుధుడును, 5) బృహస్పతిని, 6) శుక్రుడును, 7) శనైశ్చరుడును, 8) రాహువును, 9) కేతువును అధిపతులై యుందుదురు. ఇందు 5.వభాగమైన బృహస్పతి స్థానంలో దేవత, మనుజులకు, పశువులకు ద్వారములు పెట్టవలయును. వీనిలో ఏవేని భాగమున ద్వారము నిర్మంపబడుచున్నదో ఆ భాగమున ఎడమ దిక్కు నందు కొంచెము ఎడమగా ఉండునట్లు చేసి ద్వారమును పెట్టవలయును.**

**దారుల ఎడమ వైపున తలుపులు అమర్చవలయును. దక్షిణ ద్వారమునకు నైఋతి మొదలుకొనియు, ఉత్తర ద్వారమునకు వాయువ్యము మొదలు కొనియు, కొలిచి మొదట చెప్పిన భాగముల ప్రకారము చూచుకొని ఆయా దిశలలో వాకిళ్లు పెట్టుకొనవలసినది.**

**సీ॥** నవ భాగం గృహంకృత్వా పంచ భాగంతు దక్షిణే ।
త్రిభాగ ముత్తరేకార్యం శేషంద్వారం ప్రకీర్తితమ్ ॥
(వాస్తు ప్రదీపము)

**తా॥ ఇంటి యొక్క పొడవును తొమ్మిది భాగములు గావించి (సవ్య క్రమంగా) అందు ఐదు భాగములు ప్రారంభంలోను మూడు భాగములు అంత్యమునందు వదలి మధ్యనున్న ఒక్క భాగము నందు సింహద్వారము పెట్టవలయును.**

**1. తూర్పు సింహద్వారమైన ఈశాన్యము వైపున ఐదు భాగములుఆగ్నేయము వైపు మూడు భాగములు వదలి ఆరవ భాగమున ద్వారము పెట్ట వలయును.**
**2. దక్షిణ సింహద్వారమైన నైఋతి వైపు మూడు భాగములు వదిలి ఆగ్నేయమునుంచి ఆరవ భాగమున సింహ ద్వారం ఉండాలి.**
**3. పశ్చిమ సింహద్వారమైన నైఋతి నుండి ఐదు భాగములు వాయువ్యం వైపు మూడు భాగములు వదలి ఆరవ భాగము ద్వారము పెట్టవలయును.**
**4. ఉత్తర సింహ ద్వారమైన వాయువ్యం వైపు ఐదు భాగములు ఈశాన్యం వైపు మూడు భాగములు వదలి ఆరవ భాగమందు ద్వారము పెట్టవలయును.**



శ్లో॥ అనల భయం, స్త్రీ జన్మ, రిపు వృద్ధి నరేంద్ర తో ఉపలబితః ।
సంపదాభి కత్వమ నృతం క్రౌర్య చౌర్యక్రమాత్పూర్వే ।
తాత్పః అత్రస్తు శాస్త్రే ఈశానకోణస్య పూర్వేణ సంబంధః ॥

**తా॥ అను శాస్త్రానుసారము సింహద్వారము పెట్టవలసి ఉన్నపుడు, గర్భము యొక్క దిశ ఎంత పొడవు యున్నదో దాని తొమ్మిది భాగములు విభజించవలయును.**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | రవి | – | స్థానములో | – | అగ్ని బాధలు |
| 2. | చంద్ర | – | ,, | – | స్త్రీసంతానప్రాప్తి |
| 3. | కుజ | – | ,, | – | కలహము |
| 4. | బుధ | – | ,, | – | రాజ్య ప్రాప్తి |
| 5. | గురు | – | ,, | – | ధన ధాన్యవృద్ధి |
| 6. | శుక్ర | – | ,, | – | ఉన్నత స్థితియు |
| 7. | శని | – | ,, | – | అసత్యము |
| 8. | రాహు | – | ,, | – | కర్కశత్వము |
| 9. | కేతు | – | ,, | – | చోర భయము |

**శ్లో॥** ఏకం ప్రధాన ద్వార స్వాభిముఖేన్యత్రప్రధానకమ్ ।
ద్వారం గృహచ్చ ద్విగుణం తాదృగ్వేదః ప్రజక్షతే ॥

**తా॥ ఒక గృహము యొక్క సింహ ద్వారమునకు ఎదురుగా ఉండునట్లు మరొక గృహ సింహద్వారమునుంచుట దోషప్రదము ఇందువల్ల ధనహానియు, కొన్ని సందర్భములలో మరణము కూడ తటస్థించును.**

**మొదటి గృహ ద్వారము యొక్క నిలువు కొలతలకు రెండింతలు దూరము ద్వారముల మధ్యయందు ఉన్న దోషములేదు.**

## తలుపులు తెరువగా - మూతబడుటవలనఫలం

శ్లో॥ ఉన్మాదోద్ఘటితే ద్వార పిహితేస్యాద్ధి నిశ్చయః ।
పిధాయచే దుర్ఘటే ద్వై కులనాశో భవే దలమ్ ॥ (కామేశ్వరవాస్తు)

**తా॥ తెరుపబడిన తలుపులు వాటికవి మూయబడిన యజమానికి మతి చాంచల్యము గలుగును. మూయబడిన తలుపులు వాటికవి తెరువబడిన కులనాశనము కలుగును.**

శ్లో॥ పీడాకర మతిపీడితం అంత రవనతం భవేదభావాయ ।
బాహ్యాఽవనతే ప్రవాసో దిగ్భ్రాంతే దస్యుభిః పీడా ॥
(కామేశ్వర వాస్తు)

**తా॥ మిక్కిలి కష్టతరముగా తలుపు పడిన పీడయు, లోపలకు వంగిపడిన సర్వ వస్తు నాశనము, వెలుపలకు వంగిపడిన పరదేశ నివాసము కలుగును., తలుపులు ధ్వని చేసినచో చోర భయము కలుగును.**

## ద్వార వేధా ఫలము

శ్లో॥ స్తంభం ద్వారం భిత్తిం చ విపరీతం నకారయేత్ ।
అమీషాం వైపరీత్యేన దోషాస్స్యు ర్గృహవోన్నృణామ్ ॥

తా॥ **గృహములకు నెలకొల్పబడు స్తంభము ద్వారములు, గోడలు వాటిని నిర్దేశించబడిన స్థలములందే నెలకొల్పవలెను. అందుకు వ్యతి రేకముగా ఉండిన యెడల అనేక దోషములు మానవులకు (నివశించిన వారికి) కలుగుచుండ గలవు.**

**గృహ సింహద్వారమునకు సంభవించు వివిధ వేధలను దోషములను వాటి వల్ల కలుగు ఫలితములను సమరాంగణ, విశ్వకర్మ ప్రకాశికాది వాస్తు గ్రంథములందు విపులముగా తెలుపబడినవి. అట్టి దోషములను గమనించి సింహ ద్వారమును పెట్టుకొనుట ఉచితము. ధ్వనిజేయు ద్వారములు ఆకలిని కలిగించగలవు, పై కమ్ముచే నొక్కబడిన ద్వారము పీడాకారము. ముందు భాగమందు నాల్గు మార్గములు కలిసి వీధులున్న ద్వారము సేవకులచే**

కష్టమును కలిగించును. ద్వారమునకు ఎదురుగా జెండా చెట్లుయున్న ద్రవ్య నాశనము. వృక్షములున్న శిశు నాశనము, ఎదురుగా బురద గుంటలు మొ॥వి యున్న శోకము, నీటి కాలువలున్న అధికవ్యయము, బావి (కూపము) ఎదురుగానున్న యజమానికి అపస్మార వ్యాధి, సింహ ద్వారమునకు ఎదురుగా దేవాలయములు, దేవతా విగ్రహములుండిన నాశనము, బ్రహ్మ ఆలయమున్న కులనాశనము, స్తంభముఎదురుగా ఉండిన స్త్రీలకు అరిష్టము. పెద్ద గోతులెదురుగా నున్న ధన నాశనము, దైవ ఆలయములకు సంబంధించిన ధ్వజములు, ఎదురుగా ఉండిన బంధనము, ఐశ్వర్యహాని దిగుడు బావు లెదురుగానున్న సన్నిపాతాది జ్వర భయము, కాలాల చక్రం (కుమ్మరి సానె) ఎదురుగానున్న హృదయ వ్యాధులు, నీరుఉన్న యెడల దారిద్ర్యము, ద్వారమునకు ఎదురుగా పాలకేంద్రం యున్న వ్యాధులు కల్గుచుండును, కుమ్మరాము (కుండలు కాల్చు బట్టీ) ద్వారమున కెదురుగాయున్న సంతాన కష్టము. రైస్‌మిల్లు ఎదురుగనున్న ధనహాని, గొప్పవగు బండరాళ్ళు యున్న అశ్మరీ వ్యాధి కల్గును. నీళ్ళకుండలు ఎదురుగా ఉన్న దుష్టులు దరిచేరగలరు. బూడిద సంబంధములున్న మొలల వ్యాధి, చెట్ల నీడ సింహద్వారముపై పడిన భాగ్యము, మట్టిదిబ్బలు, పుట్టలు, దేవతా వాహనములు ద్వారము నకు ఎదురుండిన విదేశ సంచారము. ద్వారమునకు గల పై కమ్ము ఏక ఖండముగా ఉండవలెను. మధ్యలలో సంధించుట కూడదు, అందువలన యజమానికి హాని సంభవించగలదు. ద్వారము పైకి, (ద్వారం వెడల్పునందు పై భాగంలో) దూలములు చిన్న దూలములు, కమ్ములు వేయరాదు, వ్యాధి సంతాపములు కల్గును. గడపకమ్మి పైకి దూలము వేసిన స్త్రీ సంతతి మరణము లేక అపవాదులు కలుగగలవు.

"తస్మాత్సర్వ ప్రయత్నేన ద్వారవేధం విసర్జయేత్" అను శాస్త్ర వాక్యము ననుసరించి ద్వార వేధలను కనుగొని అవి తగలని విధముగా సింహ ద్వారమును పెట్టుకొనవలెను. పూర్వమే పెట్టియున్న ద్వారములకు సంభవించిన వేధలను ప్రయత్న పూర్వకముగా తొలగించవలెను.

# ద్వారవేధ పరిహారము

**శ్లో॥** మార్గతరు కోణస్తమ్భభ్రమవిద్ధ మశుభదం ద్వారమ్।
ఉచ్ఛ్రాయాద్ద్విగుణమితాం త్యక్త్వా భూమిం నదోషాయ॥

యది ద్వార సమ్ముఖే మార్గః, వృక్షోవా, అన్యగృహకోణోవా, కూపోవా, స్తమ్భోవా, దేవమఠోవా తదా ద్వారవేధః. సచ గృహపతేరశుభకర ఇత్యర్థః. అథ ద్వారోచ్ఛద్విగుణమితాం భూమిం విహాయ యది మార్గాదయ స్తిష్ఠన్తి తదా ద్వారం నదోషాయేతి. (వాస్తునారాయణీయమ్)

**తా॥ ద్వారమునకు అభిముఖముగా మార్గమైనను, వృక్షమైనను, ఇతరగృహ కోణమైనను, కూపమైనను, స్తంభమైనను, దేవమఠమైనను, ఉన్నచో ద్వార వేధ కలిగినదని తెలుసుకునవలయును. ద్వారమునకు రెట్టింపు పరిమాణము గల భూమిని వదలి పైజెప్పిన విషయములు ఉన్నయెడల ద్వారవేధ దోషము లేదు.**

అథ కాష్ఠే పురాతనే సతి పురాతనం కాష్ఠాన్తరం యోజ్యే నూతనే చేన్నూతనం యోజ్యమ్। తదుక్తం వ్యాసేన

శ్లో॥ అన్యవేశ్మస్థితం దారు నైవాస్మిన్ ప్రయోజయేత్
నతత్ర వసతే కర్తా వసన్నపి నజీవతి। తథాచ శార్ఙ్గధరః

శ్లో॥ నూతనే నూతనం కాష్ఠం జీర్ణే జీర్ణం ప్రశస్యతే
జీర్ణేచ నూతనం కాష్ఠం నజీర్ణం నూతనే శుభమ్(సమరాంగణే)

శ్లో॥ ఇష్టకా లోష్టపాషాణా మృత్తికా జీర్ణమాయసమ్
తృణం పర్ణం బుధైః ప్రోక్తం దారునూత్నం గృహాయవై ॥

**తా॥ పాతకర్రను పాతకర్రతో చేర్చవలెను గాని కొత్తకర్రతో చేర్చకూడదు, కొత్తకర్రను కొత్తకర్రతో చేర్చవలెను గాని పాతకర్రతో చేర్చకూడదు. ఇటుకలు, పాషాణములు, మట్టి, ఇనుము, తృణము, పర్ణము, దారువులు నూతన గృహములకు నూతనమైనవే వాడవలయును కాని పాతవి వాడరాదు.**

## ఆయము ననుసరించి ద్వార నిర్ణయము

**శ్లో॥** పూర్వాది ధ్వజధూమి సింహ శునకోక్షాణః ఖరేభోష్ట్రకాః ।
ధారా స్వప్న వదే ధ్వజోఽఖిలముఖః ప్రాగ్రామ్యవక్త్రోగజః ।
ప్రాగాస్యో వృషభోసి వారుణముఖః సింహః ప్రశస్తాఇమే ॥

**తా॥ పూర్వాది దిక్కులయందు ధ్వజాద్యాయములు బలిష్ఠంగా నుండును. ధ్వజాయముగల ఇంటికి అన్ని దిక్కులయందు ద్వారముంచ వచ్చును. గజాయమునకు తూర్పు దిశను దక్షిణ దిశను, వృషభాయమునకు తూర్పు దిశను, సింహాయమునకు తూర్పు దక్షిణ ఉత్తర దిక్కులయందును ద్వారము ఉంచవచ్చును.**

## రాశిననుసరించి ద్వార నిర్ణయము

**శ్లో॥** ప్రాహుః ప్రాణ్ముమంత్య వృశ్చిక కుళీరాణాం ప్రేచేతోముఖమ్ ।
జూకోఽపాంత్య గవాంయమాస్యమబలాయుగ్మేణకానాఽహితం
సౌమ్యాన్యం గృహమాఽద్య సింహధనుషామత్రేష్ట కాష్ఠాననమ్ ।
కృత్వాప్తాన్యక కుబ్జవాక్ష వదనం తత్కార్యమాన్నంన్యపేత్ ॥

**తా॥ మీన, వృశ్చిక, కర్కాటక రాసులవారికి తూర్పు దిశ గాను, తులా, కుంభ, వృషభరాసులవారికి పశ్చిమ దిశగాను, కన్యా, మిధున, మకర రాసులవారికి దక్షిణదిశగాను, మేష, సింహ, ధనురాశుల వారికి ఉత్తర దిశగాను ద్వారములు శ్రేష్ఠములు. కిటికీలు అన్ని దిక్కుల యందును పెట్టవచ్చును. ఇది ఒక మతము.**

## నక్షత్ర దిశ ద్వార నిర్ణయము

శ్లో॥ కృత్తికాదం సప్తపూర్వే మఘాద్యం సప్త దక్షిణే ।
మైత్రాద్యం పశ్చిమ జ్ఞేయం ధనిష్ఠాత్ సప్త ఉత్తేరే ।
యద్దిగ్భసంస్థితే చంద్రే తద్దిగ్ద్వారం ప్రశస్యతే ।
పృష్ట దక్షిణ వామస్థే నవిదద్యాత్క దాచన ॥

**తా॥ కృత్తికాది ఏడు నక్షత్రములు తూర్పునందును, మఘాది ఏడు నక్షత్రములు దక్షిణముననను, అనూరాధాది ఏడు నక్షత్రములు పశ్చిమ దిక్కునను, ధనిష్ఠాది ఏడు నక్షత్రములు ఉత్తర దిక్కునను ద్వారము లుండుట ఉత్తమము. (అభిజిత్ సహా) ఏ దిక్కునందు చంద్రుదుండునో ఆ దిశ యందు ద్వారము పెట్టవలెను. పృష్ఠ దక్షిణ వామభాగములందు చంద్రుదుండగా ద్వారము కూడదు.**

**ద్వారము లేకనే కట్టుబడిగల ధాన్యపు కొట్టునకు తూర్పు – దక్షిణము నందు దారిని ఉంచనగును ఇట్టి గృహమునకు "ధ్రువము" అని పేరు.**

## ఒకేగోడపై రెండు ఇళ్ళు

**శ్లో॥ ఏకభిత్తిషు సంబదధం కారయే ద్యో గృహద్వయం**
**యమతుల్యం తదాగేహం భర్తృ గేహ వినాశనమ్॥**

**తా॥ ఒకే గోడను ఆధారముగా చేసుకుని రెండు గృహములు నిర్మించినచో అది మృత్యుప్రదము. యజమానియును, గృహమున్నూ అచిరకాలములో నశించును.**

## వాస్తు దోషము లేని తావులు

**శ్లో॥** చాతుర్ద్వారే గృహే చైవ, వాస్తుదోషో, న విద్యతే ॥

**తా॥** నాలుగు దిక్కుల యందునూ నాలుగు ద్వారములు ఏర్పరచిన యింటికి వాస్తుదోషములేదు.

మయమతే –

శ్లో॥ గృహస్య దక్షిణేభాగే చక్రాఉ కారంతు మన్దిరమ్ ।
స్థాపయేత్ సర్వ సౌభాగ్యం గృహదోషో, న విద్యతే ॥

**తా॥ ఇంటికిముందుభాగమున దక్షిణవైపు (అనగా – ఆగ్నేయకోణమున, గుండ్రని ఇల్లు కట్టుకొనినచో వాస్తు దోషములు లేకపోవుటయే గాక సకల సౌభాగ్యములు కలుగును.**

శ్లో॥ చతుర్ద్వార గృహే చైవ దేవానాం మండపే తథా ।
నిషాద గేహ సత్రేషు వాస్తుదోషో న విద్యతే ॥ **(మయమతే)**

**తా॥ నలుదిక్కులయందు వాకిళ్లు గల ఇంటికినీ; దేవతల మండపము లకునూ; వేటాడి జీవించువారల ఇళ్ళకునూ, సత్రములకునూ వాస్తు దోషము లేదు. ముహూర్త మార్తాండే –**

శ్లో॥ పాషాణేఽష్టాది గేహంతు, నింద్యమాసే, న కారయేత్ ।
తృణ, కాష్ఠ గృహాఽరంభే మాసదోషో, న విద్యతే ॥

**తా॥ రాయితో, ఇటుకతో గోడలుపెట్టి కట్టునటువంటి ఇళ్లు నింద్య మాసములలో కట్టరాదు; గడ్డితోనూ, కొయ్యతోనూ గోడలు, కప్పు నిర్మించు కొని కట్టు ఇంటి విషయమున మాసదోషములు పట్టింపులేదు.**

**నారద సంహితా :**

శ్లో॥ సర్వతో ముఖ గేహేన విష దోషో నవిద్యతే ।

**తా॥ నాలుగు దిక్కుల యందునూ ద్వారములు పెట్టికట్టిన, ఇళ్లకు ఈ వాస్తుపురుషుని దృష్టి వేధా దోషము లేదు.**

**చ్యవన మహర్షి –**

శ్లో॥ ఆయ. వ్యయౌ । భూ శుద్ధించ । తృణగేహే న కారయేత్ ।
శిలా న్యాసాఽది, న కుర్మా । త్తథాఽగారే పురాతనే ॥

**తా॥ పూరి (గడ్డి) ఇల్లు ఏర్పరచుకొను నపుడు కానీ, అటులనే తమ పాతయిల్లు బాగు చేసికొను నపుడు కానీ ఆయ – వ్యయములునూ, భూ శుద్ధియునూ, శిలా న్యాసము (శంకు స్థాపన) నూ ఏ మాత్రము చేయరాదు అని చ్యవన మహర్షి చెప్పెను.**

**విశ్వ కర్మ ప్రకాశికా –**

శ్లో॥ ఏకాదశ కరా దూఽర్ధ్వం ద్వాత్రింశ ద్ధస్తకాఽవధి
తావ దాఽయాదికం చింత్యం, తదూఽర్ధ్వం న చింతయేత్ ॥

**తా॥ పదునొకండు (11 హస్తములు పై కొలత కలిగినటువంటి గృహ నిర్మాణ స్థలమమునకునూ, ముప్పది రెండు (32) హస్తము లోపల కొలత కలిగినటువంటి గృహనిర్మాణ స్థలము కలిగిన దానికినీ మాత్రమే వాస్తు నియమము ప్రకారము ఆయము కొలతలు మున్నగునవి చూడవలెను. పదునొకండు (11) హస్తముల లోపల కొలతవుండిన గృహనిర్మాణ భూమికినీ, ముప్పది రెండు (32) హస్తముల కొలతకు మించి వుండిన గృహనిర్మాణ భూమికినీ – వాస్తు కొలతలు ఏ మాత్రమునూ పట్టించుకొనరాదు. (హస్తము = 2 అడుగులు) (మెట్రిక్ కొలతలు మీటరు 1కి = దాదాపుగా 1 గజము 3 అంగుళములు)**

v **ఇంటిని నిర్మించు భూమి 5 గజముల 1 అడుగు 6 అంగుళములకొలత కంటే తక్కువ కొలతవుండిననూ, 16 గజముల కొలతను మించి వుండిననూ ఆయ – వ్యయములు మున్నగు వానిని చూడవలసిన పని లేదు ! అని చెప్పిననూ వాస్తు రీత్యా నిర్మాణము చేసుకొనుట ఆయ, వ్యయములను చూచుట శ్రేయస్కరము.**

## ఎనిమిది విధముల వాటములు

సతన్ కుమార గృహ వాస్తు

శ్లో॥ పాంచాల వైదేహిక కౌరవాఽఖ్యమ్ । రాజన్యకం మాగధ శూరసేనే ॥
తథా స గాంధార మవంతి కాఖ్య మిత్యష్టకం చైవ గృహప్రమాణమ్ ॥

శ్లో॥ దేవాగారే ష్వవంతీస్యాత్, గాంధారం హస్తిశాలకమ్ ।
శూరసేనం నృపాణాం చ, ద్విజానాం మాగధం తథా ॥
(రాజన్యం) కౌరవ్యం వైశ్యజాతేస్తు, శూద్రే వైదేహికం తథా ।
సకృత్పాంచాలకం చైవ కౌరవ్యం సర్వజాతిషు ॥

**తా॥ పూరిండ్లకునూ, పెంకుటిండ్లకునూ వెన్నుబద్ద (వెన్నువాసము) నుండి పంచపాళి చివర వరకునూ, వుండువాటములు (పల్లములు) ఎనిమిది విధములు–**

1. పాంచాలము, 2. వైదేహము, 3. కౌరవ్యము, 4. రాజన్యము, 5. మాగధము, 6. శూరసేనము, 7. గాంధారము, 8. అవంతీ వాటములు

1. అవంతీ వాటము ............ దేవాలయములకు ఏర్పరచెదరు
2. గాంధార వాటము .............ఏనుగుల శాలకు ఏర్పరచెదరు
3. శూరసేన వాటము ............క్షత్రియుల అంతఃపురములకు ఏర్పరచెదరు
4. మాగధ వాటము ............. బ్రాహ్మణుల ఇండ్లకు ఏర్పరచెదరు
5. కౌరవ్య (రాజన్య)వాటము ... వైశ్యుల ఇండ్లకు ఏర్పరచెదరు
6. వైదేహ వాటము ............. శూద్రుల ఇండ్లకు ఏర్పరచెదరు
7. పాంచాల వాటము ...... అచ్చటచ్చట కొందరు ఏర్పరచెదరు
8. కౌరవ్య వాటము ............. అందరికినీ శుభముల నొసగును.

## గృహవాటములు - కొలతలు

**శౌనక ఉవాచ**

**(1)** **పాంచాల వాటము =** ఇంటి వెడల్పును 4 పాళ్ళు చేసి, మరల దానిలో ఒక పాలు కలిపి ఆతాడును గోడల చివరలకు రెండు వైపుల అదిమి పెట్టి నడిమిభాగము పైకి ఎత్తినచో వుండునటువంటి వాటము.

**(2)** **వైదేహవాటము =** పాంచాల వాటము కొలతలకు రెండున్నర అంగుళములు కలిపిన వచ్చు కొలత.

**(3)** **కౌరవ్య వాటము =** పై వాటములో రెండున్నర అంగుళములు చేర్చిన వచ్చును.

**(4)** **రాజన్య వాటము =** పైదాని కొలతలో రెండున్నర అంగుళములు చేర్చిన వచ్చును.

**(5)** **మాగధ వాటము =** పై దానికి రెండున్నర అంగుళములు చేర్చిన వచ్చును.

(6) **శూరసేన వాటము =** పై దానికి రెండున్నర అంగుళములు చేర్చిన వచ్చును.

(7) **గాంధార వాటము =** పైదాని కొలతకు రెండున్నర అంగుళములు చేర్చిన వచ్చును.

(8) **అవంతీ వాటము =** పైదాని కొలతకు రెండున్నర అంగుళములు చేర్చిన వచ్చును.

అన్ని వాటములకునూ కలిపి, చివర వాటమునకు వచ్చిన కొలత 17 1/2 అంగుళములు.

## దిక్కులు -అధిష్ఠాన దేవత

i) తూర్పుదిక్కున సింహద్వారముండిన ఇంటిలో నివసించువారు, సకల సంపదలతో, ఆరోగ్యముగా, సుఖ సంతోషములతో వర్థిల్లుతారు. తూర్పుకు అధిష్టాన దేవత 'ఇంద్రుడు'

ii) 'అగ్నేయ' భాగములో ఇంటికి సమీపమున చెరువులు, కోనేరులు ఉన్నట్లయితే 'అగ్ని' ప్రమాదములు కలుగును. 'ఆగ్నేయము' నకు అధిష్టానదేవత అగ్ని.

iii) ఈశాన్య భాగమున చెఱవులు, కోనేరులూ, వంటిలోతువి ఉన్న యెడల ధనవృద్ధి, సంతాన వృద్ధి కలుగును. ఈశాన్యమునకు అధిష్టానదేవత ఈశానుడు దైవం ! దైవశక్తి నిచ్చే దిక్కు ఈశాన్యం.

iv) ఉత్తర దిక్కున ఇనుపపెట్టెలు (ఖజానా) పెట్టిన యెడల ధనవృద్ధి కలుగును. ఉత్తర దిక్కునకు అధిష్టానదేవత 'కుబేరుడు'. ఉత్తరదిక్కు తగ్గిన యింటిలో ఆర్థిక బాధలు ఎక్కువ.

v) వాయవ్య దిక్కునకు అధిపతి వాయువు ! గృహ ప్రవేశమునకు ముందు గృహమునకు 'ప్రాణ ప్రతిష్ట' చేయుటకు ముఖ్యం వాయవ్యం. – చదువు, సాహిత్యము – కళలు వ్యవహారములు – మానసిక పనులు ఈ వాయవ్యదిక్కుకు సంబంధించినవి.

vi) పశ్చిమదిక్కునకు అధిపతి వరుణుడు. వరుణుడు జలాధిపతి.

vii) నైఋతి దిక్కునకు 'నిర్ఋతి' అను రాక్షసుడు అధిపతి ! అంటే ఈ దిక్కు అసురశక్తి అన్న మాట !! అనగా ఈ దిక్కునందు బలమైన వస్తువులు పెట్టాలి ! ఖాళీ దొడ్లు, బావులు, చెఱువులు ఉండరాదు.

viii) దక్షిణదిక్కునకు అధిష్టాన దేవత యముడు. ఈ నైఋతి దక్షిణ దిక్కులలో ఎంత తక్కువ ఖాళీస్థలము వుంటే అంత మంచిది. అంత పురుష సంతానం అభివృద్ధి చెందును. ఖాళీ స్థలము ఎక్కువ వున్న స్త్రీ సంతానము ఎక్కువగా యుండును. ఖాళీగోడ లేకుండా సరిహద్దులపై చేర్చి, కట్టినఎడల పురుష సంతానం నష్టాలుగాని, వృద్ధికి రాకుండుట గాని కలిగించును. ధనాభివృద్ధికూడా తక్కువగా ఉండును.

## తూర్పు భాగము

1) ఇండ్ల స్థలములోగానీ, ఇంటియొక్క అన్ని భాగములలోకల్లా తూర్పు భాగము పల్లముగావున్న సంపదా గౌరవ ప్రతిష్టలూ అభివృద్ధి యగును.

2) తూర్పుభాగము ఎత్తుగా ఉన్నట్లయితే సంతాన నష్టము. గృహ యజమానులు త్వరగా చనిపోవుట, స్త్రీలకు ఇంటి పెద్దరికము, ధనహాని కలుగును.

3) తూర్పుభాగంలో పాకలు, పందిళ్ళు, శాలలు మొదలైన కట్టడములు కట్టకూడదు. అలా కట్టితే, సంతానమునకు హాని, యజమానికి అవమానము, ధనహాని కలిగించును.

4) తూర్పుభాగంలో ఖాళీ దొడ్డి వున్నట్లయితే, ధన వృద్ధి, సంతానవృద్ధి కలిగించును.

5) తూర్పుభాగాంలో పెంటపోగులు, పేడకుప్పలు, రాళ్ల గుట్టలూ మొదలైనవి వేసినయెడల ధననష్టం, సంతానమునకు హాని కల్గించును.

6) తూర్పుభాగంలో వంటయిల్లు ఉన్నయెడల ధన ధాన్యములకు హాని, అధిక వ్యయము, అనారోగ్యము కల్గించును.

7) తూర్పుభాగంలో “పాయిఖానా” దొడ్లు ఉన్న యెడల సంతానమునకు హాని, ధననష్టము కల్గించును.

8) తూర్పుభాగం ఎత్తుగా వుండి అందు నూతులున్న యెడల సంతానము నకు కష్టనష్టములు కలుగును.

9) తూర్పుభాగం పల్లముగానుండి అందులో నూతులు, గోతులు, నీళ్ళు పోవు తూములూ ఉన్నయెడల ధనధాన్యాభివృద్ధి కలుగును.

10) తూర్పుభాగంలో నీళ్ళు వాడుకొనుటకు కట్టిన కుండీలు ఉన్నయెడల గౌరవ ప్రతిష్ఠలకు భంగం కలుగును.

11) తూర్పుభాగంలో గృహమునకు సమీపములో తటాకములు, కోనేరు మున్నగునవి ఉన్న ఎడల సంతానమునకు నష్టము కలుగును.

12) గృహావరణములోని నీరు తూర్పుభాగమునుంచి వెలుపలికి పోవుచున్న ఎడల ధనాభివృద్ధి కల్గించును.

13) తూర్పుభాగమున వున్న సింహద్వారములుగాని తదితర ద్వారములుగాని తూర్పుదిశను చూచినట్లు వున్నఎడల సామాన్యమైన శుభఫలితములును, ముక్తినీ, కల్గించును.

14) తూర్పుభాగమున వున్న సింహద్వారములు ఆగ్నేయమును చూచునట్లు నిర్మించిన ఎడల దారిద్ర్యము. వంశక్షయమూ కలిగించును.

15) తూర్పుభాగంలో సింహద్వారములు ఈశాన్యము చూచునట్లు ఉన్న ఎడల సర్వత్రా శుభసంతోషములు, వంశవృద్ధి, ధనవృద్ధి కల్గించును.

16) తూర్పుభాగంలోవున్న అరుగులు, గర్భముకంటె ఎత్తుగా ఉన్న ఎడల అశాంతి, అనవసరమైన ఖర్చులు, అధిక వ్యయము కలిగించి, ఋణ గ్రస్తులను చేయును.

17) తూర్పు భాగమునందుగల అరుగులు గర్భముకంటె ఎంత పల్లముగా నున్న ఆదాయము అంత అభివృద్ధి చెందును.

18) తూర్పుభాగమును ఆక్రమించిన సరిహద్దు గోడపై నుండి ఒకే ఎత్తుపెట్టి, మేడకట్టిన – క్రమక్రమముగా ద్రవ్యహాని, వ్యవహారపు చిక్కులను కల్గించును. భర్తపోయి, భార్య యజమానురాలగును.

19) తూర్పుభాగమున వసారా వుంచి కట్టిన – ధన ధాన్యాభివృద్ధి, సంతానాభివృద్ధి, వుండును.

20) తూర్పుభాగము పెంచి కట్టిన – మిత్రవిరోధము కలుగును.

21) గృహముయొక్క తూర్పుభాగము ఎత్తు తక్కువగా వున్న గృహ యజమాని ఉన్నతస్థితిని పొందును.

22) తూర్పువైపునకు వేయు గృహముయొక్క వెన్ను తూర్పునకు వంగివున్నచో వంశవృద్ధి కలిగించును. ఎత్తుగావున్న వంశహాని కలుగును.

23) గృహమునకు గల తూర్పుభాగమునందు గల ఖాళీ స్థలములు, దొడ్లుగానీ గృహములో కలుపుకొనిన ఎడల అవి తన గృహమునకు గల స్థలమున కంటె ఎత్తుగావున్న – ధననష్టము కల్గించును. పల్లముగా నున్న ధనాదాయమును అభివృద్ధిచేయును.

24) గృహమునకు గల తూర్పుభాగములో వున్న ఖాళీ స్థలములో తూర్పు భాగముగా కొంతస్థలము విడిచిపెట్టి, నూతనముగా వేరొక గృహము నిర్మించుకొనవచ్చు.

25) గృహమునకు ఒక ద్వారమే పెట్టుకొనవలయుననిన అది తూర్పు భాగమునందే పెట్టుకొనవలయును.

26) తూర్పు సరిహద్దు గోడలపై ఏ విధమైన కట్టుబడులు కట్టిననూ, ఆ ఇంటి పురుషులకు, పురుష సంతానమునకూ, హాని కలుగును.

27) తూర్పుభాగము ఎత్తుగా వున్నందువలన పడమర భాగము పల్లమగును– ఇందువలన ఆ గృహయజమానికి స్త్రీ సంతానం మాత్రమే కలుగుటయు, అనారోగ్యముచే మరణించుటయు, భార్య గృహ యజమాని అగుటయూ సంభవించును.

28) తన గృహమున ఉన్న తూర్పుభాగములందుగల గదిలో పశ్చిమమునున్న గోడకు చేర్చి, తూర్పు ముఖముగా ఇనుపపెట్టెలు (ఖజానా) పెట్టుకున్న ఎడల సిరి సంపదలు కలిగియుందురు.

29) ఒక గృహమును రెండుగా పంచుకొనవలసి వచ్చిన ఎడల చిన్నవారు తూర్పుభాగమున వుండుట సర్వదా, శ్రేయస్కరము.

30) ఒక గృహమును రెండు భాగములుగా పంచుకొనిన – తూర్పు భాగమున ఉన్నవారు ఐశ్వర్యవృద్ధిని కలిగియుందురు.

31) అన్నదమ్ములు వేరువేరుగా గృహమును కట్టుకొనుట శ్రేయస్కరమైన పక్షమున ఇందు చిన్నవారు తూర్పుభాగంలో గృహనిర్మాణము చేసు కొనుట వలన మేలుకలుగును.

32) ప్రతి గృహమునకు తూర్పుభాగము ఉచ్ఛభాగము కనుక – తూర్పు భాగమున వున్నవారు ఉచ్ఛస్థితిని పొందెదరు.

33) గృహములను అద్దెలకు ఇచ్చుకొనువారు తూర్పు భాగమున తాము వుండి, దక్షిణ, పశ్చిమ భాగములు అద్దెలకు ఇచ్చుకొనుట శ్రేయస్కరము.

34) తూర్పుభాగమున ఒకే ఎత్తుపెట్టి, పశ్చిమమున వసారా దించి గృహము కట్టిన – వాతసంబంధమగు వ్యాధులుగాని, పక్షవాతముగానీ వచ్చును. లేదా గృహ యజమాని శీఘ్రముగా మరణించును.

35) తూర్పుగోడపై నుంచి ఎత్తయిన కట్టడములందు తూర్పునుండి వచ్చు వెలుతురు గృహములో ప్రవేశించకుండావున్న ఎడల నేత్రరోగములు గాని, అంధత్వముగాని వచ్చును.

# ఆగ్నేయ భాగము

36) ఇండ్ల స్థలములుగాని, ఇంటి యొక్క అన్ని గదుల యందుగాని ఆగ్నేయ భాగము పల్లముగా వున్న ఎడల అగ్నిభయము, శతృబాధలు, అప మృత్యువునూ కల్గించును. పాపభీతి లేకుండా ప్రవర్తింపచేయును.

37) ఆగ్నేయభాగము ఎత్తుగా వున్నఎడల ధనలాభము. సంతానాభివృద్ధి, స్త్రీలకు సౌఖ్యము కల్గించును.

38) ఆగ్నేయభాగము ఎత్తుగావుండి అందు నూతులు, గోతులు వున్నఎడల శతృబాధలు అపమృత్యువు, (అకాలమృత్యువు) అధిక వ్యయము, స్త్రీలకు అనారోగ్యము కల్గించును.

39) ఆగ్నేయభాగము ఎత్తుగావుండి, అందులో పాకలు, పందిళ్ళు కట్టు బడులున్న ఎడల వ్యయము, సుఖ హీనతా కల్గించును.

40) ఆగ్నేయభాగం ఎత్తుగావుండి అందులో పాకలు, పందిళ్ళు, ఎత్తయిన కట్టడములున్నఎడల ధన నష్టము, సంతాన నష్టము కల్గించును.

41) ఆగ్నేయ భాగంలో పెంటకుప్పలు, పేడపోగులు, రాళ్ళగుట్టలు మొదలైనవి వేసినయెడల సౌఖ్యము, సర్వ సుఖములూ కలుగును.

42) ఆగ్నేయభాగంలో వంటయిల్లు వున్న ఎడల సౌఖ్యము, సర్వశుభములూ కలుగును.

43) ఆగ్నేయభాగంలో ఖాళీదొడ్డి వున్నయెడల అనేక దుష్ట ఫలితములు కలుగును.

44) ఆగ్నేయభాగములో పాయిఖానా వున్నఎడల సర్వత్ర శ్రేయస్కరముగా యుండును.

45) ఆగ్నేయభాగమునందున్న ఖాళీ దొడ్లు తన స్థలములో కలుపుకొన్న యెడల – ధననష్టము, సంతాన నష్టము మొదలైన అనేక నష్టములు కలుగును.

46) ఆగ్నేయభాగంలో నీళ్లు పోసుకుని వాడుకొనుచున్న కుండీలు వున్న ఎడల ధనక్షయము కలుగును.

47) ఆగ్నేయభాగంలో గృహమునకు సమీపమున జలాశయములు అనగా కోనేరులు, చెరువులూ మొదలైనవి వున్న ఎడల అగ్నిభయము, ధన నష్టము కలుగును.

48) ఆగ్నేయభాగమునుంచి, గృహావరణము లోని వాడుక నీరు, వర్షపు నీరు పైకి పోవుచున్న ఎడల సంతానమునకు హానికలుగును.

49) గృహమునకు ఆగ్నేయభాగంలో అరుగులు పల్లముగా వున్న ఎడల అధికవ్యయము, ఋణ ప్రవృత్తి కలిగించును. అవి ఎత్తుగా ఉన్న ఎడల ఆదాయాభివృద్ధి కలిగించును.

50) గృహమునకు ఆగ్నేయభాగములో ద్వారములుంచిన స్త్రీలకు అనారోగ్యము. శిశువులకు హాని కలుగును.

51) గృహమునకు ఆనుకునియున్న ఆగ్నేయభాగమున గల ఖాళీదొడ్లుగాని, స్థలములు గానీ, తన గృహములో కలుపుకొనిన పలువిధములైన కష్టనష్టములు సంభవించును.

52) గృహమునకు గల స్థలములో ఆగ్నేయము పెరిగి వున్న క్రమక్రమమున ధనహీనులై పెక్కు కష్టనష్టములకు లోనగుదురు.

53) ఆగ్నేయభాగము తూర్పుదిక్కుగా వున్న ఎడల సంతానష్టములు గానీ– సంతానమే లేకపోవుట గానీ, జరుగును. లేదా అల్ప సంతానము కలుగుటగాని జరుగును.

54) ఆగ్నేయభాగము కేవలము ఆగ్నేయమూలగా పెరిగిన ఎడల – అనారోగ్యములు, కోర్టు వ్యవహారపు చిక్కులు దుబారా ఖర్చులు దురభ్యాసములు, కుటుంబ కలహములు కలిగి అధిక వ్యయము అగుచూ ధననష్టము కలుగును.

55) ఆగ్నేయము దక్షిణదిశగా పెరిగివున్న ఎడల పలు విధములైన కష్ట నష్టములు పొందెదరు. ధనహీనులగుదురు.

56) దక్షిణదిశగా పెరిగివున్న ఆగ్నేయభాగంలో నూతులు, గోతులుకూడ వున్న అపమృత్యుభయములు కూడా కలుగును. ఇందుండు భార్యా భర్తలకు సరిపడదు. సంతానము దురలవాట్లకు లోనగుదురు. యజమానులు దీర్ఘవ్యాధితోనూ, కోర్టు కచేరిల వల్లనూ విశేషశ్రమలు పడుదురు. క్రమక్రమముగా ధనమంతయూ నశించిపోయి దరిద్రు లగుదురు.

57) తూర్పుదిశలో కలిసి పెరిగివున్న అగ్నేయభాగంలో నూతులు, గోతులు వున్నయెడల ఆగృహ యజమానులకు వారి సంతానమునకూ కుటుంబ సఖ్యత తక్కువగా యుండును. యజమాని భార్యను విడిచిపెట్టుట్టగానీ, భార్యవుండగా యింకొక సంబంధము పెట్టుకొనుటగాని జరుగును. సంతానముకూడా ఈప్రవర్తన కలిగివుందురు. స్త్రీ సంతానమునకు భర్త సౌఖ్యముండక పోవుటగానీ, కలహమువలన దూరముగా ఒకరి నొకరు విడిచివుండుటగాని జరుగును. పురుషసంతానములో కొందరు మనశ్చాంచల్యముగా వుండుటయూ జరుగును.

58) ఆగ్నేయభాగంలో నూతులు, బావులుగాని వున్న యెడల ఆ గృహ యజమాని భార్య, శ్రీఘ్రముగా మరణించును. లేదా దీర్ఘవ్యాధి గ్రస్థురాలగును. సంతాన నష్టములు తరచు జరుగును. దురలవాట్లకు లోన గుదురు. దొంగతనము వ్యభిచారము, సురాపానము ఇత్యాది చెడు గుణముల వలన క్రమక్రమముగా ధనమంతయూ నశింపుచేసు కొందురు.

59) ఆగ్నేయభాగము తగ్గియున్న ఎడల ధైర్యము బలము, ధనము కలిగి ఉండెదరు.

60) ఆగ్నేయభాగము పెరిగి, అందులో నూతులు, గోతులువున్నయెడల యింకనూ ఇతరములైన వాస్తుదోషములు కలిగివున్నయెడల ఆ గృహ

యజమాని రెండవ కుమారుడు దీర్ఘవ్యాధిగ్రస్తుడగుట గానీ, దుర్మార్గపు ప్రవర్తనవలన, అతి నీచత్వముగా సంచరించుచూ శీఘ్రముగా మరణించును.

61) ఆగ్నేయ, నైఋతీ, దక్షిణ, పశ్చిమములయందు వర్షపునీరు, వాడుక నీరు నిలువ వున్ననూ, విస్తారమైన నీటిని వాడుక చేసినా, కాలువ వుండి ఎపుడూ నీళ్ళుపోవుచున్ననూ, ఆ గృహమునందున్న స్త్రీలు కుష్టువ్యాధితో బాధలుపడెదరు.

## దక్షిణ భాగము

62) ఇండ్లస్థలముగానీ, గృహములలో గల ఖాళీప్రదేశములలోగానీ మరే ఇతర ప్రదేశములోగానీ, దక్షిణ భాగము పల్లముగానున్న యెడల ఎల్లప్పుడు ధనహాని, గౌరవ ప్రతిష్ఠలకు భంగము, అపమృత్యువులు, అనారోగ్యములు, మొండి వ్యాధులు కలుగును. గృహయజమానికి శీఘ్రకాలములోనే మరణము కల్గును. ఆ గృహములో పురుషులు దీర్ఘాయుష్కులు గలవారుగా ఉండరు. సర్వత్రా నాశనము కలుగును. ఇల్లు తరచుగా అమ్ముడుపోవుచుండును. ఏ ఒక్కరికినీ స్థిరముగా ఉండదు.

63) దక్షిణభాగము ఎత్తుగావుండి, అందు పాకలు, పందిళ్ళు, శాలలు మొదలగునవి ఉన్నయెడల ధనవృద్ధి, ఆరోగ్యముగలవారై యుందురు.

64) దక్షిణభాగము ఎత్తుగా వుండి అందులో పేడ కుప్పలు, పెంటపోగులు, రాళ్ళగుట్టలు మొదలైనవి వేసినయెడల సర్వత్ర శుభప్రదముగా యుండును.

65) దక్షిణ భాగము ఎత్తుగానుండి, అందులో నూతులు గోతులు వున్నయెడల అనారోగ్యములు, అధిక వ్యయము, ధన నాశనము కలుగును.

66) దక్షిణభాగమున పల్లముగానుండి అందు నూతులు, గోతులు వున్న ఎడల మొండివ్యాధులు, ధననష్టములు, మరణభయములు గలుగును. క్రమక్రమముగా వారి ద్రవ్యము నశించి వంశ నాశనము చెందెదరు.

67) దక్షిణభాగము పల్లముగానుండి అందులో పాకలు, పందిళ్ళు, శాలలు మొదలైనవి ఉన్న ఎడల బలహీనత, అశాంతి, అధికవ్యయము, ఋణ గ్రస్తులగుటయు జరుగుచుండునుగానీ, కొంతవరకు ధనాదాయము వచ్చుచుండును.

68) దక్షిణభాగము ఖాళీదొడ్డి విశేషముగా వున్న ఎడల పలువిధములైన కష్టనష్టములు సంభవించును.

69) దక్షిణమున పాయిఖానా దొడ్లు ఉన్నఎడల ధనహాని కల్గును.

70) దక్షిణమున వంటయిల్లు వున్న యెడల ధనహాని కల్గించును.

71) దక్షిణమున నీళ్ళుపోసుకొనే కుండీలు వున్నఎడల దీర్ఘవ్యాధులు ధన క్షయము కలుగును. భార్యావియోగమో లేక భార్య వ్యాధిగ్రస్తురాలై ఉండుటో గాని జరుగును.

72) గృహమునకు సమీపంలో దక్షిణమున కోనేరు, తటాకము బురద గుంట ఉన్నయెడల శతృభయము, రోగములు కలుగును.

73) గృహములోని వాడుకనీరు, వర్షపునీరు, దక్షిణ భాగమునుంచి వెలుపలికి పోవుచున్నఎడల స్త్రీలకు వ్యాధులూ, కుటుంబ కలహములు, అధిక వ్యయములు కలుగుచుండును.

74) దక్షిణభాగమున వున్న సింహద్వారముగానీ, తదితర ద్వారములుగానీ కేవలము దక్షిణదిక్కును జూచు చున్నట్లు నిర్మించుకొనిన ఐశ్వర్యము కలుగును.

75) దక్షిణభాగమునవున్న సింహద్వారముగాని, తదితర ద్వారములుగానీ, నైఋతివైపుకి తిరిగి, నైఋతిని చూచుచున్నట్లు నిర్మించుకొన్నఎడల శతృభయములూ అపమృత్యువులు, వంశ క్షయము కలుగును.

76) దక్షిణభాగమునవున్న సింహద్వారములుగాని, తదితర ద్వారములుగాని, ఆగ్నేయమును చూచుచునట్లు ఉన్నయెడల అగ్ని ప్రమాదములు వంశమునకు కీడూ, కలుగును.

77) దక్షిణభాగములో సరిహద్దుచేరి, గృహనిర్మాణము చేసుకొనిన యెడల కీడు కలుగును.

78) దక్షిణభాగమున ఎత్తుపెట్టి మేడలు కట్టుకొనిన యెడల ఐశ్వర్యప్రదముగా వుండును.

79) దక్షిణభాగమున ఖాళీస్థలము ఎంత హెచ్చుగానుండిన యెడల అంత తొందరలోనే ఆ గృహయజమాని భార్య మరణించుటయూ, గృహ యజమాని మరణించుటయూ జరుగును.

80) దక్షిణభాగములోని అరుగులు గృహమునకు గల గర్భమునకంటె పల్లముగా ఉన్నయెడల ఆదాయాన్ని మించిన వ్యయము కలిగి, ఋణ గ్రస్తులగుదురు. దక్షిణభాగంలోగల అరుగులు గృహమునకు గల గర్భముకంటే ఎత్తుగా ఉన్నయెడల ఆదాయాభివృద్ధి కలుగును.

81) దక్షిణమున వసారా ఉన్నయెడల ధన నష్టములు కలుగును.

82) దక్షిణమునగల ప్రహరీ గోడలు ఇతర–గోడలకంటే ఎత్తుగా నుండ వలయును.

83) దక్షిణభాగము నందుగల గృహమునకు గల వెన్ను ఇతర భాగముల కంటే ఎత్తుగావున్న ఎడల ఐశ్వర్యప్రదముగా నుండును.

84) దక్షిణభాగములో ఒకే ద్వారమునుంచి, గృహనిర్మాణము చేసిన యెడల పలువిధములగు కష్టనష్టములు సంభవించును.

85) దక్షిణభాగము పెరిగివున్న యెడల క్రమముగా వంశము, ధనము క్షీణించిపోవును.

86) దక్షిణభాగములో గల ఖాళీస్థలములో వేరొక గృహము కట్టుకొనవలసి వచ్చిన యెడల దక్షిణపు సరిహద్దుచేరి దక్షిణమునకు ద్వారములు, కిటికీలు వుండకుండా ప్రధాన గృహముకంటే ఎత్తుగా ఉండునట్లు కట్టుకొనినయెడల శుభములు కలుగును.

87) దక్షిణభాగములో గల ఖాళీస్థలములో వేరొక గృహము కట్టుకొనవలసి వచ్చిన యెడల, దక్షిణపు సరిహద్దు చేరకుండా దక్షిణమునకు కిటికీలు,

ద్వారములుంచి, ప్రధాన గృహముకన్నా పల్లముగా కట్టినయెడల ప్రాణ ధన వ్యాపారములకు నష్టముకలుగును.

## నైఋతి భాగము

88) ఇండ్ల స్థలములుగాని, గృహములోగల ఖాళీప్రదేశములలో గాని, గర్భమునందుగాని, గదులలోగాని, వసారాలలోగాని, నైఋతిభాగము పల్లముగా ఉన్న ధనహాని, ప్రాణహాని, రోగబాధలు తరచు కలుగు చుండును.

89) నైఋతి భాగము ఎత్తుగావున్నయెడల ధనలాభము, సుఖము కలుగును.

90) నైఋతి భాగము ఎత్తుగావుండి, అందులో నూతులు, గోతులు ఉన్న యెడల మొండి వ్యాధులు కలహములు, శతృత్వములు, అవమాన ములు, ధనహాని, ప్రాణభయములు కలుగుచూ దారిద్ర్యమును పొందె దరు.

91) నైఋతిభాగము ఎత్తుగావుండి, అందులో పాక, పందిళ్ళు, మొదలైనవి వున్నయెడల గౌరవాభివృద్ధి, ధనాదాయము, సౌఖ్యమూ కలుగును.

92) నైఋతిభాగంలో పేడకుప్పలు, పెంటకుప్పలు, రాళ్ళగుట్టలు మొదలైన బరువులు వేసినయెడల ధనధాన్యాదులకు అభివృద్ధి, సుఖము కలుగును.

93) నైఋతిభాగము పల్లముగావుండి, అందులో పాకలు మొదలైనవి ఉన్న యెడల ధనధాన్యాదులయందు నాశనము కలుగును.

94) నైఋతిభాగంలో బావి ఉన్నయెడల స్త్రీలు శీఘ్ర కాలములోనే మరణిం చుట, లేదా శిశు మరణములు కలుగును. మరియు పిచ్చి, కుష్టు, ఉబ్బసము మొదలుగాగల నయము కాని మొండివ్యాధులు, అధిక వ్యయము, దుష్టస్వభావము, క్రూర స్వభావము కలిగియుండుట మొదలగు దుష్టఫలితములు కలుగును.

95) నైఋతిభాగంలో ఖాళీ దొడ్లుగాని, స్థలములుగాని ఉన్న పలువిధము లగు కష్టనష్టములు, వంశక్షయము కలుగును.

96) నైఋతిభాగమున వంటయిల్లు వున్నయెడల అనారోగ్యములను కలిగించును.

97) నైఋతిభాగంలో పాయిఖానా వున్నయెడల శతృభయము, సుఖహీనత ఉండును.

98) నైఋతిభాగంలో నీళ్లకుండీలు వున్నయెడల కుటుంబ కలహములు, ధనహాని, రోగబాధలు, అవమానములూ కల్గును

99) నైఋతిభాగంలో గృహమునకు సమీపములో కోనేరు, తటాకము మొదలైనవి వున్న ఆగృహమునందు కలహము అవమానములు కలుగును.

100) నైఋతిభాగమునందు వాడుకనీరు వర్షపునీరు వెలుపలికి పోవుచున్న యెడల తరచు అనారోగ్యములు, గృహ కల్లోలములు, అవమానములు, అధిక వ్యయములూ కల్గును.

101) నైఋతి భాగము పెరిగియున్న విశేషముగా శతృ బాధలు, ధననష్టములు, రోగబాధలు, దుష్టస్వభావము కలిగివుండును.

102) నైఋతిభాగము దక్షిణదిశగా పెరిగివున్నయెడల తీరని వ్యాధులు, అపమృత్యువులు కల్గును.

103) నైఋతిభాగము కేవలము నైఋతిమూలగా పెరిగి వున్న యెడల శతృ బాధలూ, ఋణబాధలూ, కోర్టు వ్యవహారములు, నీచప్రవర్తనలు కలిగి యుండును. ఇంకనూ రోగములచే పీడింపబడెదరు.

104) నైఋతిభాగము పశ్చిమముగా పెరిగివున్న విశేషధన నష్టములు, దుర్మార్గపు ప్రవర్తన, దుష్ట సాంగత్యములూ, కలిగివుండెదరు.

105) నైఋతిభాగం ఏదోనొకవిధముగా పెరిగివుండి అందులో నూతులు, గోతులు ఉన్నయెడల బలవన్మరణములు, స్త్రీలు అవినీతి ప్రవర్తనకు లోనై యుండుటయు. సంతాన నష్టములు, శతృత్వములు, గృహ యజమానులు క్రూర స్వభావము కల్గి యుండుట, క్రూరత్వముగా

నడచుట, అవినీతి ప్రవర్తన కల్గియుండుట ఇత్యాది అశుభ ఫలితాలను కల్గించును.

106) నైఋతి భాగములో ద్వారములుంచిన రోగ బాధలు, అధికవ్యయము కలుగును. ఇంకనూ అనేక విధములుగా కష్టనష్టములు సంభవించును.

107) నైఋతి భాగమునందున్న అరుగులు గృహమునకు గల గర్భముకంటే పల్లముగా వున్నయెడల అధిక వ్యయము, అనవసరమైన ఖర్చులు కల్గియుందురు.

108) నైఋతిభాగములో వున్న అరుగులు, గృహమునకు గల గర్భముకంటె ఎత్తుగావున్న యెడల ఆదాయాభివృద్ధి కలిగి ఉండును.

109) నైఋతిభాగములో వసారాలు ఉన్న యెడల శుభఫలితములను పొంద నేరరు.

110) నైఋతిభాగంలో ఎత్తుగా డాబాలుగాని, చుట్టుఇల్లు గాని వున్నయెడల శుభఫలితములు పొందుదురు.

111) నైఋతిభాగమునగల ఖాళీదొడ్లు, స్థలములు తన గృహములో కలుపుకొనరాదు ! దానివల్ల రోగ బాధలు, అకాలమరణములు కలుగును.

112) నైఋతిభాగము తగ్గివుండి, ఎత్తుగావున్న యెడల సర్వ సుఖములు పొందుదురు. ఏదో ఒక విద్యయందు గాని, వృత్తి వ్యాపారాదుల యందుగాని ప్రవీణత, ధనసంపాదన కలిగియుందురు.

113) గృహమునకుగాని, స్థలమునకుగానీ, నైరుతిభాగము పెరిగియుండి, అందులో నూతులు, గోతులు ఇంకనూ ఇతరములగు వాస్తు దోషములు వున్న యెడల ఆ గృహయజమాని ప్రథమ కుమారుడు ఎల్లపుడూ దీర్ఘరోగిగా ఉండును. లేదా దుర్మార్గుడై శీఘ్రముగా మరణించును.

# పశ్చిమ భాగము

114) ఇండ్ల స్థలములుగాని, గృహములలోని ఖాళీస్థలములుగానీ, మరే ఇతర స్థలములుగాని పశ్చిమ భాగములో పల్లముగా వున్నయెడల ధననాశనము, వంశహాని, అపకీర్తి, శోకము కలుగును. ఇందుండే యజమానులు తొందరగా చనిపోవుటగాని, స్త్రీలు యజమానులుగా నుండుటగాని జరుగును.

115) పశ్చిమభాగము ఎత్తుగావున్నయెడల ఐశ్వర్య ప్రదము.

116) పశ్చిమభాగము పల్లముగానుండి అందులో పాకలు మొదలైనవి ఉన్న అధిక వ్యయము, సుఖహీనత కల్గును.

117) పశ్చిమభాగము పల్లముగానుండి అందులో నూతులు, గోతులు, ఉన్నఎడల ధననష్టములు, అపకీర్తి, దూరప్రయాణములు, దీర్ఘవ్యాధులు కలుగును. గృహయజమాని శీఘ్రముగా మరణించును.

118) పశ్చిమభాగము ఎత్తుగానుండి అందులో నూతులు గోతులూవున్న యెడల ధనహాని, అధికవ్యయము, అగౌరవము కలుగును.

119) పశ్చిమభాగంలో విశాలమైన ఖాళీదొడ్లుగాని, స్థలములుగాని ఉన్న ఎడల ధననష్టము, వంశహాని, ఇత్యాది పలువిధములగు కష్టనష్టము సంభవించును.

120) పశ్చిమ భాగంలో పెంట కుప్పలు, పేడ పోగులు రాళ్ళగుట్టలూ వేసిన యెడల శుభఫలితములు కలుగును.

121) పశ్చిమభాగంలో వంటయిల్లు ఉన్న యెడల అధిక వ్యయమును కల్గించును.

122) పశ్చిమభాగంలో పాయిఖానాదొడ్లు వున్నయెడల సుఖ హీనత ధన వ్యయము కలుగును.

123) నీళ్ళు పోసుకొను కుండీలు వున్న యెడల కుటుంబ కలహములు సంతానమునకు కీడు కలుగును, దూర ప్రయాణముకూడా కలుగు చుండును.

124) పశ్చిమభాగంలో గృహమునకు సమీములో కోనేరు, తటాకము, మొదలైన నీటివసతులు వున్న యెడల శతృబాధలు, అవమాన ములు కలుగును.

125) పశ్చిమభాగంలోనుంచి గృహములోని వర్షపునీరు గాని, వాడుక నీరుగాని పోవుచున్న యెడల, గృహమున గల స్త్రీలు దుష్టస్వభావ మును కలిగియుందురు.

126) పశ్చిమభాగంలో యున్న సింహాద్వారముగానీ, తదితర ద్వారములు గాని కేవలం పశ్చిమదిక్కునే చూచుకొనునట్లు నిర్మించుకొనిన యెడల సర్వశుభములు కలుగును.

127) పశ్చిమభాగంలో వున్న సింహాద్వారములుగాని, తదితర ద్వారములు గాని, నైఋతి దిశను చూచునట్లు ఉన్న యెడల దీర్ఘవ్యాధులు, ధన క్షయము, అపమృత్యువులు కలుగును.

128) పశ్చిమభాగంలోవున్న సింహద్వారములుగాని, తదితర ద్వారములు గాని వాయవ్యదిశను చూచునట్లు ఉన్న యెడల శతృవృద్ధి, అపకీర్తి, ధనక్షయము కలుగును.

129) పశ్చిమభాగంలో వున్న అరుగులు గర్భముకంటే పల్లముగా వున్న యెడల అధికవ్యయము కలుగును.

130) పశ్చిమభాగమునఉన్న అరుగులు గర్భముకంటే ఎత్తుగా ఉన్న యెడల ఆదాయాభివృద్ధి కలుగును.

131) పశ్చిమభాగమున సరిహద్దు పారుచేరి గృహము కట్టిన యెడల సౌఖ్యము కలుగును.

132) పశ్చిమభాగంలో విశేషముగా ఖాళీవున్నచో గృహ యజమానికి కీడు కలుగును.

133) పశ్చిమభాగంలో వసారాలు కట్టకుండా ఏక ఎత్తు పెట్టి గృహము కట్టిన యెడల సర్వశుభములు కలుగును.

134) పశ్చిమభాగములో విశేషము వాలుపెట్టి పంచలు దించి కట్టినయెడల పలువిధములగు కష్టనష్టములు సంభవించును.

135) పశ్చిమభాగమునందుగల పాకలు మున్నగునవి గర్భ గృహముకంటే పల్లముగా ఉన్నయెడల ధన నష్టము కలుగును.

136) పశ్చిమ భాగములోగల పాకలు మున్నగునవి గర్భ గృహమునకు సమానముగా గానీ, ఎత్తుగాగాని వేయుట వలన ధనలాభము, సౌఖ్యము కలుగును.

137) పశ్చిమ భాగమునందు మేడలు, డాబాలు వేసుకొనిన సర్వశుభములు కలుగును.

138) పశ్చిమ భాగమునందు గర్భ గోడలు, ప్రహరీ గోడలు ఎత్తు, ఎక్కువగా వున్నఎడల శుభప్రదముగా వుండును.

139) పశ్చిమ భాగమునందు ఖాళీస్థలములతో ఇంటి నిర్మాణము చేసుకొన వలసివచ్చినఎడల అంతకుముందు గర్భ గృహముకంటే ఎత్తుగానూ, సరిహద్దు గోడలనానించియూ కట్టుకొనినయెడల ధనధాన్యాదుల యందు అభివృద్ధి, సుఖము కలుగును.

140) పశ్చిమభాగము నందు ఖాళీ స్థలములో అంతకుముందున్న గృహము కంటే ఎత్తు తక్కువగా పెట్టి వేరొక గృహమునిర్మించుకొనిన ఎడల ధనహాని, ప్రాణహాని కలుగును.

141) పశ్చిమభాగములో గృహమునకు వెన్నుఎత్తు తక్కువగా నున్న ఎడల ధనహాని కలుగును. ఎత్తు ఎక్కువగా వున్న ఎడల ఐశ్వర్యప్రదముగా యుండును.

142) గృహమునకుగల పశ్చిమభాగము ఎత్తు ఎక్కువగా వున్న యెడల గృహయజమాని సమస్త కోరికలూ సిద్ధించును. ఎత్తు తక్కువగావున్న కష్టనష్టములు కలుగును.

## వాయవ్య భాగము

143) ఇండ్ల స్థలములుగాని, గృహములలోగల ఖాళీప్రదేశములు గాని, మరే ఇతర ప్రదేశములలోగాని వాయవ్య భాగము పల్లముగానున్న ఎడల శతృవృద్ధి, స్త్రీలకు నాశనము, భయోత్పాతము, అజీర్ణవ్యాధి కలుగును.

144) వాయవ్య భాగము ఎత్తుగావున్న ఎడల వంశవృద్ధి, ఐశ్వర్యవృద్ధి కలుగును.

145) వాయవ్య భాగము పల్లముగానుండి, అందులో పాకలు, పశువుల శాలలు మున్నగునని వున్న ఎడల పశునాశనము, ధనహాని, శతృభీతి కలిగించును.

146) వాయవ్యభాగము ఎత్తుగావుండి అందులో పాకలు మున్నగునవి వున్నఎడల పశువృద్ధి, ధనధాన్యాదులకు అభివృద్ధి కలుగును.

147) వాయవ్య భాగమున నూతులు, గోతులు మున్నగునవి వున్నఎడల శతృవృద్ధి అజీర్ణవ్యాధి, అసాధ్యమైన వ్యాధులు, అశాంతి కలుగును.

148) వాయవ్య భాగంలో పెంటపోగులు, పేడకుప్పలు, రాళ్ళ గుట్టలు పోసిన ఎడల ధనాభివృద్ధి, శతృవిజయము కలుగును.

149) వాయవ్యభాగంలో వంటయిల్లు వున్నఎడల అశాంతి, అధిక వ్యయము, కలహములు కలుగును.

150) వాయవ్యభాగంలో పాయిఖానాదొడ్లు వున్నఎడల సామాన్య ఫలిత ములు కలుగునుగాని విశేషమైన శుభఫలితముల నొసంగదు.

151) గృహములోని వాడుక నీరు, వర్షపునీరూ వాయవ్య భాగంలోనుంచి వెలుపలికి పోవుచున్నఎడల అశాంతి, ధననష్టం, సుఖహీనత కలుగును.

152) వాయవ్యభాగంలో నీళ్ళుపోసుకొనే కుండీలు ఉన్నఎడల కుటుంబ కలహములూ, సంతాన నష్టమూ కలుగును.

153) వాయవ్య భాగంలో గృహమునకు సమీపములో జలాశయమున్న ఎడల ధన నాశనము కల్గించుటయేగాక, పశునాశనముకూడా కలిగించును.

154) గృహమునకు వాయవ్యభాగంలో వున్న స్థలము ఎక్కువగా పెరిగి వున్న యెడల అధిక వ్యయము, శతృవృద్ధి, అశాంతి, ధననష్టము మొదలగు పలువిధములైన కష్టనష్టములు కలిగించును. దూర ప్రయాణములు కలుగును.

155) వాయవ్యభాగము సమానముగా వున్నయెడల రాజకీయ చతురత కలుగును.

156) పశ్చిమదిశగా వాయవ్యభాగము పెరిగియున్న యెడల అశాంతి, అతివ్యయము, ధననష్టము మొదలగునవి కలిగించును.

157) ఉత్తరదిశగా వాయవ్యభాగము పెరిగివున్నఎడల ధన నష్టము, పరాభవము, శతృవృద్ధి, అప్రతిష్ట, అధిక వ్యయము, సుఖహీనత కలుగును.

158) గృహమునకు వాయవ్యభాగంలో విశాలమైన ఖాళీదొడ్లు ఉన్నఎడల పలువిధములైన కష్ట నష్టములు కలుగును.

159) గృహమునకు వాయవ్యభాగమున వేరొక ఇల్లు నిర్మించుకొనిన ఎడల సర్వత్రా శుభ ఫలితములు కలుగును.

160) వాయవ్యభాగంలో పశువుల శాలలు, గడ్డిమేటలు వేసుకొనిన ఎడల పశు, ధనధాన్యాభివృద్ధి సర్వసుఖములూ కలుగును.

161) వాయవ్యభాగం తగ్గివున్నఎడల స్థితిపరులైవుండి ఎవరితోనూ సంబంధము పెట్టుకొనక తామే ఏకాంతముగా, శాంతముగా జీవించెదరు.

162) వాయవ్యభాగము పెరిగి, అందులో నూతులు, గోతులు వుండి, ఇతర వాస్తుదోషములు సంభవించిన యెడల, ఇంటి యజమాని సంతానములో మూడవవాడు ఇంటిని విడిచి అన్యప్రదేశములలో తిరుగుచూ జీవించువాడగును.

163) వాయవ్య భాగము మూసి, వాయవ్యమూలగా ఇంటిని నిర్మించిన యెడల పరస్పర విరుద్ధభావములతో కలహించుచూ సఖ్యతలేకుండా నిత్యమూ బాధపడెదరు.

## ఉత్తర భాగము

164) ఇండ్ల స్థలములుగానీ, ఇంటిలోని మరే ఇతర ప్రదేశములందుగానీ ఉత్తర భాగము పల్లముగా వున్నయెడల సర్వజన పూజ్యత, పుత్ర పౌత్రాభివృద్ధి, ధన ధాన్యాదులయందు అభివృద్ధి, సర్వత్రా శుభములూ కలుగును.

165) ఉత్తరభాగం ఎత్తుగా వున్నఎడల గౌరవభంగము. ఐశ్వర్యనాశనము సంతానమునకు అరిష్టము కలిగించును.

166) ఉత్తరభాగమున పాకలు, పందిళ్ళూ మొదలైన ఎత్తైన కట్టడములున్న యెడల వంశ నాశనము, ధన నాశనము కలిగించును.

167) ఉత్తరభాగమున పల్లముగానుండి అందులో పాకలు మొదలైనవి వున్నయెడల ఆదాయమును మించిన అధిక వ్యయము, ఋణగ్రస్తు లగుట. సంతానమునకు అభివృద్ధిలేకపోవుట, మొదలుగాగల చెడు ఫలితాలు కలుగును.

168) ఉత్తరభాగమున నూతులు, గోతులూ, వున్న యెడల ధనలాభము సంతతికి అభివృద్ధి కలిగించును.

169) ఉత్తరభాగము విశేషముగా ఖాళీ దొడ్లు వున్న యెడల పుత్రపౌత్రాభివృద్ధి ఐశ్వర్యము ఆదాయము కలిగించును.

170) ఉత్తరభాగమున పెంటపోగులు మొదలైనవి వేసిన ఎడల ధననాశనము, సంతానమునకు అరిష్టము మొదలుగా దుష్టఫలితములు కలుగును.

171) ఉత్తరభాగములో వంటఇల్లు వున్నయెడల ధన ధాన్యాదులకు హాని, వంశ నాశనము, అధిక వ్యయమువలన క్రమముగా దరిద్రమును కలిగించును.

172) ఉత్తరభాగములో పాయిఖానాదొడ్డి వున్నయెడల అసాధ్యమైన వ్యాధులు, శతృభయము, ధననష్టము కలిగించును.

173) ఉత్తరభాగములో నీళ్ళకుండీలు వున్నయెడల తీర్చలేని అప్పులు, ధన వ్యయము కలిగించును. ఆ కుండీలు భూమట్టమునకంటే లోతుగా వుండిన యెడల మంచి ఫలితములు నొసంగును.

174) ఉత్తరభాగములో ఇల్లుకు సమీపములో కోనేరు మొదలైనవి వున్న యెడల ధనధాన్యములకు అభివృద్ధి కలిగించును.

175) ఉత్తరభాగమునుంచి ఇంటిలోని వాడుకనీరు, వర్షపు నీరుగాని ఇవత లకు (వెలుపలకు) తూములవలన పోవుచున్నయెడల ధనధాన్యాభి వృద్ధి సంతతికి వృద్ధి కల్గును.

176) ఉత్తరభాగములో సింహద్వారముగాని, తదితర ద్వారములుగాని ఉత్తరమును చూచు చున్నట్లు వున్న యెడల ధన ధాన్యాదులయందు అభివృద్ధి కలుగును.

177) ఉత్తరభాగమునందు గల సింహద్వారములుగాని, తదితర ద్వార ములు గాని ఈ శాన్యమువైపు జూచుచున్నట్లు వున్నయెడల ఐశ్వర్యాభివృద్ధి నిత్యాభివృద్ధి కలుగును.

178) ఉత్తరభాగమునందు గల సింహద్వారములుగాని, తదితర ద్వారములు గాని వాయవ్యమును చూచుచున్నట్లు వున్నయెడల వంశహాని, ధనహాని కలిగించును.

179) ఉత్తరభాగమునందుగల అరుగులు గృహమునకు గల గర్భముకంటే ఎత్తుగా వున్నయెడల అధిక వ్యయము, ధన నష్టములు కలిగించును. ఋణగ్రస్తులుగా చేయుచూ, అశాంతి కలిగించును.

180) ఉత్తరభాగమున గల అరుగులు, గర్భములో సమానమైన ఎత్తు వుండిన ఎడల ఆదాయ వ్యయములు సమానముగా వుండి అభివృద్ధి చెందజాలరు.

181) ఉత్తరభాగమునగల అరుగులు గర్భముకంటే పల్లముగా నున్న ఎడల ధనలాభము, అభివృద్ధి కలిగించును.

182) ఉత్తరభాగమున సరిహద్దు గోడలపై నుంచి ఇంటి నిర్మాణముచేసి, మేడలు వేయుటవలన ఆ గృహములు అన్యాక్రాంతమగుట గాని, ఇంటి యజమానులు మారుటగాని జరుగును.

183) ఉత్తర భాగమునందు ఖాళీవిడిచిపెట్టి, ఉత్తర భాగమునకు వసారా లుంచి, ఇల్లు కట్టిన ఎడల ధనాభివృద్ధి, వంశాభివృద్ధి కలిగి సుఖించె దరు.

184) ఉత్తరభాగమునందు ఖాళీదొడ్డి వుంచకుండా, వసారాలు వేయకుండా ఏకఎత్తు పెట్టి ఇల్లుకట్టిన ఎడల క్రమముగా వంశము, ధనమూ క్షీణించిపోవును.

185) ఉత్తరసరిహద్దు గోడలపై ఏవిధ మైన కట్టుబడులు కట్టిననూ, ఆయింటి స్త్రీలకును స్త్రీ సంతానమునకు హాని కలుగను.

186) తన గృహమునకుగల ఉత్తరభాగమునందు గల ఖాళీదొడ్లు తన ఇంటిలో కలుపుకొనిన ఎడల సర్వవిధములుగా అభివృద్ధి చెందుదురు.

187) ఉత్తరభాగమునందుగల ఖాళీదొడ్లు ఎత్తుగా వున్నఎడల అధిక వ్యయము, అశాంతి కలిగించును.

188) ఉత్తరభాగమునందుగల విశేషమైన ఖాళీస్థలములో వేరొక ఇంటిని నిర్మించుకొనదలచిన ఉత్తర సరిహద్దు గోడల పై నుంచి కట్టుకొనిన యెడల ధననాశనము, వంశనాశనము కలిగించును.

189) ఉత్తరభాగమునందు గల ఖాళీస్థలములలో వేరొక గృహము నిర్మించుకొనదలచిన ఉత్తర సరిహద్దు గోడలపై నుంచి కట్టుకొనకుండా ఉత్తరమున ఖాళీ స్థలము విడిచిపెట్టి ఆవరణలో కట్టుకొనినయెడల సర్వత్రా శుభము కలుగును.

190) ఒక గృహమును రెండు భాగములుగా పంచుకొనకూడదు. ఒకవేళ తప్పనిసరిగా పంచుకొనిన యెడల ఉత్తరభాగము నందున్నవారు ఉచ్ఛ స్థితిలో నుందురు.

191) ఒక ఇంటిని రెండుగా పంచుకొనిన యెడల సోదరులలో చిన్నవారు ఉత్తరభాగమున వుండుటయే సర్వత్రా శ్రేయస్కరము.

192) తన ఇంటిలో ఉత్తరభాగమునందున్న గదిలో దక్షిణపు గోడకుచేర్చి, ఉత్తరమును చూచుచున్నట్లుగా బరువులు పెట్టుకొనిన యెడల సిరి సంపదలతో నుందురు.

193) అన్నదమ్ములు వేరువేరుగా ఇంటిని నిర్మించుకొనవలసివచ్చినప్పుడు చిన్నవారు ఉత్తరభాగంలో ఇంటినిర్మాణము చేసుకొనిన శ్రేయస్కరముగా నుండును.

194) ఒక ఇంటిని భాగములుగా పంచుకొనినయెడల ఉత్తరభాగములో వున్నవారికి సంతానాభివృద్ధి వుండును.

195) ఇంటిని అద్దెలకు ఇచ్చుకొనువారు ఉత్తరభాగమును వారుంచుకొని, దక్షిణభాగమునే అద్దెకు ఇచ్చుట శ్రేయస్కరము.

## ఈశాన్య భాగము

196) ఇండ్ల స్థలములకుగాని, ఇంటియందలి మరే ప్రదేశమునందుగాని ఈశాన్యభాగము పల్లముగానున్న ఎడల సౌభాగ్యము, సర్వత్ర సుఖము, ధనధాన్యాదులకు అభివృద్ధి, ధర్మబుద్ధి, కీర్తి ప్రతిష్టలూ కలుగును.

197) ఈశాన్యభాగము ఎత్తుగావున్నఎడల ధనహాని, ఐశ్వర్యనాశనము పెక్కు నష్టములూ కలుగుచూ మనఃక్లేశమును పొందుదురు.

198) ఈశాన్యభాగము ఎత్తుగానున్ననూ పల్లముగానున్ననూ అందులో పాకలు, మొదలైనవి వున్నయెడల వంశమునకు కీడు, దారిద్ర్యం సుఖహీనత మొదలుగాగల కష్టములు కలుగును.

199) ఈశాన్యభాగము పల్లముగానుండి అందులో నూతులు, గోతులు, తూములు వుంటే వంశవృద్ధి, గౌరవ ప్రతిష్టలు ధనధాన్యములు వృద్ధి చెందును.

200) ఈశాన్యభాగమునుంచి వర్షపునీరు, వాడుకనీరు వెలుపలికి పోవుచున్న యెడల వంశవృద్ధి, ధనధాన్యాదులవృద్ధి, బలమూ, సౌఖ్యము కలుగును.

201) ఈశాన్యభాగంలో పెంటకుప్పలు, పేడపోగులు, రాళ్ళ గుట్టలు, మున్నగునవి వేయుచుండిన ధనహాని, విరోధములు, సుఖహీనత, నీచప్రవర్తన, కలుగును. ఆయుక్షీణము కలుగును.

202) ఈశాన్యభాగంలో వంటయిల్లు వున్నయెడల కుటుంబ కలహములు, దీర్ఘవ్యాధులు, అధిక వ్యయము, వంశమునకు కీడు, ధనహాని కలుగును.

203) ఈశాన్యభాగంలో పాయిఖానాదొడ్లు వున్నయెడల కుటుంబ కలహములు, నీచప్రవర్తన, ద్రవ్యహాని, సంతానమునకు కీడూ కలుగును.

204) ఈశాన్యభాగంలో నీళ్ళుపోసే కుండీలు భూమట్టము కంటే తక్కువగా నిర్మించుకొనిన యెడల సుఖము, సౌఖ్యము కలుగును. భూమి మట్టమునకు మెరకగా నిర్మించుకొనిన యెడల అధిక వ్యయము, ఋణ, రోగాదులు, కుటుంబమునకు హానియూ కలుగును.

205) ఈశాన్యమున గృహమునకు సమీపములో కోనేరు, తటాకము నీటి బోదెలు వున్నయెడల కుటుంబవృద్ధి, ధన, ధాన్యాదులు అభివృద్ధి కలుగును.

206) ఈశాన్యమున గల స్థలము పెరిగివున్న యెడల పుత్రపౌత్రాభివృద్ధి, ధనధాన్యాదుల అభివృద్ధి, సుఖాన్ని కలిగివుందురు.

207) ఈశాన్య భాగములోవున్న స్థలము ఉత్తర దిక్కుగా పెరిగివున్న యెడల ధనధాన్యాభివృద్ధి కలవారై సుఖించెదరు, కాని ధనవ్యయమును అంగీకరించని లోభత్వము గలవారగుదురు.

208) ఈశాన్యభాగము తూర్పుదిక్కుగా పెరిగివుంటే, గౌరవ ప్రతిష్టలు కలిగి, ధర్మబుద్ధి కలిగి, ధనవంతులై ఉంటారు.

209) ఈశాన్యభాగము ఏ విధముగా పెరిగివున్ననూ, ఇంటి యుందున్న వారు సిరిసంపదలు కలిగి, ధనవంతులై వుంటారు.

210) ఈశాన్యభాగము తక్కువగావున్న, సంతానము లేని వారు అగుట, వంశనాశనము అగుటయూ, దరిద్రులుగానుండుటా మొదలయిన చెడు ఫలితములు ఎన్నో కలుగును.

211) ఈశాన్యభాగములో గల స్థలములో ఏ విధమైన కట్టడములు కట్టినా, అందులో నివసించేవారలకు, వంశ నాశనము, ధననాశనము, ఋణగ్రస్తులగుట, రోగములతో బాధపడుట మొదలైన చెడు ఫలిత ములు కలుగును.

212) ఈశాన్యభాగము ఖాళీగా నుండి, విశాలముగానుండి అందులో నుయ్యిగానీ, బావిగాని వుంటే ఆగృహస్తులు సిరిసంపదలతో, పుత్ర పౌత్రాభివృద్ధితో వర్థిల్లెదరు. ఇంటిలోని ఖాళీప్రదేశముగాని గదులు గాని, ఈశాన్యభాగము పల్లముగాగానీ, తేలికగానీ (బరువు లుంచక) వుండుటే సర్వత్రా శ్రేయస్కరము.

213) ఇల్లునకు ఈశాన్యభాగములో ఖాళీస్థలములు, దొడ్లూ వున్న ధన ధాన్యాభివృద్ధి, సంతానవృద్ధి కలుగును, ఈశాన్యభాగములో ఎత్తైన అరుగులున్న క్రమక్రమముగా ధననాశనము కలిగించును.

214) ఈశాన్యమున ఖాళీ స్థలములకంటే, ఇతర భాగముల యందు ఎక్కువ ఖాళీస్థలము, దొడ్లు వున్నయెడల క్రమక్రముగా ధనవినాశనమును కలిగించును.

215) ఇంటికి గల ఈశాన్యభాగమునందు ఖాళీస్థలములను తన ఇంటిలో కలుపుకొనిన అవి తన ఇంటిలోవున్న ఖాళీ స్థలములకంటే పల్లముగా నున్న ఐశ్వర్య ప్రదము. ఎత్తుగావున్న అధిక వ్యయము, నష్టము కలిగించును.

216) అట్లు కలుపుకొనవలసివచ్చిన, తన ఇంటియందలి ప్రదేశములోపల కంటే వచ్చిన, తన ఇంటియందలి ప్రదేశములోపల పల్లముగాచేసి కలుపుకొనిన సర్వశుభములు కలుగును. ఐశ్వర్యప్రదముగా నుందురు.

217) ఈశాన్యభాగమునందలి హెచ్చు స్థలములుగానీ, దొడ్లు గాని, ఒకదాని కంటే ఒకటి ఈశాన్యమునకు పెరుగునట్లు ఎంత ఎక్కువగా సంపాదించిన, అంత ధన భాగ్యములు వృద్ధి చెందును.

218) ఈశాన్యభాగమందలి హెచ్చు స్థలములన్నింటికి అనగా ఏస్థలమునకు ఆస్థలమే ఈశాన్యభాగము ఎక్కువగా కూడ పెరిగిఉండునట్లు చూచు కొనిన సర్వత్ర జయప్రదముగా నుండును.

219) ఈశాన్యముగా తన ఇంటిదాపునకు చేరివున్నస్థలమును పెంచు కొనుటకు సాధ్యపడని ఎడల ఇల్లునకు దూరముగానైననూ ఈశాన్య భాగము నందుగల స్థలములుగానీ, ఇళ్ళుగానీ సంపాదించిన వృద్ధి పొందగలరు.

220) ఈశాన్యభాగమందలి ఖాళీస్థలము గానీ, దొడ్లు గాని, ఇల్లుగానీ, ఎన్నడూ అమ్మి వేయకూడదు. అమ్మివేసిన ధన నష్టము కలుగును.

221) ఇంటికి ఈశాన్యభాగంలో ఎత్తైన, బలమైన కట్టడములు కట్టకూడదు! అట్లు కట్టిన దీర్ఘవ్యాధులు అనగా క్షయ, ఉబ్బసము, పిచ్చి మొదలైన అసాధ్యమైన వ్యాధులు కలుగుటగానీ, సంతాననష్టము కలుగుటగానీ, వివాహము మొదలైన శుభకార్యములు జరగకుండుట, ధనమునకు హాని, ఇత్యాది చెడు ఫలితములు అనేకము కలుగును. ఈశాన్యభాగము వంకరగా వున్న అంగవైకల్యము గల సంతానము కలుగును. ఈశాన్యము పూర్తిగా లోపించిన – త్వరగా దారిద్రముసంభవించుట కలుగును.

# ఇతర విశేషములు

222) ఇంటియొక్క సింహద్వారమునకు ఇరువైపులా కిటికీలు లేకపోతే రోగ బాధలు, ఋణబాధలు, నేత్ర రోగములు సంతాన నష్టము కలుగును.

223) గృహమునకు గల ద్వారములు, కిటికీలు, అలమారులు, ఒకదానికొకటి సూటిగా సరిగా లేకపోయిననూ, సరి సంఖ్యగా లేకపోయిననూ, గర్భ స్రావములు, సంతాన నష్టములూ కలుగును.

224) సింహద్వారమునకు ఒకప్రక్క కిటికీవుండి, రెండవ ప్రక్క కిటికీ లేకపోతే నేత్రరోగములు కలుగును.

225) సింహద్వారం ఇంటి భూమట్టముకంటే పల్లముగా కంటే పల్లముగా నున్న పిశాచ బాధలు, రోగ బాధలు, కలుగును.

226) ఇంటికి స్తంభములు లేకపోతే కురూపులగు సంతానము కలుగుదురు.

227) మూడు దూలములతో ఇల్లు కట్టకడదు. అలా కట్టిన రోగభయములు, మరణములూ కలుగును. దూలము క్రిందగా ద్వారము పెట్టిన సౌఖ్యము ఉండదు. కష్టనష్టములు కలుగును.

228) ఇంటికి గల గర్భము నాలుగు గజములుండవలెను. నాలుగు గజముల కంటే ఎక్కువగావున్న క్రమముగా ధననాశనము కలుగును. తక్కువగా నున్న రోగబాధలు, అపమృత్యువులూ కల్గును. సరిగా నాలుగు గజములున్న ఐశ్వర్యప్రదముగాను, జయప్రదముగానూ ఉండును.

229) ఇతరుల స్థలమునుంచిగానీ, గృహములనుంచి గానీ వర్షపునీరు, వాడుక నీరు తన ఇంటిలోంచి వెలుపలికి పోవుచున్న శతృవుల వలన భయము, విష జంతువుల వలన భయమూ కలుగును.

230) ఇంటికి గల స్థంభములన్నియూ సమసంఖ్యాంకముగా వుండవలెను. ఒకదానికొకటి వరుస తప్పకుండా వుండవలెను. అట్లు గాకుండా ఒక దానికొకటి వరుస తప్పిననూ, బేసిసంఖ్యలూగా వున్ననూ ఇంటి యజమాని భార్యకు, సంతానమునకూ నష్టము కలుగును.

231) ఇంటికి గల ద్వారములకు అన్నింటికీ తలుపులుండవలెను. అట్లు గాకుండా కొన్నింటికి తలుపులుండి కొన్నింటికి లేకపోయిన ఇంటి యజమానిని దీర్ఘవ్యాధిగ్రస్తుని చేయును.

232) ఇంటియొక్క వసారాలు సమ సంఖ్యాకములుగా ఉన్న ఐశ్వర్యవృద్ధీ, బేసి సంఖ్యాకములుగానున్న కీడు కలుగును.

233) రెండు గోడలు కలసిన మూలను 'మొత్త' అంటారు. అట్టి 'మొత్త'కు యెదురుగా ద్వారములు, కిటికీలు ఉండకూడదు ! అట్లు ఉన్న ధన నష్టము కలుగును.

234) ఒక ఆవరణలో మూడు ఇళ్ళున్న ధననష్టం, సంతాన నష్టం శత్రు బాధలు కలుగును.

## ఇంటి విభజన

235) ఒక ఇంటిని మూడు భాగములుగా కానీ, నాలుగు భాగములుగా కానీ పంచుకొనకూడదు. మూడుభాగములుగా పంచుకొనిన ఒక భాగస్థుదు దారిద్ర్యమును పొందుటగానీ, వంశనానము పొందుటగాని జరుగును. ఈ విధముగా పంచుకున్న ఇంటిలో ఒక్కరే బాగుండి మిగిలిన వారు సర్వనాశనము పొందెదరు. అందుచేత ఇల్లును పంచుకొనక, ఎవరికివారే ఇల్లు నిర్మించుకొనుట సర్వత్రా శ్రేయ స్కరము.

## ఇంటి గోడలు

236) ప్రతిఇల్లుకు గర్భగోడలు పూర్తిగా ఉండవలెను. గర్భ గోడలలో ప్రతీ అడ్డుగోడయూ మొదట్నుంచి చివరి వరకు పూర్తిగా ఉండక కొంత వరకూ వుండుటగానీ, తెంపులు కలిగిగానీ, మధ్యలో ఆగిపోయిగానీ ఉన్న ఆ ఇంటి యజమాని భార్యకు కీడుకలుగను.

237) ప్రతి ఇంటికి గర్భ గోడలలోని నిలువుగోడలు మొదటి నుంచీ చివరి వరకూ పూర్తిగా ఉండక కొంతవరకూ ఉండుటగానీ,

తెగతెంపులు కలిగి గానీ, మధ్యలో ఆగిపోయినా ఆ ఇంటి యజమాని భార్యకు గర్భస్రావములు, సంతాన నష్టములూ కలుగును.

238) తూర్పు, ఉత్తర సరిహద్దులయందుగల ప్రహరీ గోడలపై ఎన్నడునూ ఏవిధమైన కట్టుబడులు కట్టకూడదు. అట్లువేసిన తూర్పు గోడపై కట్టడములు కట్టిన ఆ ఇంట పుత్రులకు హాని కలుగును.

239) ప్రతి ఇంటికీ ప్రహరీ గోడలు ముఖ్యము. ప్రహరీ గోడలు ముందుగా నిర్మించక – ఇంటి నిర్మాణముచేసిన పరిసర స్థలములనుండిగాని, ఇంటినుండిగాని, ఒకప్పుడు దోషములు సంక్రమించి, ఇంటి నిర్మాణము నకు ఆటంకములుగాని, నిర్మించిన ఇంటిలోవున్నవారికి కష్ట నష్టములు గాని సంభవించును.

240) దక్షిణ పశ్చిమములనున్న ప్రహరీ గోడలు తూర్పు ఉత్తరములకున్న ప్రహరీ గోడలకంటే ఎత్తు ఎక్కువగానున్న ఐశ్వర్యప్రదముగా నుండును.

241) ఇండ్లను ఎట్టి పరిస్థితిలోనూ రెండుగా కోసి విభజింప కూడదు ! అలా చేసిన ఆ ఇంటిలో నివసించువారికి తప్పక మరణము కలుగును. మరియూ వంశనాశనమూ అగును.

242) పాత ఇండ్లను కొంత భాగము కొత్తగా మార్చి, కొంత భాగము పురా తనముగానే వుంచకూడదు ! అట్లుచేసిన ఆ గృహస్థులు అభివృద్ధిని పొందరు ! కష్టనష్టములకు గురిఅవుతారు.

243) ఏదిక్కునూ పూర్తిగా ఆక్రమించి గృహనిర్మాణము చేయరాదు, ప్రహరీ గోడలను కలిపి ఏ నిర్మాణము చేయరాదు.

## నామరాశీ ప్రాముఖ్యము

జ్యోతిర్నిబంధే–

శ్లో॥ దేశే గ్రామే, గృహే, యుద్ధే, సేవాయాం, వ్యవహారకే ।
నామరాశే, ప్రధానత్వం, జన్మరాశిం న చింతయేత్ ॥

**తా॥ రాజ్యము, ఊరు, ఇల్లు, యుద్ధము, సేవ, వ్యవహారము మున్నగు వానియందు నామనక్షత్రమే ప్రధానము ! జన్మనక్షత్రమును తలపరాదు. (ఉపయోగింపరాదు.)**

## గణిత పద్ధతి

శ్లో॥ ఆయామేవ విశాలమేవ గుణయేత్ క్షేత్రీకృతం యత్పదమ్ ।
నాగార్కైస్స్వమృణం భవేత్త్రికరిభిర్వారోంక శైలైర్ద్విసమ్ ।
షట్రింశేనభమష్టభైర్వ నజైరాయోంకభాకైర్వయ ।
స్త్వంశష్టణ్ణనభిస్తదేవ విభజేదాయుర్గజైర్దిక్పతిః ॥

**తా॥ ఖాళీస్థలము నందు ఎంతగృహ నిర్మాణము చేయదలచు కున్నామో, ఆ నిర్మాణ ప్రదేశము యొక్క పొడువు వెడల్పులను గుణించగా వచ్చు సంఖ్యను ఘనమని, పదమని, పిండమని లేక క్షేత్రీకృత పదమని అందురు. ఆ క్షేత్ర పదమును కొన్ని సంఖ్యలచే గుణించి, కొన్ని సంఖ్యలచే భాగించి గణిత శుద్ధి చేసి ధనము, ఋణము, ఆయము, వయస్సు, వారము, తిథి, నక్షత్రము, దిక్పతి, అంశ అని నవ వర్గు గణితముగా అలాగే యోగకరణములు కలిపి ఏకాదశ వర్గు గణితముగా ఇవి కాక షోడశ వర్గు గణితము వరకు చేసి శుభప్రదమైన క్షేత్రీకృత పదమును గృహ నిర్మాణమునకు ఉపయోగించవలెను.**

## నవ వర్గు గణిత విధానము

1. క్షేత్రపదము × 8 ÷ 12 = శేషము = ధనము.
2. క్షేత్రపదము × 3 ÷ 8 = శేషము = ఋణము.
3. క్షేత్రపదము × 9 ÷ 8 = శేషము = ఆయము.
4. క్షేత్రపదము × 9 ÷ 120 = శేషము = వయస్సు.
5. క్షేత్రపదము × 9 ÷ 7 = శేషము = వారము.
6. క్షేత్రపదము × 6 ÷ 30 = శేషము = తిథి.
7. క్షేత్రపదము × 8 ÷ 27 = శేషము = నక్షత్రము.

8. క్షేత్రపదము × 9 ÷ 8 = శేషము = దిక్పతి.

9. క్షేత్రపదము × 6 ÷ 9 = శేషము = అంశ.

## ధన ఫలము

శ్లో॥ ధనాధిక్యం రుణం స్వల్పం ధన ధాన్య శుభప్రదమ్ ।
ఋణాధిక్యం ధనం స్వల్ప రోగో ఋణ దరిద్రతా ॥

**తా॥ ధన శేషము ఋణ శేషము కన్న అధికమైన ధనధాన్యలాభములు గలుగును. ఋణశేష మధికమైన రోగము, దరిద్రము గలుగును. గనుక ఋణము కంటె ధనము అధికముగా ఉండవలెను.**

## ఆయ ఫలము

శ్లో॥ ధ్వజం ధనం ధూమ మనంత దుఃఖమ్
జయం మృగేంద్రం భయదంచ శ్వానమ్ ।
వసుర్వృషం రాజభయం ఖరంచ
సౌఖ్యం గజం వాయస దేహ పీడా ॥

**తా॥ వచ్చిన శేషమును బట్టి ఆయముల ఫలములు.**

| | | | |
|---|---|---|---|
| శేషము | **1** | **ధ్వజాయము** | **ధనప్రాప్తి.** |
| ,, | **2** | **ధూమాయము** | **దుఃఖము** |
| ,, | **3** | **సింహాయము** | **జయము** |
| ,, | **4** | **శ్వానాయము** | **భయము** |
| శేషము | **5** | **వృషభాయము** | **ధాన్యలాభము** |
| ,, | **6** | **ఖరాయయు** | **రాజభయము** |
| ,, | **7** | **గజాయము** | **సౌఖ్యలాభము** |
| ,, | **8** | **కాకాయము** | **దేహపీడ** |

**కనుక 1, 3, 5, 7 ఆయుములు శుభప్రదములు.**

## ఆయుః ఫలము

శ్లో॥ ఆయుష్షష్ట్యధికం శుభం గృహపతే ర్హీనంతు హాని ప్రదమ్ ॥

**తా॥ వచ్చిన శేషము 60 సంవత్సరములు కన్న అధికమైన గృహపతికి ఎల్లప్పుడు శుభములు గలుగును. శేషము తక్కువైన హాని, దరిద్రము కలుగును.**

## వార ఫలము

శ్లో॥ రవి కుజ శని వాసరాన్ విసృజ్యమితరాః మంగళ మిద్వదంతి ప్రాజ్ఞాః ॥

**తా॥ వచ్చిన శేషము 1 వచ్చిన ఆదివారము 2 వచ్చిన సోమవారము ఈ విధముగా ఏడు వారములు వచ్చును. సోమ, బుధ, గురు, శుక్ర వారములు శుభములు, మిగిలినవి వదలివేయవలెను.**

శ్లో॥ రిక్తేనాశ మవాప్నోతి । దుఃఖదం శుక్ల పాద్యమి ।
దర్శే మరణ మాప్నోతి । శేషాస్తు శుభదాస్మృతా ॥

**తా॥ రిక్త తిథులు అనగా చవితి, నవమి, చతుర్దశిలు గృహ నాశకరము, శుక్లపాద్యమి దుఃఖకరము, అమావాస్య మరణము, మిగిలిన తిథులు శుభఫలం.**

## నక్షత్ర ఫలం

శ్లో॥ అశ్వనీ, రోహిణీంచైవ పుష్యమి హస్త చిత్తయోః ।
శ్రవిష్టా వైష్ణవం మిత్రం ఉత్తరాస్త్రయ వారుణః ॥

**తా॥ అశ్వని, రోహిణి, మృగశిర, పుష్యమి, హస్త, చిత్త, అనూరాధ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రలు మంచివి.**

శ్లో॥ ఆర్ద్రా పునర్వసూ జ్యేష్ఠా రేవతీ మధ్యమం ఫలం ।
శేషరుక్షాణి నింద్యాని యిత్యేతే రుక్షలక్షణం ॥

**తా॥ ఆరుద్ర, పునర్వసు, జ్యేష్ఠ, రేవతి యివి మధ్యమ ఫలమునిచ్చును. భరణి, కృత్తిక, ఆశ్లేష, మఖ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, స్వాతి, విశాఖ, నక్షత్రములు అధమ ఫలమును యిచ్చును. శేషము వచ్చిన నక్షత్రము యజమానికి తప్పనిసరిగా తారాబలము కావలెను.**

## దిక్పతుల ఫలములు

శ్లో॥ యింద్రేచ శుభదంచైవ । చాగ్నే చాగ్ని భయం తథా ।
యమేచా శుభదం ప్రోక్తం నైఋత్యాం శతృభీతికం ॥
వారుణే పశువృద్ధించ । వాయువ్యే చలనం తథా ।
కుబేరే ధనదంచైవ । ఈశానేచ శుభాశుభం ॥

**తా॥ వచ్చిన శేషము 1 అయిన ఇంద్రుడు 2 అగ్ని యీ విధముగా 8 దిక్కులు అధిపతులు వచ్చును. 1. ఇంద్రుడు దిక్పతి అయినచో శుభము. 2. అగ్ని అధిపతియైన అగ్ని భయం, 3. యముడు దిక్పతివలన అశుభ కరము. 4. నైఋతి వలన శతృభయం 5. వరుణడు దిక్పతి అయిన పశు లాభము, 6. వాయువు దిక్పతి అయిన చలనము, 7. కుబేరుడు దిక్పతి అయిన ధాన్య వృద్ధి, 8. ఈశాన్యము వలన శుభదాయకము.**

## అంశ ఫలం

శ్లో॥ నష్టో వృద్ధి స్త్రియో మృత్యుః దహనం చోర పుత్రదమ్ ।
గోకులం కీర్తి మిత్యేవం నవాంశం పరికీర్తయేత్ ॥
శ్లో॥ మృత్యోర్నష్టోంశ దహనం చోరాంశం వర్జయేత్తథా ।
ఇతరం వాస్తు కర్మేషు సుఖమాహు ర్మనీషిభిః ।

| | | | |
|---|---|---|---|
| **శేషము** | **1** | **నష్టాంశ** | **ధన నష్టము** |
| **శేషము** | **2** | **వృద్ధ్యంశ** | **అభివృద్ధి** |
| **శేషము** | **3** | **స్త్రీ అంశ** | **సౌభాగ్యము** |
| **శేషము** | **4** | **మృత్యంశ** | **రోగ భయము** |
| **శేషము** | **5** | **దహనాంశ** | **అగ్ని భయము** |
| **శేషము** | **6** | **చోరాంశ** | **చోర భయము** |
| **శేషము** | **7** | **పుత్రాంశ** | **పుత్రవృద్ధి** |
| **శేషము** | **8** | **గోధనాంశ** | **పశుధనవృద్ధి** |
| **శేషము** | **9** | **కీర్త్యంశ** | **కీర్తి.** |

**వీటిలో 1, 4, 5, 6, అంశలు వదిలి వేయవలెను. మిగలిన అంశలు శుభప్రదము.**

# గృహ భాగములు - స్థానములు

**1. సమరాంగణ సూత్రధారే-**

శ్లో॥ మూత్ర భూమి రమేధ్యేతి వర్చస్కో అవస్కర స్థధా ।
గృహాచ్చ భిత్తి సామాన్య బాహ్యం పరిసరో మతః ॥

**తా॥ మల - మూత్ర స్థానములు యింటి ఆవరణములోపల వుండరాదు! వుండినచో, యజమాని తేజస్సు నశించి, ఆరోగ్యము కోల్పోవును. కావున అవి ప్రాకారము వెలుపలనే వుండవలెను.**

**2. ముహూర్త మార్తాండే -**

శ్లో॥ స్నానాఽగ్ని స్వపి వస్త్ర భోజన పశు ద్రవ్యాఽమశాక స్థితిమ్
పూర్వాఽదౌ జల మీశితు ర్దిశి పరం వాయో రపాఙ్మూత్రకమ్
అల్పేశక్తి భువోయధా రుచిపరే గేహస్యదక్షో ఘరట్టా ఽంబు
ఉలూఖలచుల్లికా పితృపదప్రక్షాళనాన్యాచిరే ॥

**తా॥ తూర్పున......................................స్నానగృహము**
**ఆగ్నేయమున..................................అగ్ని గృహము**
**దక్షిణమున.....................................శయన గృహము**
**నైఋతియందు ................................వస్త్ర గృహము**
**పశ్చిమమున.................................భోజన గృహము**
**వాయవ్యమున...............................పశు మందిరము**
**ఉత్తరమున...................................ధన గృహము**
**ఈశాన్యమున................................దేవ గృహము**
H **వాయవ్యమునందు..........................మల; మూత్రస్థానము**

H **ఇంటికి దక్షిణమునందు తిరుగలీ, రోలూ, రోకళ్లూ, పొయ్యీ, శ్రాద్ధ సమయములయందు పితృదేవతలకు ప్రత్యామ్నాయముగా భోక్తలకు పాదప్రక్షాళన మండలార్చనలు చేయుచోటు కల్పింప వలయును.**

**3. ముహూర్త చింతామణౌ –**

శ్లో॥ స్నానస్య పాక, శయనాఽ స్త్ర, భుజేశ్చ, ధాన్య ఽ
భాండార, దైవతగృహం చ, పూర్వతస్యుః
తన్మధ్యతోఽ థ మధనాఽ జ్య, పురీష, విద్యా ఽ
భ్యాసాఖ్య, రోదన, రతౌఽ షధ సర్వధామ ॥

**తా॥ ఇంటియందు –**

**తూర్పు దిక్కున..........................స్నాన గృహము**
**ఆగ్నేయమున..........................వంటయిల్లు**
**దక్షిణమున.............................పడక యిల్లు**
**నైఋతిన................................ఆయుధాశాల**
**పడమరలో..............................భోజనశాల**
**వాయవ్యమున..........................ధాన్యశాల**
**ఈశాన్యమున..........................దేవతాగృహము**
**తూర్పు ఆగ్నేయముల మధ్య..........పెరుగు చిలుకు చోటు**
**ఆగ్నేయ దక్షిణముల మధ్య..........వెన్నను కాచి నేయిగ చేయుచోటు**
**దక్షిణ–నైఋతుల నడుమ..........మలవిసర్జన స్థానము**
**నైఋతి–పడమరలమధ్య.................విద్యాభ్యాస స్థానము**
**పడమర–వాయవ్యములమధ్య.......(ఏడ్పు) రోదన గృహము**
**వాయవ్య–ఉత్తరములనడుమ..........రతిగృహము**
**ఉత్తర–ఈశాన్యముల నడుమ..........ఔషధగృహము**

**ఈ విధముగా అన్ని సౌకర్యములనూ, గృహభాగములయందు ఏర్పరచు కోవలెను.**

## గృహ ఆరంభ శుభమాసములు

శ్లో॥ మాఘ ఫాల్గుణ వైశాఖ మార్గ శ్రావణ కార్తికాః ।
మాసాస్యు గృహ నిర్మాణే పుత్ర పౌత్రాఽభివృద్ధిదా ॥

**తా॥ ఇల్లు కొత్తగ కట్టుకొనుటమొదలు పెట్టుటకు వైశాఖ, శ్రావణ, కార్తిక, మార్గశిర, మాఘ, ఫాల్గుణములు, శ్రేష్ఠము ! కుమారులు, మనుమలతో సర్వ విధముల అభివృద్ధిని కలిగించును.**

**మత్స్య పురాణే –**

శ్లో॥ అథాతః సంప్రవక్ష్యామి గృహకాల వినిర్ణయం ।
యథాకాలం శుభం జ్ఞాత్వా తథా భవన మాఽరభేత్ ॥

చైత్రేవ్యాధి మవాప్నోతి, యో గృహం కారయే న్నర ।
వైశాఖే ధేను, రత్నాని, జ్యేష్ఠే మృత్యుం తథైవ చ ॥

ఆషాఢే భృత్యరత్నాని, పశువర్గ మవాప్నుయాత్ ।
శ్రావణే మిత్రలాభం తు, హానిం భాద్రపదే తథా ॥

పత్నీనాశ మాశ్వయుజే, కార్తికే ధన ధాన్యకం ।
మార్గశీర్షే తథాభద్రం, పౌషే తస్కరతో భయం ॥

లాభంచ బహుశో విద్యా, దగ్నిం మాఘే వినిర్దిశేత్ ।
ఫాల్గుణే కాంచనం, పుత్రా నితి కాలఫలం స్మృతం ॥

**చైత్రము వ్యాధి, వైశాఖము పశువులు, సంపద, జ్యేష్ఠము మృత్యువు, ఆషాఢము మంచి సేవకులు, మంచి పశువులు, శ్రావణము మిత్రలాభము, భాద్రపదము కీడు, ఆశ్వయుజము భార్య మరణము, కార్తికము ధన ధాన్యములు, మార్గశిరము క్షేమము, పుష్యము దొంగల బాధ, మాఘము బహు లాభము, కానీ అగ్ని భయము, ఫాల్గుణము పుత్రుల ఐశ్వర్యము. ఇల్లు కట్టిన మాస ఫలితములు పై విధముగా కలుగును.**

**దీనిలోని విశేషము ఏమనగా చైత్రము పనికిరాదు అని చెప్పబడినది. కానీ, మీన చైత్రము నిషేధము కానీ, దక్షిణ భారత దేశస్థులకు మీనచైత్రము కూడా శుభకార్యములకుమంచిది. గృహసంస్థాపనం సూర్యే మేషస్థే శుభదం భవేత్ అని నారద మహర్షి వాక్యము. కనుక నిరాటంకముగా మేష చైత్రములో గృహారంభము చేయవచ్చును. ఇంకొక్క విశేష వచనము – ఆషాఢము గృహ నిర్మాణ ప్రారంభమునకు మంచిదని చెప్పబడివున్నది.**

**సనత్‌కుమార గృహవాస్తు :**

శ్లో॥ గృహ సంస్థాపనం చైత్రే ధనహాని । ర్మహద్భయమ్ ।
వైశాఖే శుభదం విద్యా । జ్యేష్ఠేతు మరణం ధ్రువమ్ ॥
ఆషాఢే గోకులం హన్తి. శ్రావణే భృత్యవర్ధనమ్ ॥
భాద్రపదే ప్రజాపీడా । అశ్వినే కలహం తథా ॥
కార్తికే ధనలాభం స్యా । న్మార్గశీర్షే మహద్భయమ్ ।
పుష్యే చాఽగ్నిభయం విద్యా । న్మాఘే చ బహు సంపదా ॥
ఫాల్గుణే రత్న లాభస్యా । న్మాసానాంతు శుభాఽశుభమ్ ॥

**తా॥ ఇల్లును మొదలు పెట్టుటకు చాంద్రమానము ప్రకారము –**

1. **చైత్రము ధనహాని, గొప్ప భయము.**
2. **వైశాఖము శుభముల నిచ్చును.**
3. **జ్యేష్ఠము మరణము**
4. **ఆషాఢము పశునాశనము**
5. **శ్రావణము దాస, దాసీ జనము పెరుగును.**
6. **భాద్రపదము బిడ్డలకు అనారోగ్యాది బాధలు**
7. **అశ్వినము (ఆశ్వయుజము) కలహము**
8. **కార్తికము ధనలాభము**
9. **మార్గశీర్షము గొప్ప భయము**
10. **పౌష్యము అగ్నిభయము**
11. **మాఘము సంపదలు అన్నియు కలుగును.**
12. **ఫాల్గుణము రత్న లాభము**

**మాఘములో ఇల్లు మొదలుపెట్టినచో అగ్నిభయము అని దోష భూయిష్టము అని ముహూర్త గణపతి; దైవజ్ఞ వల్లభము, సమరాంగణ సూత్రధారము, జ్యోతిర్ నిబంధము విశ్వకర్మప్రకాశికా, అగ్నిపురాణము, జ్యోతిర్ విదాభరణము, ముహూర్తదర్పణము ఆదిగా గల గ్రంథముల యందు చెప్పబడి ఉండుటచే మాఘమాసమును విడచుట మేలు అనిపించుచూ వున్నది.**

"సౌమ్య ఫాల్గుణ వైశాఖ మాఘ శ్రావణ కార్తికాః ।
మాసాస్స్యు గృహ నిర్మాణే పుత్రారోగ్య ఫలప్రదాః ॥

**మార్గశిర, ఫాల్గుణ, వైశాఖ, మాఘ, శ్రావణ, కార్తీక మాసములందు గృహారంభము చేసినయెడల పుత్ర, ఆరోగ్యాదిఫలములు ప్రాప్తించునని జ్యోతిర్నిబంధము నందు చెప్పబడినది. ఇందుకు వశిష్ఠవచనము.**

"మాసే తపస్యేతపసి మాధవేనభసిత్వషే ।
ఊర్జేచ గృహనిర్మాణం పుత్రపౌత్ర ధనప్రదమ్ ॥

**మాఘ, వైశాఖ, శ్రావణ, ఆశ్వయుజ, కార్తీక మాసములందు గృహనిర్మాణము చేసిన యెడల పుత్ర, పౌత్ర, ధనవృద్ధి, రత్నమాలయందు....**

"ఆషాఢ చైత్రాశ్వయుజోర్జ మాఘ
జ్యేష్ఠేషు సప్రోష్టపదేషు నూనమ్ ।
నికేతనానాం ఘటనం నృపాణాం
యోగేశ్వరాచార్య మతే నిషిద్ధమ్ ॥

**ఆషాఢ, చైత్ర, ఆశ్వయుజ, కార్తీక, మాఘ, జ్యేష్ఠ, భాద్రపద మాసములు గృహారంభమునకు నిషిద్ధములు. వాస్తురాజవల్లభమునందు**

"చైత్రే శోకకరం గృహాదిరచితం స్యాన్మాధవేఽర్థప్రదం
జ్యేష్ఠే మృత్యుకరం శుచౌ పశుహరం తద్వృద్ధిదం శ్రావణే ।
శూన్యే భాద్రపదే త్విషే కలికరం భృత్యక్షయం కార్తీకే
ధాన్యం మార్గసహస్యయోర్దహనయోర్మాఘే శ్రియం ఫాల్గుణే ॥

**చైత్రమునందు గృహారంభమైన శోకము, వైశాఖమునందు ధనప్రాప్తి, జ్యేష్ఠమునందు మరణము, ఆషాఢమునందు పశుహాని, శ్రావణమునందు పశువృద్ధి, భాద్రపదము శూన్యము, ఆశ్వయుజము కలహము, కార్తీకము భృత్యనాశము, మార్గశిరము ధాన్యం ప్రాప్తి. మాఘమునందు అగ్నిప్రమాదం. ఫాల్గుణమునందు సంపదకలుగును. పైన చెప్పబడిన చతుర్విదాభిప్రాయములలో గృహారంభము నకు చాంద్రమాస భేదములు తెలియుచున్నవి. నారద వచనానుసారము సౌరమాస ఫలములిట్లు తెలియుచున్నవి.**

"గృహసంస్థాపనం సూర్యే మేషస్థే శుభదం భవేత్ ।
వృషస్థే ధనవృద్ధిః స్యాన్మిథునే మరణం ధ్రువమ్ ॥
"కర్కటే శుభదం ప్రోక్తం సింహే భృత్య వివర్ధనమ్ ।
కన్యాయాం రుక్ తులేసౌఖ్యం వృశ్చికే ధనవర్ధనమ్ ॥
"కార్ముకే చ మహద్ధానిర్మకరే స్యాద్ధనాగమః ।
కుంభే తు రత్నలాభః స్యాన్మీనే రోగభయం భవేత్ ॥

**మేషమునందు సూర్యుడున్నపుడు గృహారంభమైనయెడల శుభము. వృషభము నందు సూర్యుడున్నపుడు ధనవృద్ధి, మిథునమున సూర్యుడున్నపుడు మరణము, కర్కాటకమందు శుభము, సింహమునందు భృత్యవృద్ధి, కన్యయందు రోగము. తులయందు సూర్యుడున్నపుడు సౌఖ్యము, వృశ్చికమునందు సూర్యుడున్నయెడల ధనవృద్ధి, ధనుస్సు నందు సూర్యుడున్నపుడు గొప్పహాని, మకరమందు సూర్యుడున్నపుడు ధనాగమము, కుంభమందు రత్నలాభము, మీనమందు సూర్యుడున్నపుడు రోగభయముగల్గును. అనగా ద్విస్వభావ రాసులగు మిథున, కన్యా, ధనుర్మీనములందు సూర్యుడున్నపుడు గృహా రంభము చేయకూడదు. ఇట్లు సౌరచాంద్రామాన భేదములవలన....**

"చైత్రేన్మేషరనౌవౌ మధౌ చ వృషభే జ్యేష్ఠే శుభౌ కర్కటే
భాద్రే సింహ గతే ఘటేఽ శ్వయుజి చోర్జేఽ లౌ మృగే పౌషకే ।
మాఘే నక్ర ఘటే శుభం నిగదితం గేహం తథోర్జే న సత్ ॥
కన్యాయాం చ తథా ధనుష్యపి న సన్ కృష్ణాదిమాసాద్భవేత్ ॥

**మేషమునందు రవియున్నపుడు చైత్రమాసము. వృషభమందు రవి యున్నపుడు జ్యేష్ఠమాసము, కర్కాటకమందు రవియున్నపుడు ఆషాఢమాసము. సింహస్థరవికాలములలో భాద్రపదమాసము, తులయందు రవియున్న కాలమున ఆశ్వయుజమాసము, వృశ్చికమునందు రవియున్నకాలమున కార్తీకమాసము, మకరస్థ రవికాలమున పుష్య మాసము. మకర కుంభములందు రవియున్న కాలమున మాఘమాసము. గృహారంభమునకు శుభదాయకమని కొందరు చెప్పుదురు.**

## గృహ నిర్మాణము శూన్య మాసములు

ముహూర్త దర్పణే -

శ్లో॥ మీన చైత్రో, ధనుః పుష్యో, మిధునాఽషాఢ కోఽపిచ ।
కన్యా భాద్రపదో మాసా, శ్శూన్య మాసాః ప్రకీర్తితాః ॥

**తా॥ సూర్యుడు మీనరాశీ సంచారములో ఉండినకాలములో చైత్ర మాసమునూ, సూర్యుడు మిధునరాశీ సంచారములో ఉండినకాలములో ఆషాఢ మాసమునూ, సూర్యుడు కన్యారాశీసంచారములో ఉండినకాలములో భాద్రపద మాసమునూ, సూర్యుడు ధనూరాశీసంచారములో ఉండిన కాలములో పుష్యమాసమునూ, శూన్య మాసములుగా పేరు పొందినవి, వీనియందు గృహా రంభ, నిర్మాణ - ప్రవేశము మొదలగు శుభములు చేయరాదు !**

## మాస దోషము లేని పాకలు

గృహ వాస్తు కల్పద్రుమే -

శ్లో॥ నిషిద్ధే ఋక్షేషు స్వాఽనుకూలే శుభేదినే ।
తృణ దారు గృహాఽరంభే మాసదోషో న విద్యతే ॥
పాషాణేఽ ష్ట్యా గేహాని నింద్యమాసే న కారయేత్ ॥

**తా॥ గడ్డి, రెల్లు, ఆకులు, వెదురు, బొంగులు మున్నగు వానితో నిర్మించు (అనగా గోడలు కూడా పైవానితోనే నిర్మించు) ఇళ్ళకు నక్షత్రములు, మాసములు మంచివి కాకున్నను దోషములేదు. రాయి, ఇటుక మున్నగు వానితో గోడలు నిర్మించి, కట్టుకొను ఇళ్ళకు మాత్రమే ఈ విధమగు మాస దోషము కలదు.**

## శుభప్రదమగు పక్షము

గృహవాస్తు కల్పద్రుమే :

శ్లో॥ శుక్లపక్షే భవేత్ సౌఖ్యం, కృష్ణే తస్కరతో భయమ్ ।
తస్మాత్ విచార్య కర్తవ్యం, యదిచ్ఛేత్ శ్రియ మాత్మనః ।

**తా॥ లక్ష్మీ కటాక్షము సంపూర్ణముగా కావలెనని కోరికగలవారు శుక్ల; కృష్ణపక్షములలో – ఏది శ్రేయోదాయకమో తప్పక తెలిసుకొనవలెను.**

**(1) శుక్ల పక్షమునందు గృహారంభము చేసినచో – సుఖము కలుగును.**

**(2) కృష్ణ పక్షమునందు గృహారంభము చేసినచో – దొంగల భయము కలుగును. కావున శుక్ల పక్షము నందు గృహారంభము చేయుట సర్వవిధముల శ్రేయోదాయకము.**

**సనత్ కుమార గృహవాస్తు :**

శ్లో॥ శుక్ల తృతీయా మాఽరభ్య యావత్ కృష్ణాతు సప్తమీ ।
శుక్లపక్ష మితి జ్ఞేయం, శేషం కృష్ణ ముదాహృతమ్ ॥

**తా॥ ఏ మాసమునందైననూ శుక్లపక్షము నందలి తృతీయ (తదియ తిథి మొదలుకొని, కృష్ణ పక్షములోని సప్తమీ తిథి వరకునూ పూర్ణచంద్రుడు ఉండును. కనుక అంతవరకు శుక్లపక్షమనియునూ, కృష్ణపక్ష అష్టమీ తిథి నుండి, మరుసటి నెల శుక్లపక్ష ద్వితీయ (విదియా) తిథివరకునూ క్షీణ చంద్రుడు వుండుట వలన కృష్ణ పక్షమనియునూ సనత్‌కుమారునిచే నిర్ణయము చేయబడినది.**

**కనుక సర్వవిధముల ఆలోచన చేసి గృహ నిర్మాణము చేయువారు క్షీణ చంద్ర తిథులను విడచి, పూర్ణచంద్ర తిథులలో మేలైన వానిని స్వీకరించి గృహ నిర్మాణము చేసికొనవలయును.**

## శుభ ప్రదమగు తిథులు

**సమరాంగణ సూత్రధారే :**

శ్లో॥ ద్వితీయా, పంచమీ, ముఖ్యా, సప్తమీ, నవమీ తథా ।
ఏకాదశీ, త్రయోదశ్యా, తిథయ స్యుః శుభాఽవహా ॥
కార్యా పుర నివాసే చ, ప్రారంభే భవనస్య చేఽతి ।

**తా॥ గృహ నిర్మాణమునకు సర్వ విధముల మేలు కలిగించు తిథులు ద్వితీయా (విదియ), పంచమీ, సప్తమీ, నవమీ, ఏకాదశీ, త్రయోదశీ**

**శుభకరములైనవి. ఈ తిథులలో పట్టణములు, ఇళ్ళు, మేడలు మొదలగునవి. ఏ పనినైననూ మొదలు పెట్టుటకునూ, ఇళ్ళు కట్టుటకునూ సర్వశ్రేష్ఠమైనవి**

శ్లో॥ మౌంజీబంధే వివాహే చ ప్రవేశే యజ్ఞకర్మణి ।
భరణీ కృత్తికా చైవ న దోషా మంటపాదిషు ॥

**భరణి నక్షత్రము 3వ పాదం నుండి రోహిణి నక్షత్రము 1వ పాద అంత్యముము వరకు కర్తరి అని అందురు. ఈ సమయమున గృహ సంబంధమైన ఏ కార్యములు చేయరాదు. ఉపనయనము, వివాహము, అనంతర గృహప్రవేశము, యజ్ఞము, మంట పాదులు గట్టుట ఇట్టి కార్యములు చేయవచ్చును.**

"ద్వితీయా పంచమీ ముఖ్యాతృతీయా షష్ఠికా తథా
సప్తమీ దశమీ చైవ ద్వాదశ్యేకాదశీ తథా ।
త్రయోదశీ పంచదశీ తిథయః స్యుః శుభావహాః
దారిద్ర్యం ప్రతిపత్కుర్యాత్ చతుర్థీ ధనహారిణీ ।
అష్టమ్యుచ్చాటనం చైవ నవమీ శస్యఘాతినీ
దర్శే రాజభయం జ్ఞేయం భూతే దారావినాశనమ్ ॥

**ద్వితీయ, పంచమి, తదియ, షష్ఠి, సప్తమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, పూర్ణిమాతిథులు గృహారంభమునకు యోగ్యములు.**

**పాడ్యమియందు దరిద్రము, చవితియందు ధనహాని, అష్టమియందు ఉచ్చాటనము, నవమియందు ధాన్యనాశము, అమావాస్యయందు రాజ భయము, చతుర్థశియందు స్త్రీ వినాశము గల్గితీరును.**

"సౌరేందుజీవసౌమ్యానాం భార్గవస్య వాసరే ।
సూత్రపాతాదికం కార్యమిష్టం సమభివాంఛితా ॥

**శని, సోమ, గురు, బుధ, శుక్రవారములు గృహారంభమునకు ప్రశస్తములు** "ఆదిత్యభౌమవర్జంతు సర్వేవారాః శుభావాహాః" కానిస్తంభ ప్రతిష్ఠా కలహంచ దేవ్రం ఆరిష్టమర్కే శనౌ చ దాహః । అపత్యహానిస్తు కుజస్య వారే గురుజ్ఞ కావ్యేషు సుతార్థలాభః ॥ **స్తంభప్రతిష్ఠకు సోమవారమైన కలహము,**

**ఆదివారమైన అరిష్టము, శనివారమైన అగ్నిదగ్ధము, మంగళవారమైన సంతాన నష్టము. బుధ, గురు, శుక్రవారములు పుత్ర, ధన లాభములు కలుగును. కావున బుధ, గురు, శుక్రవారములు ప్రశస్తములని చెప్పబడినది.**

## అశుభ తిథులు

**ముహూర్త గణపతి :**

శ్లో॥ త్యక్త్వా చతుర్దశీం, షష్టీం । చతుర్థీ, మష్టమీ మిమాం ।
నవమీం చ । రవిం । భౌమం గృహా౽ రంభో విధీయతే ॥

**తా॥ చతుర్థీ, షష్టీ, అష్టమీ, నవమీ, చతుర్దశీ తిథులనూ, ఆది, మంగళ వారములనూ, విధిగా విసర్జింపవలెను. నవమీ తిథి గృహారంభమునకు మంచిది అని సమరాంగణ సూత్రధారము నందు చెప్పగా–ముహూర్త గణపతిలో నవమి రిక్త తిథియని చెప్పిబడినది.**

**ముహూర్త దర్పణే :**

శ్లో॥ అష్టమీ, ద్వాదశీ, షష్ఠీ చతుర్థీ చ చతుర్థశీ ।
పక్ష చ్ఛిద్రా శ్చ తిథయ ః శుభ కార్యేషు నిందితాః ॥

**తా॥ చతుర్థీ, షష్ఠీ, అష్టమీ, ద్వాదశీ, చతుర్దశీ తిథులు పక్ష చ్ఛిద్రములు అను పేరు కలిగినవి. కనుక తప్పని సరిగా శుభకార్యముల యందు ఎల్లప్పుడునూ వీనిని వదలి వేయవలెను.**

## శుభ వారములు

**1.** శ్లో॥ వారఃప్రశస్తాః శుభ ఖేచరాణామ్ ।

**తా॥ శుభగ్రహవారములగు సోమ, బుధ, గురు, శుక్రవారములు సర్వ శుభకార్యములకునూ మేలైనవి.**

**2. ముహూర్తగణపత్యాం –**

శ్లో॥ గురు శ్చంద్రో బుధ శ్శుక్రః శుభవాసరా శ్శుభే స్మృతాః ।
క్రూరా౽స్తు క్రూర కృత్యేషు గ్రాహ్యా భౌమా౽ర్క సూర్యజః ॥

**తా॥ గురు, చంద్ర, బుధ, శుక్రవారములు శుభకార్యములకు మంచివి. క్రూరగ్రహవారములగు సూర్య, శని, మంగళవారములు క్రూరకార్యములకు మాత్రమే ఉపయోగింప దగును.**

గృహవాస్తు దీపికాయామ్ –

శ్లో॥ భాను ర్భౌమే చ మందేచ అగ్నినా దహనం భవేత్ ।
బుధౌ గురౌ చ శుక్రేచ సోమే సుత వర్ధనమ్ ॥

**తా॥ ఆది(త్య) మంగళ (అంగారక) శనివారములయందు ఇంటిపని మొదలు పెట్టినచో – ఆ యిల్లు అగ్ని వలన దగ్ధమగును.**

**బుధ, గురు, శుక్ర, సోమ వారముల యందు గృహారంభము కావించి నచో కుమారులు జన్మించి వంశాఽభివృద్ధి జరుగును.**

శ్లో॥ సహస్ర గుణయుక్తేఽపి మందవారే కుజేతిథౌ (దినౌ) ।
శుభకర్మ న కుర్వీత, కుర్యా చ్చే న్మరణం ధృవమ్ ॥

**తా॥ వేయి (లేక అనంతము) ఉత్తమ ఫలితములను కల్పించు యోగము వుండినప్పటికినీ, శని, మంగళవారములు (కుజతిథిని,) శుభకర్మల యందు స్వీకరింపరాదు. అటుల స్వీకరించినచో కర్తకు మరణము తథ్యము.**

సనత్ కుమార గృహవాస్తు :

శ్లో॥ శశి కలహ మరిష్టం । భాస్కరే చాఽగ్ని దాహమ్ ।
అశుభమితి చ మందే । భూమి పుత్రో వినాశమ్ ॥
కవి, గురు, బుధ వారాః స్తంభ ఘాతే ప్రశస్తాః ।
ఇది వదంతి మునీంద్రై ర్మానసానామ్ గృహాణీ ॥

**తా॥ గృహారంభమునకు మొదటిపని శంకుస్థాపనకై గొయ్యిని త్రవ్వుట ! ఆ పని సోమవారము చేసిన పోట్లాట, వినాశము, ఆదిత్య (ఆది) వారమైన తగులబడును, శనివారమైన కీడు, మంగళవారమైన సర్వ నాశనము, బుధ, గురు, శుక్రవారములు సర్వశ్రేష్ఠములు కలుగును.**

# శంకుస్థాపన - కాలము - ఫలము

**బృహద్వాస్తు మాలా :**

శ్లో॥ శుక్ల పక్షే దివాకార్యం, న నిర్మాణం చ రాత్రి షు ।

**తా॥ పూర్ణ చంద్ర తిథులలో పగటిపూట శంకువును స్థాపించి గృహారంభము చేయవలెను. (అపరాహ్ణ, సాయంకాల, రాత్రులయందు శంకుస్థాపన చేయరాదు.)**

శ్లో॥ పూర్వాహ్నే చోఽత్తమం విద్యాత్ మధ్యాహ్నే మధ్యమం ఫలం ।
సంధ్య యో రపరాహ్నే చ క్షీణాఽయుశ్చ విగర్హితః ॥

**తా॥ పూర్వాహ్నమున (10 గంటల లోపల) ఉత్తమము, మధ్యాహ్నమున (11 నుండి 1 గంటవరకు) మధ్యమ (సగము) ఫలము ! అపరాహ్ణము, సాయాహ్న, సంధ్యాకాలములో శంకుపును స్థాపించరాదు.**

**కాలములు :** 1. ప్రాతః, 2. సంగవ, 3. మధ్యాహ్న, 4. అపరాహ్ణ, 5. సాయం కాలములు

# గృహారంభ శుభ నక్షత్రములు

ఉత్తరేపి చ రోహిణ్యాం పుష్యే మైత్రే కరద్వయే ।
ధనిష్ఠా ద్వితయే పౌష్ణే గృహారంభః ప్రశస్యతే ॥

**ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రోహిణీ, పుష్యమి, అనూరాధ, హస్త, చిత్త, ధనిష్ఠ, శతభిషము, రేవతి. ఈ 11 నక్షత్రములును గృహారంభమునకు ప్రశస్తములు, ఇవిగాక అశ్విని, మృగశిర, పునర్వసు, స్వాతి, మూల, శ్రవణనక్షత్రములు యోగ్యమైనవని గ్రంథాంతరములందు చెప్పబడినది.**

**1.** పరాశర మహర్షి వాక్యము (సంస్కృత వాచస్పత్యమునందు)

శ్లో॥ చిత్రా, శతభిషా, స్వాతీ, హస్తః, పుష్యః పునర్వసుః ।
రోహిణీ, రేవతీ, మూల, శ్రవణ యోఽత్తరా ఫల్గునీ ॥

ధనిష్ఠా చోఽ ఉత్తరాషాఢా, తథా భాద్రోఽ ఉత్తరాన్వితా ।
అశ్వినీ, మృగశీర్షం చ అనూరాధా తథైవ చ ॥
వాస్తు పూజన మేతేషు నక్షత్రేషు కరోతి యః
సప్రాప్నోతి నరో, లక్ష్మీ మితిప్రాహ పరాశరః ॥

**తా॥ అశ్వినీ, రోహిణీ, మృగశిరా, పునర్వసూ, పుష్యమీ, ఉత్తరఫల్గుణీ, హస్తా, చిత్తా, స్వాతీ, అనూరాధా, మూలా, ఉత్తరాషాఢా, శ్రవణము, ధనిష్ఠా శతభిషమూ, ఉత్తరాభాద్రా, రేవతీ నక్షత్రములు గృహారంభమునకు మంచివి అనీ, మానవులకు లక్ష్మీకటాక్షము తప్పక కలుగుననీ పరాశర మహర్షి చెప్పినారు.**

## లగ్నములు - ఫలము

శిల్ప సంగ్రహే :

శ్లో॥ స్థిరలగ్నం శుభం ప్రోక్తం, ద్విస్స్వభావం తు మధ్యమమ్ ।
చర లగ్నం పరిత్యజ్య, వాస్తు కర్మేషు సర్వదా ॥

**తా॥ వాస్తు కర్మ అనగా । శంకు స్థాపన మొదలు గృహప్రవేశము వరకునూ చేయుపనులు, వీనియందు శుభము లిచ్చునది స్థిరలగ్నము, మధ్యమ ఫలితము ద్విస్స్వభావలగ్నము , దోషభూయిష్టమైనది చర లగ్నము, కనుక బుద్ధిమంతులైనవారు ప్రప్రథమముగా స్థిరలగ్నమునకు ప్రాముఖ్య మియ్యవలెను. అది కుదరని పక్షమున ద్విస్స్వభావ లగ్నమును స్వీకరింప వచ్చును. ఎట్టి పరిస్థితులలోనూ చర లగ్నమును స్వీకరింపక విధిగా వదలి పెట్టవలెను.**

"ద్వ్యంగే సరే వా భవనే విలగ్నే సౌమ్యగ్రహైర్యుక్త నిరీక్షతేచ ।
కరస్థితై ర్వీర్యయుతైశ్చ సౌమ్యైర్నిర్మాణమాహు ర్భవనస్య సంతః ॥

**గృహారంభమునకు ద్విస్వభావరాసులగు మిధున కన్యా ధనుర్మీనములును, స్థిర రాసులగు వృషభ వృశ్చిక కుంభములును, యోగ్యములు,**

**లగ్నమందు శుభగ్రహమున్నను (గురు, శుక్ర, బుధులు,) చూచినను,దశమ మందున్నను ప్రశస్తము.**

## విశిష్ఠ యోగములు

శ్లో॥ శనిః స్వాతీ సింహలగ్నం శుక్లపక్షశ్చ సప్తమీ ।
శుభయోగః శ్రావణశ్చ సకారా సప్తకీర్తితాః ॥
సప్తానాం యోగతో వాస్తు పుత్రపౌత్రప్రదః సదా ।
గజాశ్వధనధాన్యాది పురో తిష్ఠంతి సర్వతః ॥

**1 శనివారము 2 స్వాతీనక్షత్రము 3 సింహలగ్నము 4 శుక్ల పక్షము 5 సప్తమి 6 శుభయోగము 7 శ్రావణమాసము, ఈసప్త సకార యోగము నందు గృహారంభము చేసినయెడల గజ, అశ్వ, ధన, ధాన్య, పుత్రపౌత్రప్రద మగును. ఈసప్త సకార యోగము నందు సింహలగ్నము ప్రయుక్తమైనది గాని సింహలగ్నము గృహారంభమునకు అనిష్టదాయకమని గ్రహించవలెను.**

## శుభకార్యములు - శుభకాలము

శ్లో॥ ఆదౌ కాలం పరీక్షేత, సర్వకార్యాఽర్థ సిద్ధయే ।
కాలో ఽహి సర్వ జీవానాం శుభాఽ శుభ ఫలప్రదమ్ ॥
కాలాఽ తిక్రమణే దోషో, ద్రవ్యఽహానిఽశ్చ జాయతే ।
దేవానా మపి దేవీనాం, విప్రాఽదీనాం విశేషతః ॥
ప్రాసాద, భవనాఽరంభే స్తంభ స్థాపన కర్మణి ।
ద్వార స్థాపన వేళాయాం భవనానాం ప్రవేశనే ॥
వాపీ, తటాక నిర్మాణే, గోపురాఽరంభ కర్మణి ।
విమాన, మణ్డపాఽరామ, గర్భగేహోఽర్ధృతౌ తథా ॥
కాలం శుభం పరీక్షేత మఙ్గలావాప్తి సాధనమ్ ।

**తా॥ సర్వకార్యములు ఉత్తమ ఫలితములను ఇచ్చుటకు, కాలమును శుభప్రదమైన దానిగా పరీక్షించి, తెలిసికొని, కార్యారంభముచేయవలెను. సర్వ జీవులకునూ శుభకాలము శుభఫలితములనూ, అశుభకాలము అశుభ**

ఫలితములనూ తప్పక కల్పించును శుభకాలము దాటినపిమ్మట చేయు సర్వశుభకార్యములు దుష్ట ఫలితములనూ, ఐశ్వర్య హానినీ కలుగ జేయును. పురుషదేవతల, స్త్రీ దేవతల, బ్రాహ్మణుల, ప్రాసాదములు, భవనములు ప్రారంభ సమయమునందునూ, స్తంభములు నిలుపు నపుడునూ, ద్వారములు పెట్టునపుడునూ, దిగుడుబావులు, చెఱువులు నిర్మించు వేళలయందునూ, గోపురములుకట్టుట మొదలిడినపుడునూ, విమానగోపురములు, మండప ములు, ఉద్యానవనములు, గర్భగృహములు, జీర్ణోద్ధరణ వేళలయందునూ, సర్వశుభములకునూ నిలయమైన కాలమును బాగుగ పరిశీలించి, శుభ ఫలదాయకమగు, ఐశ్వర్య ప్రదమగు శుభకాలమును ఎన్నుకొని, దాని యందు విధిగా కర్మారంభము కావింప వలసి యున్నది.

## ఉపగృహ నిర్మాణ మాసములు

గృహ వాస్తు కల్పద్రుమే :

శ్లో॥ శస్తం పశు గృహం జ్యేష్ఠే, త్వశ్వినే దాన్య నీడనమ్ ।
పానీయ శాలికా మాఘే, చైత్రే ధారా గృహం తథా ॥

తా॥ జ్యేష్ఠము నందు = పశువుల కొట్టము
ఆశ్వినము నందు = ధాన్యపు కొట్టు
మాఘము నందు = పానీయ శాల
చైత్రము నందు = దబ్బును అప్పుగా ఇచ్చు గది
పై మాసములయందు ఆయా ఉపగృహములు నిర్మించుకొనవలెను.

ఉపగృహములకూ, అరుగులకూ, కొలతలతో పనిలేదు !

## జీర్ణగృహ నిర్మాణమునకు

"జీర్ణోద్ధారే జలాగ్న్యాదిభయతః పతితే గృహే ।
శ్రావణోర్జే తథా మాఘే కారయేత్సుఖదం గృహమ్ ॥

**అగ్నివాయు జలాదులచే పడిపోయిన గృహములను పునర్నిర్మాణము. లేక మరమ్మతు చేయుటకు శ్రావణ. కార్తీక, మాఘమాసములు శుభ ప్రదములు.**

"కృత్యం వేశ్మభవం దివైవ విహితం రాత్రౌ ప్రవేశః క్వచిత్"

**గృహారంభము (శంఖుస్థాపన, స్తంభప్రతిష్ఠాదులు) పగటియందు చేయుట శ్రేష్ఠము.**

"గృహారంభం గృహిణ్యాం తు గర్భిణ్యాం నైవ కారయేత్ ।
యది కుర్యాద్గర్భహానిః పత్నీ పుత్రక్షయో భవేత్ ॥

"శంకోస్సంస్థాపనం రాత్రౌ నకర్తవ్యం కదాచన ।
యదికుర్యాత్కర్తృహాని పుత్రహానిర్నసంశయః ॥

**భార్య గర్భవతిగానున్నపుడు గృహారంభము చేయకూడదు. చేసినచో గర్భహాని పుత్రనాశము గల్గును. రాత్రియందు శంకుస్థాపనమెప్పుడును చేయగూడదు. చేసినచో గృహకర్తకు కీడు, పుత్రహాని కల్గును.**

"భౌమార్కరిక్తామాద్యూనే చరోనేఽంగే విపంచకే ।
వ్యష్టాంత్యస్థైః శుభైర్గేహారంభ స్త్ర్యాయారిగైః ఖలైః ॥

**మంగళ, ఆదివారములు, రిక్త తిథులు, అమావాస్యలను విడచి అన్యవారము లందును. చరలగ్నములను. (మేష, కటక, తులామకరములు) సింహలగ్నమును, విడచి ఇతరలగ్నములందును. లగ్నమునకు అష్టమ వ్యయములందుతప్ప ఇతరస్థానములందు శుభగ్రహములును, తృతీయ షష్ఠ లాభములందు పాపగ్రహములును, ఉన్నప్పుడు గృహారంభము చేయవలెను.**

**"విపంచక" శబ్దమును పంచకరహితముగా కొందరు గ్రహించుచున్నారు. అనగా రుగనలనృపచోర మృత్యు సంజ్ఞక పంచబాణదోషరహితమగు లగ్నమని భావించుచున్నారు. మహారాష్ట్రము నుండి దక్షిణాదిదేశములందు దీనికి ప్రాధాన్యత ఇవ్వబడినది.**

"నృపాఖ్యం రాజసేవాయాం గృహగోపేగ్ని పంచకమ్ ।
యానే చోరం వ్రతే రోగం త్యజేన్మృత్యుం కరగ్రహే ॥
మరియు "వ్రతౌ వివర్జయేద్రోగం గృహగోపేగ్ని పంచకమ్ ।
యాత్రాయాం రాజచోరాఖ్యౌ వివాహే మృతపంచకమ్ ॥

**అనుటవలన గృహాచ్ఛాదన విషయమున అగ్నిపంచకదోషము నిషిద్ధ మనితెలియుచున్నది. కొందరు ధనిష్ఠాది 5 నక్షత్రములు నిషిద్ధములని అర్థము తీయుచున్నారు. కాని అన్యత్ర ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతీనక్షత్రములు గృహారంభమునకు ప్రశస్తములని చెప్పబడుటవలన "విపంచకే" అనుపదమునకు ధనిష్ఠా పంచక అతిరిక్త నక్షత్రములని చెప్పుట సమంజసముకాదు. మరియు**

"ధనిష్ఠా పంచకేనైవ కుర్యాత్ స్తంభ సముచ్ఛ్రయం ।
సూత్రాధార శిలాన్యాస ప్రాకారాది సమారభేత్ ॥

**అను మాండవ్య వచనానుసారము గృహారంభము (శంఖుస్థాపన) పిదప స్తంభ ప్రతిష్ఠకు ధనిష్ఠా పంచకనక్షత్రములు నిషిద్ధములని తెలియు చున్నది. కావున "విపంచకే" అను పదునకు విశేషణమగు "చరోనేంగే" చరలగ్నములు మరియు ఐదవ లగ్నమగు సింహమును విడచి తక్కిన స్థిర, ద్విస్వభావ లగ్నములని అర్థము, తీసికొనుట యుక్తముగానున్నది. ఇందుకు వాస్తుప్రదీప ప్రామాణిక వచనము.**

"నష్టేందు రిక్తాకుజ సూర్య వర్జే చరో నభే సింహ విహీన లగ్నే ।
పాపై స్త్రిషష్ఠాయగతైః శుభైశ్చ వ్యత్యాష్టగై ర్గేహ విధిం శుభః స్యాత్ ॥

## గృహారంభమునకు వృషభవాస్తు వివరణ

ముహూర్త చింతామణౌ :

**సూర్యుడున్న నక్షత్రము నుండి 3 నక్షత్రములు వృషభముయొక్క శిరస్సు నందుంచిన ఈ మూడు నక్షత్రములలో నొక నక్షత్రమగుచో గృహపతికి నాశముగల్గును. తరువాత 4 నక్షత్రములు ముందరికాళ్ళపై నుంచవలెను.**

**ఈ నక్షత్రములందొకటి యగుచో శూన్యఫలము, అనగా సూర్యనక్షత్రము నుండి 7 నక్షత్రములును అశుభములు, తరువాత 4 నక్షత్రములు వెనుక కాళ్ళపై వ్రాయవలెను, ఈ నాలుగు నక్షత్రములలో నొకనక్షత్రము గృహారంభ నక్షత్రమైన యెడల స్థిరత్వము గలుగును, తరువాత 3 నక్షత్రములు పృష్ఠ భాగముననుంచిన అందొకటి గృహారంభ నక్షత్రమైన యెడల లక్ష్మీ ప్రాప్తి, తరువాత 4 నక్షత్రములు దక్షిణ కుక్షియందుండ నందొకటియైన లాభము. అనగా సూర్య నక్షత్రమునకు 8వ నక్షత్రము నుండి 11 నక్షత్రములు అనగా 18వ నక్షత్రమువరకు శుభ ప్రదములు, తరువాత 3 నక్షత్రములు తోకయందుంచి అందొకటియైన గృహపతికి నాశము, ఎడమ కుక్షియందు నాలుగు నక్షత్రములలో నొకటైనయెడల దారిద్ర్యము, చివరి మూడు నక్షత్రములు ముఖమునందు, వాటిలోనొకటియైనచో ఎల్లప్పుడు పీడ కలుగును.**
అనగా –

"రవిభాత్సప్త నేష్టాని శుభాన్యే దశాష్టభాత్ ।
దశ శేషాన్యనిష్టాని సాభిజిత్ వృషవాస్తుని ॥

**వృషభవాస్తు చక్రము నందు సూర్యుదున్న నక్షత్రమునుండి అభిజిత్సహితముగా చంద్రనక్షత్రము (గృహారంభనక్షత్రము) వరకుక లెక్కింపగా మొదటి 7 నక్షత్రములు అశుభములు. 8వ నక్షత్రమునుండి 18వ నక్షత్రము వరకు గల 11 నక్షత్రములు శుభప్రదములు, తరువాత 10 నక్షత్రములు అశుభములు, మార్తాండ కారుననుసరించి సూర్య నక్షత్రమునుండి 4, 5, 6, 7, 15, 16, 17, 18, 23, 24, 25, 26, 27, నక్షత్రములు గృహారంభ గృహప్రవేశములకు అశుభములని తెలియుచున్నది. అన్య గ్రంథములందు గృహారంభమునకు వృషభవాస్తు, గృహప్రవేశమునకు కలశవాస్తు విచారణ చేయవలెనని చెప్పబడినది, కావున బహుసమ్మతమైనది యగు ముహూర్తచింతామణియందు చెప్పబడిన వృషభవాస్తును గ్రహించు టయే సమంజసము.**

**(ఏక వింశతిమహా దోషములు, జామిత్రదోషము, గండాంతదోషము, గురు శుక్ర, మౌఢ్యములు, వైధృతి, దగ్థతిథులు, దగ్ధనక్షత్రములు, మహాపాతాది**

**దోషము లందు గృహారంభము చేయకూడదు. చరలగ్నము, చరనవాంశ లగ్నము, ఆది, మంగళవారములు, నిషిద్ధములు.)**

శ్లో॥ కుంభేర్కే ఫాల్గుణే ప్రాగపరముఖగృహం శ్రావణే సింహ కర్క్యోః
పౌషే నక్రే చ యామ్యోత్తరముఖసదనం గోజగేర్కే చ రాధే ।
మార్గే జూకాలిగే సత్ ధ్రువమృదువరుణస్వాతి వస్వర్కపుష్యైః
సూతీగేహం త్వదిత్యాంహరిభ విధిభయోస్తత్ర శస్తః ప్రవేశః ॥

**రవి కుంభమునందుండుగా ఫాల్గుణమాసము నందును, సింహ కర్కాటకము లందుండగా శ్రావణమాసమునందు, తూర్పుపడమరలు ముఖము గల గృహమును నిర్మించవలెను. రవి మేష, వృషభము లందున్నపుడు వైశాఖ మాసమునందును, తులా వృశ్చికములందున్నపుడు ఆశ్వయుజ మాసమునందును. ఉత్తర దక్షిణములు. ముఖముగల గృహమును నిర్మించవలెను.**

**ధ్రువ, మృదు, నక్షత్రములందును, శతభిషము, స్వాతి, ధనిష్ఠ, హస్త, పుష్యమి నక్షత్రములందును, గృహారంభము చేయవలెను. సూతికాగృహమును పునర్వసు నక్షత్రమునందు నిర్మించుట, రోహిణి, శ్రవణమునందు ప్రవేశించుట శుభదాయకము.**

## ద్వార బంధము

"బ్రహ్మేందుశ్చార్య మాజ్యాదితికరయుగళం మారుతోమిత్రయుగ్మం
విష్ణోర్యుగ్మాంత్యయుగ్మం స్థిరభవతులాః కేంద్రణేషుసౌమ్యాః ।
పాపాస్త్ర్యాయారి భావేష్టమఖగరహితే స్థాపయేద్వారబంధం
శుక్రేజ్యేవాసగౌ చేచ్ఛుభమితికథితా ద్విస్వభావే కవాటమ్ ॥

**రోహిణి, మృగశిర, ఉత్తర, పుష్యమి, పునర్వసు, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, జ్యేష్ఠ, శ్రవణము, ధనిష్ఠ, రేవతి, అశ్విని, నక్షత్రములు ద్వార బంధమునకు యోగ్యములు, వృషభ, వృశ్చిక, సింహ, కుంభ, తులా లగ్నములు ప్రశస్తములు.**

**లగ్నమునకు 1, 4, 5, 7, 9, 10, స్థానములందు బుధ, గురు శుక్రులు, 3, 6, 11 స్థానములందు, పాపగ్రహములు, గురు, శుక్ర మౌఢ్యములు లేకుండగా ద్వారబంధ స్థాపనము చేయదగినది.**

**మిథున, కన్యా, ధను, ర్మీన లగ్నమునందు తలుపులు పెట్టించుట శుభకరము.**

## కూప ఖననము

"చిత్రా స్వాతీ పునర్వసూ మృగశిరో మూలాశ్వినీ రోహిణీ
హస్తః పుష్య ధనిష్టకం శతభిషక్ మిత్రోతరా రేవతీ ।
ఏతేషు శ్రవణాన్వితేషు మకరే లగ్నే చ కుంభే ఝుషే
వాపీ కూప జలాశయాదిఖననం శస్తం ప్రశస్తే దినే ॥

**చిత్త, స్వాతీ, పునర్వసు, మృగశిర, మూల, అశ్వని, రోహిణీ, హస్త, పుష్యమి, ధనిష్ఠ, శతభిషము, అనూరాధ, రేవతి, ఉత్తర, శ్రవణము, అను నక్షత్రములు వాపీ కూపాదులు త్రవ్వుటకు ప్రశస్తములు, మకర కుంభ మీనలగ్నములు ప్రశస్తములు శుభవారములు యోగ్యమైనవి.**

"సర్వతో యాచారంభః కర్తవ్యో విబలైః లగ్నైః ।
లగ్నస్థేజే ధివా జీవే లగ్నే భేద్దేస్థితే ఖగే ॥

**సర్వగ్రహములు బలరహితములై బుధ, గురు, చంద్రులు లగ్న మందుండగును. శుక్రుడు దశమమందుండగను, సర్వవిధముల జలాశయ ములను నిర్మించవలెను.**

**కర్కాటక, మకర, మీన లగ్నములందు పూర్ణ జలము; వృషభములందు అర్ధజలము, మిధున, తులలందు పాద జలము గల్గును.**

**కావున కర్కాటక, మకర, మీన లగ్నములు కూపారంభమునకు శ్రేష్ఠములు, లగ్న, ద్వితీయ, తృతీయ, చతుర్ధములందు పాపగ్రహములుండిన (కుజ, శని, రాహు, కేతువులు) పాషాణములుండును. ఎట్లన : లగ్నమునందు పాపగ్రహముండిన 9 అడుగులలో పలనే బండలుపడును. ద్వితీయయందు**

**పాపగ్రహముండిన 9 నుండి 18 అడుగుల లోపల బండలుపడును. తృతీయమందు పాపగ్రహముండిన 18 నుండి 27 అడుగుల లోపల బండలు పడును. చతుర్థమందు పాపగ్రహముండిన 27 నుండి 36 అడుగుల లోపల పాషాణములు పడును.**

"కేంద్రేషు తిష్ఠతశ్చంద్ర జీవౌయది శుభోదనం ।
చంద్రశుక్రయుతేకేంద్రే పర్వతేపి జలంవదేత్ ॥

**కేంద్రములందు గురుచంద్రులున్నయెడల మంచినీరుపడును. శుక్ర చంద్రులు కలిసి కేంద్రమున ఉండిన యెడల పర్వతమందైనను జలము పడును. కేంద్రమునందు బుధచంద్రులు కలసి ఉండిన ఉప్పునీళ్లు పడు ననియు, అవి కొద్దిరోజులకే ఇంకి పోవుననియు తెలియవలెను.**

## గృహ ప్రవేశములు

"అపూర్వ సంజ్ఞః ప్రథమః ప్రవేశో యాత్రావసానే తు సపూర్వసంజ్ఞః
ద్వంద్వాద్వాహ్వాయ స్త్వగ్ని భయాది జాత స్త్వేవంప్రవేశ స్త్రివిధః ప్రదిష్టః ॥

**అను వశిష్ఠోక్తి ననుసరించి అపూర్వప్రవేశము, సపూర్వప్రవేశము, ద్వంద్వ ప్రవేశము అని గృహప్రవేశము మూడు విధములుగా తెలియుచున్నది. నూతన గృహప్రవేశమును అపూర్వ గృహప్రవేశమందరు. యాత్రానివృత్త్య నంతరము చేయు గృహప్రవేశము సపూర్వగృహప్రవేశము. అగ్ని జలవాయు పిడుగు మొదలగువానివలన పడిపోయిన గృహమును పునరుద్ధరించి చేయు (జీర్ణగృహప్రవేశము) గృహప్రవేశమును ద్వంద్వప్రవేశమనియు అందురు.**

## గృహప్రవేశ మాసఫలములు

"ప్రవేశో మధ్యమో జ్ఞేయ, సౌమ్య కార్తిక మాసయోః ।
మాఘ ఫాల్గుణ వైశాఖ జ్యేష్ఠ మాసేషు శోభనాః ॥

**గృహప్రవేశమనకు మాఘ, ఫాల్గుణ, వైశాఖ, జ్యేష్ఠమాసములు శ్రేష్ఠ ములు. మార్గశిర కార్తీక మాసములు మధ్యమములు. ఇతర మాసములు అనగా చైత్ర, ఆషాఢ, శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజ, పుష్యమాసములు నిషిద్ధములు.**

**మాఘ మాసమున గృహప్రవేశమైన ధనలాభము, ఫాల్గుణమాసమున పుత్రధన లాభములు, చైత్రమున ధననాశము, వైశాఖమున ధనధాన్య లాభము, జ్యేష్ఠమాసమున పశులాభము, పుత్రలాభముగలుగును. మిగిలిన మాసములగు ఆషాఢ, శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజ, పుష్యమాసములందు గృహప్రవేశమైనయెడల హాని. శత్రుభయము గల్గును. శుక్లపక్షమున నిరంతర వృద్ధి, కృష్ణ పక్షమున దశమివరకు లాభదాయకము.**

"మృగాదిషడ్రాశిషు సంస్థితేఽర్కే నవప్రవేశః శుభదః సదైవ ।
కుంభం వినాన్యేష్వపి కేచిదూచు ర్నసౌరమిష్టం ఖలుసన్నివేశే ॥

**మకరాది 6 రాసులయందు సూర్యుడున్నపుడు (ఉత్తరాయణమందు) నూతన గృహప్రవేశము శుభదాయకము,** "అపిసౌమ్యాయనేకార్యం నవవేశ్మ ప్రవేశనం। ప్రాజ్ఞాయాత్రానివృత్తౌచేతి ॥ **అనునది నారదవచనము. అయిన కుంభమాసము గృహప్రవేశమునకు గర్హితమని కొందరియభిప్రాయము. (అనగా ఉత్తరాయణ కుంభేతర మాసములు శుభప్రదములు).**

**ఉపర్యుక్త వచనములందు చాంద్రసౌరమాస వైవిధ్యముండుటవలన శ్రీరామదైవజ్ఞుడు ముహూర్త చింతామణియందు స్పష్టముచేసెను.**

శ్లో॥ సౌమ్యాయనే జ్యేష్ఠతపోఽంత్యమాధవే
యాత్రానివృత్తౌ నృపతేర్న వేగృహే ।
స్యాద్వేశ నంద్వాఃస్థ మృదుధ్రువోడుభి
ర్జన్మర్క్షలగ్నో పచయోదయేస్థిరే ॥

**ఉత్తరాయణమునందును, జ్యేష్ఠ, మాఘ, ఫాల్గుణ వైశాఖ మాసములు శ్రేష్ఠములు. దిగ్ద్వార నక్షత్రములు ("యద్దిగ్ద్వారం మందిరం తస్యపుంసస్త ద్రగ్ఋక్షైః ప్రవేశసంస్యాత్" వశిష్ఠోక్తి) మృదునక్షత్రములగు మృగశిర, రేవతి, అనూరాధ, చిత్త, ధ్రువనక్షత్రములగు ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రోహిణీ, యోగ్యములు, జన్మరాశి, జన్మలగ్నములకు ఉపచయరాసులగు (3, 6, 10, 11వ రాసులు) లగ్నములు, స్థిరలగ్నము, అనగా వృషభ, సింహ, వృశ్చిక, కుంభలగ్నములు. అపూర్వప్రవేశమునకును యోగ్యములు.**

"కర్తుర్జన్మలగ్నే వా తాభ్యాముపచయేపి వా ।
ప్రవేశలగ్నే స్యాత్ వృద్ధిః అన్యభే శోక నిస్వనః ॥

నారదవచనము

"జీర్ణే గృహేఽగ్న్యాదిభయాన్నవేఽపి మార్గోర్జయోః శ్రావణికేపి సన్ స్యాత్।
వేశోంబుపే జ్యానిలవాసవేషు నావశ్య మస్తాది విచారణాత్రత ॥

**పురాతన గృహప్రవేశమనకు – లేక – అగ్ని, వాయు జలాదులచే పడిపోయిన గృహమును పునరుద్ధరణచేసి ప్రవేశముచేయుటకు మార్గశిర, కార్తీక, శ్రావణమాసములు కూడా యోగ్యములు.**

**శతభిషము, పుష్యమి, స్వాతి, ధనిష్ఠా, నక్షత్రములుకూడా ప్రశస్తములు. గురు, శుక్ర మౌఢ్య అవసరములేదు. కావున నూతనగృహప్రవేశమునకు సమయ శుద్ధి అత్యావశ్యకము అని సపూర్వ ద్వంద్వ గృహప్రవేశములకు సమయ శుద్ధి అనావశ్యకము. కేవలము పంచాంగశుద్ధి యున్నయెడల వాస్తుపూజచేసి గృహప్రవేశము చేయవచ్చును. ఇందుకు వశిష్ఠోక్తి**

"నవప్రవేశే త్వథ కాలశుద్ధి ర్నద్వంద్వ సౌపూర్వకయోః కదాచిత్ ।
ప్రవేశ పంచాంగ దినేషు లగ్నే వాస్త్వర్చనం పూర్వవదేవ కార్యమ్ ॥

నిత్యయానే గృహే జీర్ణే ప్రాశనే పరిధానకే ।
వధూప్రవేశే మాంగల్యేన మౌఢ్యం గురుశుక్రయోః ॥

**నిత్య ప్రయాణమునకు, జీర్ణగృహప్రవేశమునకు, (ద్వంద్వ ప్రవేశమునకు) అన్నప్రాశనకు, వస్త్రపరిధానమునకు, వధూప్రవేశమునకు, సామాన్య శుభ కార్యములకు, గురు శుక్రాస్తాది దోషవిచారణ అవసరములేదు.**

"గృహారంభోదితైర్మాసైర్ధిష్ణైర్వారైర్విశేద్గృహమ్ ।
విశేత్సౌమ్యాయనే హర్మ్యం తృణాగారే తు సర్వదా ॥

**గృహారంభమునకు చెప్పబడిన మాస, నక్షత్ర, వారములందు నూతన గృహప్రవేశము చేయవచ్చునని జ్యోతిః ప్రాకాశమునందు సామాన్య వచనముగా**

**చెప్పబడినది. తృణనిర్మితగృహమందైనను పైన చెప్పబడిన మాస, నక్షత్ర, వారాదులు విచారణచేయవలెను.**

"గురు శుక్ర బుధాఖ్యేషు వారేషు చ సుఖార్ధదమ్ ।
ప్రవేశే తు శనౌ స్థైర్యం కించిచ్చౌర్య భయం భవేత్ ॥

**పూర్వోక్తత్రివిధ గృహప్రవేశములకును, బుధ, గురు, శుక్రవారములు ప్రశస్తములుగను. సౌఖ్యధనప్రదములుగను చెప్పబడినవి. శనివారమున గృహప్రవేశము చేసిన స్థిరత్వము. కాని కొంచెము చోరభయముగల్గును. క్షీణేందువారము కలహప్రదమనియు. పూర్ణేందువారము సంపత్కరమనియు కాలామృతకారునిచే చెప్పబడినది.**

## గృహప్రవేశమునకు నక్షత్ర విచారణ

వరాహ వచనము–

"పౌష్ణే ధనిష్ఠాస్వధ వారుణేషు స్వాయందుభువర్షేషు త్రిషూత్తరేషు
ఆక్షీణ చంద్రే శుభవాసరే ద తిథావరిక్తే చ గృహప్రవేశః ॥

**రేవతి, ధనిష్ఠ, శతభిషము, రోహిణి, ఉత్తరాత్రయము, గృహప్రవేశమునకు ప్రశస్తములు.**

**శుక్ల పక్షము, శుభవాసరములు యోగ్యములు, రిక్తతిథులుతప్ప తక్కిన తిథులు యోగ్యములు.**

**మార్తాండకారు ననుసరించియు. జ్యోతిః ప్రకాశమునందు చెప్పబడిన ప్రకారమును, (గృహారంభోదితైర్మాసైఃదిష్ణైఃవారే విశేద్గృహమ్) నూతన గృహ ప్రవేశమునకు (అపూర్వ ప్రవేశమునకు) గృహారంభమునకు చెప్పబడిన నక్షత్రములు అనగా మృగశిర, రేవతి, చిత్త, అనూరాధ, స్వాతి, శతభిషము, హస్త, పుష్యమి, ధనిష్ఠ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రోహిణి యోగ్యములు. ఇందుకు శార్ఙ్గధరవచనము.**

"పుష్యే మైత్రే మృగే స్వాత్యాం ధ్రువే త్వాష్ట్రే పూషభే ।
వాసవే వరుణే శస్తం నవాలయ నివేశనమ్ ॥

**కాని కాలామృతమునందు – చిత్త, అనూరాధ, ధనిష్ఠ, ఉత్తరాత్రయము, రేవతి, శతభిషము, రోహిణి, మృగశిర, ఈ 10 నక్షత్రములు ప్రశస్తములనియు, పుష్యమి, మధ్యమ ఫలప్రదమనియు, పునర్వసు, స్వాతి, హస్త, అశ్విని, శ్రవణ నక్షత్రములందు గృహప్రవేశమైనయెడల గృహమన్యాక్రాంత మగు ననియు, చెప్పబడినది. కావున పైన చెప్పబడిన 10 నక్షత్రములు త్రివిధ గృహప్రవేశములకు ప్రశస్తములనియు, పుష్యమి, హస్త, పునర్వసు, స్వాతి, అశ్విని, శ్రవణము, మూల, నక్షత్రములు సపూర్వ ద్వంద్వప్రవేశములకు యోగ్యమనియు గ్రహించవలెను.**

"దివా ప్రవేశః శుభదః సపుత్ర పౌత్రాది వృద్ధ్య నిశి భాస్కరేంద్వోః।
బలేన మత్స్యద్వయ వాసరస్య రాత్రిం వినా సూర్య తిథిశ్చరాత్రమ్ ॥

**అను వశిష్ఠోక్తిననుసరించి రవి,చంద్రులు బలముగా నున్నపుడు రాత్రు లందుగూడ గృహప్రవేశము జేయదగును.**

## గృహారంభమునకు కలశచక్రశుద్ధి

శ్లో॥ వక్త్రే భూ రవి భాత్ప్రవేశ సమయే కుంభేఽగ్ని దాహః కృతాః
ప్రాచ్యాముద్వసనం కృతా యమగతా లాభః కృతాః పశ్చిమే।
శ్రీ ర్వేదాః కలరుత్తరే యుగమితా గర్భే వినాశో గుదే
రామాః స్థైర్యమతః స్థిరత్వమనలాః కంఠే భవేత్సర్వదా ॥

**సూర్యుదున్న నక్షత్రమును కలశముయొక్క శిరస్సునందుంచ వలెను. ఈ నక్షత్ర మందు గృహప్రవేశమైన యెడల అగ్నిదగ్ధమగును. తరువాత 4 నక్షత్రములను తూర్పు నందుంచవలెను. ఈ నక్షత్రములందు గృహప్రవేశమైన ఆ గృహము జన శూన్యము అగును. తరువాత 4 నక్షత్రము లను దక్షిణమున నుంచవలెను. ఈ నక్షత్రములందు గృహప్రవేశమైన యెడల లాభము గల్గును. తరువాత 4 నక్షత్రములను పశ్చిమముననుంచ వలెను. ఈ నక్షత్రములందు గృహప్రవేశ మయినయెడల ఐశ్వర్యము కలుగును. తరువాత 4 నక్షత్రములను ఉత్తరమందు ఉంచవలెను. ఈ నక్షత్ర ములందు గృహప్రవేశమైన కలహము నొసగును. తరువాత 4 నక్షత్ర ములను**

గర్భమందుంచవలెను. ఈ నక్షత్రము లందు గృహప్రవేశ మయినయెడల గర్భనాశనమగును. తరువాత 3 నక్షత్రములను గుదస్థాన మందుంచవలెను. ఈ నక్షత్రములు స్థిరత్వమునొసంగును. మిగిలిన 3 నక్షత్రములను కంఠము నందుంచవలెను. ఈ నక్షత్రములును స్థిరత్వము నొసంగును. అనగా సూర్యనక్షత్రము నుండి 5 నక్షత్రములు అశుభములు. తరువాత 8 నక్షత్రములు శుభప్రదములు. తరువాత 8 నక్షత్రములు అశుభ ప్రదములు, తరువాత 6 నక్షత్రములు శుభప్రదములు.

## కలశ చక్రము

| నక్షత్రములు | అంగవాసము | ఫలితము |
|---|---|---|
| 1 | ముఖము | అగ్నిదగ్ధము |
| 4 | తూర్పు | ఉద్వాసనము |
| 4 | దక్షిణము | లాభము |
| 4 | పశ్చిమము | సంపద |
| 4 | ఉత్తరము | కలహము |
| 4 | మధ్యభాగము | నాశము |
| 3 | అధోభాగము | శుభము |
| 3 | కంఠము | శుభము |

## గృహప్రవేశ వామరవి విచారణ

"వామోరవిర్మృత్యు సుతార్థలాభతో౽ ।
ర్కేపంచభే ప్రాగ్వదనాది మందిరే ॥"

అనుటవలన లగ్నమునకు మొదలు 5 రాసులందు అనగా అష్టమ, నవమ, దశమ, ఏకాదశ, ద్వాదశ స్థానములందు రవియున్న యెడల తూర్పు ముఖద్వారము గల గృహప్రవేశము చేయవలెను. పంచమ, షష్ఠ, సప్తమ, అష్టమ, నవమ స్థానము లందున్న యెడల దక్షిణముఖద్వారముగల గృహ ప్రవేశము చేయవలెను. ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ, స్థానము

**లందున్న యెడల పశ్చిమ ముఖద్వారముగల గృహప్రవేశము చేయవలెను. ఏకాదశ, ద్వాదశ, లగ్న, ద్వితీయ, తృతీయస్థానము లందున్న యెడల ఉత్తర ముఖ ద్వారముగల గృహప్రవేశము చేయవలెను. దీనిని వామరవి యందురు. ఇది అత్యంత శుభప్రదము.**

| తూర్పు | దక్షిణము | పశ్చిమము | ఉత్తరము |
|---|---|---|---|
| **8, 9, 10** | **5, 6, 7,** | **2, 3, 4,** | **11, 12, లగ్న** |
| **11, 12** | **8, 9** | **5, 6** | **2, 3** |

# గృహప్రవేశ లగ్నశుద్ధి

"చరేలగ్నే చరాంశస్థే ప్రవేశోనశుభావహః" **చరలగ్నములగు మేష, కర్కాటక, తులా, మకరములు చరసంజ్ఞకములు. ఇవి గృహప్రవేశమునకు శుభప్రదములు కావు.** "కన్యాకుంభ వృషాళిసింహ మిధునం శస్తాః" **కన్య, కుంభము, వృషభము, వృశ్చికము, సింహము, ఈ లగ్నములు ప్రశస్తములు.** "శుభాంశేన యుతే చోవచయస్థేతు దరేఽపిసన్" **జన్మరాశి జన్మలగ్నములకు 3, 6, 10, 11 వ రాసులు గృహప్రవేశ లగ్నమగుచో ఆ లగ్నము చరలగ్న మయినను శుభనవాంశయైన యెడల శుభప్రదము.**

"శుభైఃకేంద్ర త్రికోణాయ ద్విగైయత్రిషష్ఠగైః ॥
పాపైః శుద్దేష్టమే తుర్యేవిజనుర్భాష్టమేలగ్నే ॥

**గృహప్రవేశ లగ్నమునకు కేంద్రకోణములందును, ద్వితీయ, తృతీయ, ఏకాదశములందు శుభగ్రహములును, ఏకాదశ, తృతీయ, షష్ఠములందు పాపగ్రహములను ఉండుట శుభప్రదము మరియు చతుర్థ, అష్టమ శుద్ధి యుండవలెను. అనగా చతుర్థ, అష్టమస్థానములు గ్రహవర్జితమై యుండ వలెను.**

"శుభేభకూటకే గేహే విదాయాగ్నీద్విజన్మనః" **అనగా శుభరాశి కూటము నందు గృహప్రవేశము చేయవలెను.**

# వాస్తుపూజ - కాలము

**విశ్వకర్మ ప్రకాశికా -**

శ్లో॥ వాస్తుపూజాం ప్రకుర్వీత గృహారంభే, ప్రవేశనే ।
ద్వారాఽభివర్తనే చైవ త్రివిధే చ ప్రవేశనే ॥
ప్రతి వర్షం చ, యజ్ఞాఽదౌ, తథా చ మహోత్సవే ॥
జీర్ణోద్ధారే, తథా శల్యన్యస్తే చైవ విశేషతః ।
వజ్రాఽగ్నిదూషితే, భగ్నే, సర్ప, చందాడాల వేష్టితే ॥
ఉలూక వాసితే, సప్తరాత్రౌ కాకాఽధివాసితే ।
మృగాఽధివాసితే, గోఽశ్వ మార్జాలా దభినాదితే ॥
వారణాఽశ్వాఽ భిరుతే, స్త్రీణాం, యుద్ధాఽభి దూషితే ।
కపోతక గృహావాసే, మధూనాం నిలయ తథా ।
అన్యైశ్చైవ మహోత్పాతై ర్దూషితే శాంతి మాఽచరేత్ ॥

**తా॥ గృహారంభము, గృహప్రవేశము, ద్వారములు పెట్టుసమయము అపూర్వప్రవేశము, సపూర్వ ప్రవేశము, ద్వంద్వాభయ ప్రవేశము, సంవత్సరము మొదటినాడు, యజ్ఞము మొదలిడునపుడు, పుత్రజననము, ఉపనయనము, వ్రతబంధనము, పాణిగ్రహణము, మహోత్సవములు, జీర్ణోద్ధరణము, భూమిలో శల్యములు పైకి తీయునపుడు, ఇంటిపై పిడుగుపాటు, ఇల్లుకాలుట, ఇల్లు కూలుట, ఇంటియందు పాములు పుట్ట పెట్టుట, ఇంటిలో అయోగ్యులు ప్రవేశించుట, గుడ్లగూబ చేరుట, కాకి ప్రవేశించి ఏడుదినములు ఉండుట మృగములు ఇంటిలోనికి వచ్చుట, ఆవు, పిల్లి, కుక్క, ఏనుగు, గుఱ్ఱము మున్నగు జంతువులు (మనకు తెలియని కారణమున) భయంకరముగా అరచుట, బహిష్టు స్త్రీలు, పావురములు, తేనెతుట్టెలు కలిగి దూషితమయిన ఇంటియందునూ, ఇంకనూ అనేక ఇతర ఉత్పాతములు కలిగినపుడునూ, ఇంటియందు శాంతికల్గుటకు వాస్తుపురుషుని అర్చింపవలెను.**

# దేవాలయము

హైందవధర్మంలో ఆలయాలు విశిష్ఠ స్థానాన్ని ఆక్రమించాయి. అదేవిధంగా మన జీవన విధానంపై ఆలయాల ప్రభావం విస్తృతంగా ఉందనడంలో అతిశయోక్తి లేదు. అయితే మన దేవాలయాల నిర్మాణాన్ని, విగ్రహ ప్రతిష్ఠా పనను పరిశీలిస్తే మన దేహానికి, ఆదేవాలయానికి సారూప్యం ఉన్నట్లు అర్థమవుతుంది. ఆగమాల దృష్టిలో ఆలయం-భౌతికమైన శరీరంలో దేదీప్యమానమైన ఆత్మనెలకొని ఉన్నట్లు, ఆలయంలో కూడా భగవంతుడు కొలువు తీరి ఉంటాడు. "స్కంధోపనిషత్ లో దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవః సనాతనః" అంటే ఈ మానవశరీరమే దేవాలయం, ఈశరీరంలోని జీవుడే శాశ్వతము, సమున్నతము, సనాతనము అయిన భగవంతుడు అని అర్థం. మన ఆగమాల ప్రకారం భగవంతుడి విగ్రహాన్ని ప్రతిష్ఠించినప్రదేశాన్ని గర్భగృహం అని అందురు. అయితే **1.** గర్భాలయము, **2.** అంతరాళము, **3.** ముఖమండపము, **4.** మహామండపము, **5.** గరుడాలయము, **6.** ధ్వజ స్తంభము, **7.** బలిపీఠము, **8.** గాలిగోపురము, **9.** ప్రాకారము. ఇవి అన్నీ కలిపి పరిపూర్ణంగా ఉన్నదానిని ఆలయంగా పరిగణిస్తారు. దీనినే వాస్తు శాస్త్రంలో "ప్రాసాదం" అని కూడా అంటారు.

ప్రాసాదం పురుషమ్ మత్వా పూజయేత్ మంత్రవిత్తమహః
ఆలయంలో పూజలందుకునే మూలవిరాట్టుకు ప్రాణశక్తి, ఆరాధించే భక్తుడే, ఎంతభక్తి భావంతో పూజిస్తే ఆప్రతిమ అంత చైతన్య వంతమవుతుంది. అంటే ప్రాసాదం 'ఆలయం' పురుషప్రతీకగా పూజలు అందుకునే ప్రదేశం. ఇక్కడ 'పురుష' అంటే భగవంతుడు అని అర్థం. ప్రాసాదాల బాహ్యరూపం, ఆభగవంతుడి భౌతికరూపానికి, ఆలయంలోని విగ్రహం ఆయన జీవాత్మకి చిహ్నమన్న భావంతో..."గర్భగృహంతు దేవస్సశరీరం ఇతి స్మృతమ్ ప్రతిమ జీవ ఉచ్యతే" అని వేదాలు అంటున్నాయి.

"ఉపపీఠమ్ చరణాకరమ్ అధిష్ఠానమ్ జానుమండలమ్ సమాగమమ్
కుంభపంజర సంస్థానమ్ నాభి చ ఉదరసమాగమ్ పాదవర్గమ్ కరాకరమ్
ప్రస్థారమ్ భూమాలకమ్ తత్ కంఠమ్ గళమిత్యుక్తమ్
శిఖరమ్ ముఖమేవచ ఉస్నిసాంతమ్ శిఖచైవ మహానసిచ నాసిక
నేత్రానమ్ క్షుద్రనాస్యుచ విశ్వరూపమితి స్మృతమ్"

**తా॥ 1.ఆలయంలోని ఉపపీఠమ్ అంటే ప్రతిమకు ఆధారమయ్యే అలంకరణ ప్రాంతం ఆభగవంతుడి పాదానికి ప్రతీక. 2. ఆలయ అధిష్ఠానం ఆ దేవ దేవుడి ఊరువులు, మోకాళ్ళకు ప్రతిరూపం. 3. ఆలయ పాదవర్గం (గర్భ గృహాన్ని ఆవరించిన గోడలు) హస్తాలతో కూడి, తల, కాళ్ళు, మినహా యించిన ఆభగవంతుని శరీరానికి ప్రతీక. 4. గర్భగృహంలోని పాదవర్గంలో సర్వాలంకార శోభితమైన పూర్ణకుంభం ఆభగవానుని ఉదరానికి, నాభికి ప్రతీక. 5. పాద వర్గాన్ని ఆవరించిన ప్రస్తారం (అంతర్భాగ గోడల మూలలు) భగవంతుని బాహువులకు చిహ్నాలు. 6. ఆలయ శిఖర కింద భాగం (కంఠం) సాక్షాత్తు ఆభగవంతుని కంఠంతో సమానం. 7. ఆలయం పైనున్న విమాన శిఖరం సంపూర్ణంగా ఆభగవానుని ముఖానికి, శిరస్సునకు ప్రతీక. ఇది నిలబడిన భగవంతుని రూపంలో ఉంటుంది.**

గర్భగృహ శిరః ప్రోక్తం అంతరాళం గళం తథా
మండపంచ ముఖే బాహుకుసిస్థాన మండపమ్
పాదాస్యాంగుళ్య ప్రోక్తః స్థూపయస్థ
"శిఖరం శిరమిత్యాహుః గర్భగేహం గళంతథా
మంటపం కుక్షి రిత్యాహుః ప్రాకారం జాను జంఘయోః
గోపురం పాద మిత్యాహుః ధ్వజో జీవ సముచ్యతే"

**తా॥ శిఖరము శిరస్సు, గర్భగృహము కంఠము, మంటపం ఛాతీకి, మహా మంటపం ఉదరమునకు ప్రతీక, ప్రాకారము చేతులు, కాళ్ళకు ప్రతీక, గాలిగోపురము పాదములకు ప్రతీక, గర్భ గృహమే శిరస్సు, అంతరాళము కంఠము అని పాఠాంతరం, ఇది పరుండిన పురుష (దేవుని) స్వరూపం.**

"భక్తుడు ఆలయంలోనికి గోపురం ద్వారా అడుగు పెట్టిన మరుక్షణమే, తాను భౌతికమైన, అశాశ్వతమైన శరీరాన్ని కానని, తనలో అమరమైన, శాశ్వతమైన ఆత్మ దాగి ఉందని తెలుసుకోవటమే ప్రధానలక్ష్యం. తద్వారా మానవ జన్మకు సార్ధకత లభించుతుంది."

ఈ దేవాలయాలు మానవ నివాస స్థావరాలకు సంబంధించిన విధి విధానాలను నిర్ధేశించినాయి, మానవుడి ఆధ్యాత్మిక, ధార్మిక, సామరస్య, ప్రశాంత జీవనానికి, సాంఘిక ఎదుగుదలకు దోహదకారిగా నిలిచాయి. ఎందరో యోగులు, సాధువులు, మహర్షులు, సాంఘిక సంస్కర్తలకు, సాధారణ ప్రజాసమూహాలకు మార్గదర్శకత్వంగా నిలిచి, సనాతన ధర్మాన్ని, ధార్మిక వారసత్వాన్ని వదిలి పతనావస్థలోనికి పోకుండా నేటికీ కాపాడుతునే ఉన్నాయి.

---

దేవాలయ వాస్తు, గృహవాస్తు, దేవాలయ ప్రతిష్ఠాది విషయములకు, గృహదోష నివారణములకు వాస్తు యంత్రములు, నరదృష్టి శాంతి యంత్రములు, మత్స్య యంత్రములు, వ్యాపార అభివృద్ధికి కుబేర లక్ష్మీ యంత్రములకు, జాతక ముహూర్త శుభకార్యములకు, నవగ్రహ దోష పరిహారములకు సంప్రదించగలరు.

**ముత్తేవి శ్రీనివాస శశికాంత్**, స్థానాచార్య, సిద్ధాంతి
శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానం బచ్చుపేట, మచిలీపట్నం.
సెల్ : **9440440312**

మూలవిరాట్టు- ఆలయస్వరూప సారూప్యాలు

మూలవిరాట్టు- ఆలయస్వరూప సారూప్యాలు



ద్రావిడ ఆలయ విమానం

ఆసీనుడైన శివుడి విగ్రహం




భగవంతుడి శయన ఆసనం- దేవాలయం సారూప్యలక్షణాలు




భగవంతుడి శయన ఆసనానికి, ఆలయనిర్మాణ ప్రణాళికకు పోలిక

# దేవాలయ నిర్మాణ ఫలము

ప్రకీర్ణం– సప్తజన్మకృతం పాపమల్పంవా యదివా బహు
విష్ణోరాలయ విన్యాసప్రారంభా దేవనశ్యతి
ప్రశస్తదేశే భూభాగే యోనరో భవనం హరేః
కారయత్యక్షయాన్ లోకాన్ స నరః ప్రతిపద్యతే
ఇష్టకాచయ విన్యాసో యావద్వర్షాణి తిష్టతి
తావద్వర్ష సహస్రాణి తత్కర్తా దివిమోదతే

శ్లో॥ దేవా గారం కరో మీతి సంకల్పా దేవ కారణాత్ ।
సద్యః కాయ గతం పాపం నశ్యే జ్జన్మ శతార్జితమ్ ॥
ఆరభ్య మందిరం మర్త్యో న సామాన్య మృతో యది ।
సమాప్త స్యాపి గేహస్య ఫలం పూర్ణం సమశ్నుతే ॥

తస్మా ద్విత్తాను సారేణ కుర్యా ద్విష్ణ్వాలయం ప్రభుః ।
యావే దిష్టకయా ధామ తాచ్చతో వత్సరాన్ బహూన్ ॥

కర్తా వసతి భూయోపి నాక పృష్ఠే సు సంస్కృతః । శ్రీపాద్మే

**తా॥ యజమాని విష్ణు దేవాలయ నిర్మాణము ప్రారంభించిన యెడల సప్తజన్మలలో చేసిన పాపము నశించును. దేవాలయ నిర్మాణ సంకల్ప మాత్రముచేతనే నూరుజన్మల నుండి చేసిన పాపము వెంటనే తప్పక నశించును.**

**దేవమందిరము ఆరంభించిన యజమాని ఆది పూర్తిచేయకమునుపే మరణించిననూ, ఆ యజమానికి దేవాలయమును సంపూర్ణముగ నిర్మించిన ఉత్తమ ఫలము పరిపూర్ణముగా లభించును ! కనుక యజమాని తన వద్ద వుండిన ధనమును అనుసరించి సకల దేవతా ప్రభువగు శ్రీమన్నారాయణుని ఆలయమును నిర్మింపవలెను !**

**ఎన్ని ఇటుకల (ఎన్ని రాళ్ళ)తో ఆలయ నిర్మాణమును యజమాని పూర్తి చేయునో? అన్ని (దేవ) వత్సరములు దేవలోకమున దేవతలచే పూజింప బడుచూ వుండును.**

# అంగుళమానము భేదములు

**అథ విమానబేరాది మాన విభాగార్థ మంగుల సంజ్ఞాం వక్షే-మరీచి**

మానాంగులం మాత్రాంగులం దేహలబ్ధాంగుల మితి త్రివిధం భవతి. దినే ఋదిత్యరశ్మౌ జాలకాంతః ప్రవిష్టే తద్గోచరా అత్యంతక్షుణ్ణా లవా అణవః ప్రోక్తా స్తేష్వేవం (తఏవ) పరమాణవః పరమాణుభిరష్టాభిరథరేణు రథరేణ్వష్టగుణితం రోమాగ్రం రోమాగ్రాదష్టగుణితం లేఖ్యా లేఖ్యాష్టగుణితం యూకం యూకాష్టగుణితం యవం యవాష్టగుణితం మానాంగులముత్తమం తదష్టాంశోనం మధ్యమం తత్తురీయాంశమధమం.

**తా॥ అంగుళము, మూడు విధములుగా వున్నది. 1. మానాంగుళము. 2. మాత్రాంగుళము. 3. దేహలబ్ధాంగుళము అను పేరులతో తెలుపబడినవి. వరుసగా వాని భేధములు తెలుపబడుచున్నవి.**

**కిటికీల నుండియు, పూరిళ్లూ - పెంకుటిళ్లూ మున్నగు వాటి కప్పు సరిగా లేనందువలన ఆ రంధ్రముల నుండియు సూర్యకిరణ జాలము సన్నని వెలుగు గొట్టము వలె ఋజు మార్గమున ఇంటిలోనికి ప్రవేశించు సమయమున బాగుగా తేరిపార చూచినచో సూక్ష్మాతి సూక్ష్మముగు ధూళి రేణువులు తేలియాడు చుండుట కనుపించును. ఆ రేణువులే పరమాణువులు!**

| | |
|---|---|
| **8 పరమాణువులు** | **= 1 అణురేణువు** |
| **8 అణురేణువులు** | **= 1 రోమాగ్రం** |
| **8 రోమాగ్రములు** | **= 1 యూక** |
| **8 యూకలు** | **= 1 యవ** |
| **8 యవలు** | **= 1 అంగుళము** |
| **8 యవల నిలుపు కొలత కలిగినది** | **= ఉత్తమ మానాంగుళము** |
| **7 యవల నిలుపు కొలత కలిగినది** | **= మధ్యమ మానాంగుళము** |
| **6 యవల నిలుపు కొలత కలిగినది** | **= అధమ మానాంగుళము** |

**3 శాలి (ఎర్రరాజనాల) గింజలు నిలువుగా బెట్టి కొలిచిన, ఎంత పొడవు వుండునో ఆకొలతకు మాత్రాంగుళమని పేరు !**

**దేహలబ్ధాంగుళము = (1) ఆచార్యుని (సమమైన మానవుని) నడిమి వ్రేలు నడిమి కణుపు కొలత ! దీనిని విగ్రహములు, వాని అంగములు విగ్రహ విభాగములను మున్నగువానిని నిర్మించుటకు (ఈ కొలతను) ఉపయోగింపవలయును. గ్రామములనూ, మానవ గృహములనూ నిర్మించుటకు మానాంగుళమును మాత్రమే ముఖ్యముగా స్వీకరింపవలెను.**

## దేవాలయ ప్రతిష్ఠా ప్రదేశములు

**మరీచి :-** వనే నద్యద్రి సముద్ర పార్శ్వే అన్యత్ర తటాకారామ సమీపే వివిక్తే దేశే

**తా- అరణ్యము, నదీతీరము, పర్వతశిఖరము, సముద్రతీరము, తటాకతీరము, ఉద్యానవనములు, శుభక్షేత్రములలో ఆలయ నిర్మాణము చేయవలయును**

## గ్రామములలో ఆలయస్థానము

**మరీచి:- గ్రామాన్ని 64, 81, 256 పదములుగా విభజించి ఈశాన పర్జన్యాదిదేవతలకు స్థానము కల్పించి ఈశానపదంలో శంకరుని, వరుణపదంలో విష్ణువుని, ఆదిత్యపదంలో భాస్కరుని, యమపదంలో వింధ్యవాసినిని, భృశపదంలో విఘ్నేశుని, సుగ్రీవపదంలో షణ్ముఖుని, అదితి పదంలో మాతృకోష్టను, జయంత లేక దౌవారిక పదంలో కృష్ణుని, పుష్పదన్త లేక శోషణపదంలో రాముని, మహేంద్రపదంలో మత్స్యమూర్తిని, సత్య పదంలో కూర్మమూర్తిని, నైఋతి పదంలో వరాహమూర్తిని, జవన లేక అంతరిక్షపదంలో నారసింహుని, నాగపదంలో వామనమూర్తిని, గంధర్వ పదంలో బలభద్రుని, ముఖ్యపదంలో పరశురాముని, సూరిదేవపదంలో కల్కిమూర్తిని, సోమపదంలో శయనమూర్తిని, గ్రహక్షతపదంలో దైవిక వాసుదేవుని, వితథపదంలో మానుషవాసుదేవుని, ఉష్ణాంశుపదంలో ఆదిమూర్తిని, భృంగరాజపదం లేక గ్రామ మధ్యమునందు పంచవీరుల యొక్క 1.వాసుదేవ 2.సంకర్షణ 3.ప్రద్యుమ్న 4.సాంబ 5.అనిరుద్ధులకు ఆయాస్థానములు ఉపయోగించవలెను.**

శ్లో॥ మంత్రహీనౌ క్రియాహీనౌ హవ్య కవ్యాది కర్మసు
ప్రాయశ్చిత్తం భవేత్తస్య గ్రామ మధ్యార్చనం హరే॥

**తా॥ గ్రామ మధ్య స్థానమున శ్రీమన్నారాయణుని మందిరము నిర్మించినచో – ఆ గ్రామమునందలి జనులు చేయు మంత్రలోప, క్రియా లోపములునూ, దేవతల ప్రీతికై చేయు యజ్ఞములునూ, పితృదేవతల కొరకు చేయు అపర కర్మలునూ, వానియందు జరుగు (తెలిసిజరిగి నట్టివియునూ తెలియక జరిగినట్టివియునూ) సమస్త దోషములు నశించి, ఉత్తమ దివ్యఫలమును పొందుదురు !**

ప్రకీర్ణం– గ్రామమధ్యే ధ్రువార్చాయాం స్థాపయేద్భోగమేవతు.

**తా॥ గ్రామ మధ్యమున ధ్రువార్చామూర్తిని స్థాపించిన సర్వ భోగభాగ్యములు కలుగును.**

శ్లో॥ ఆర్యాదిషు చతుర్ దిక్షుః గ్రామస్యాది చతుర్ దిశః ।
ఏవం యథేష్ట దిగ్దేశే విష్ణు ధిష్ణ్యం ప్రకల్పయేత్ ॥

**తా॥ తూర్పు – దక్షిణ – పడమర – ఉత్తరము అనబడు నాలుగు దిక్కుల యందునూ (అనగా ఆ నాలుగు దిశాముఖములగు సింహద్వారముల తోడనూ) గ్రామమునకు వెలుపల నాలుగు దిక్కుల యందునూ, గ్రామ మధ్యముననూ యజమాని కోరిక చొప్పున విష్ణువు యొక్క ఆలయమును నిర్మింప వచ్చును ! (మాన సారః)**

ఐంద్రేచ శ్రీపదం ప్రోక్తం ఆగ్నేయాం భయం భవేత్
దక్షిణేగ్రామనాశాయ నైఋత్యాం పుత్రనాశనం
పశ్చిమే శతృవృద్ధిశ్చ వాయవ్యాం ధర్మనాశనం
ఉత్తరే ధనసంపత్తిః ఐశాన్యా సర్వసంపదః **(భృగు)**

గ్రామమధ్యేచ దేవానాం రాజారాష్ట్రాభి వృద్ధిదం, రాజారాష్ట్రాభి వృద్ధ్యాచ దైవ సంతుష్టి రేవచ, దైవసంతుష్టి సంపూర్ణాత్, యజమానస్య వృద్ధిచ.

**తా॥ గ్రామ మధ్యమున దేవాలయమును నిర్మించిన యెడల పరిపాలనా అధికారులు, రాష్ట్రము, రాష్ట్ర ప్రజలు అభివృద్ధి చెందుదురు, దైవము**

**సంపూర్ణముగా సంతృప్తి పొందును. ఆలయ నిర్మాణము చేసిన యజమాని వృద్ధిని పొందుతాడు.**

## ఆలయ ద్వార దిశలు - ఫలము

శ్లో॥ ప్రాగ్ద్వారముత్తమోత్తమం పశ్చిమద్వారముత్తమం ।
దక్షిణద్వారమధ్యమం ఉత్తరద్వార మధమం ॥ **మరీచి.**

**తా॥ తూర్పు సింహద్వారము ఉత్తమోత్తమము, పశ్చిమ ద్వారము ఉత్తమము, దక్షిణద్వారము మధ్యమము, ఉత్తరద్వారము అధమము.**

శ్లో॥ ద్వారం వాతాయనం వాపి భిత్తిబంధం సజాతుచిత్
కులక్షయో వినాశశ్చ వ్యాధివాన్ భిత్తి బంధనే॥

**తా॥ ఆలయమునందలి గర్భగృహమునకు ఒకే ద్వారము ఉండవలెను. మరియొక ద్వారముగానీ గవాక్షములు గాని పెట్టిన యెడల వంశనాశనము, ధన, ధాన్య, సుఖ, సంతోష, భోగ, భాగ్య, సంపదలు నిర్మూలనమగును, వ్యాధులు కలుగును.**

పృష్ఠపార్శ్వయోర్ నాద్వారాణి – **గర్భాలయమునకు వెనుక భాగమునందు ప్రక్క భాగములయందు ద్వారములు గాని జాలకములు గాని ఉండరాదు.**

శ్లో॥ నీచే దుఃఖం భవేన్నిత్య ముచ్ఛ్రితే ద్రవ్యనాశనమ్ ।
స్థాన భ్రంశకరం ద్వారే భవత్యేవ న సంశయః ॥
తస్మా ద్యత్నేన కర్తవ్యం సుగుప్తం భిత్తి మధ్యతః । శ్రీపాద్మే

**తా॥ భగవదాలయ ద్వారమును సరియైన ఎత్తులోనే ఏర్పరచవలెను. ఉండవలసిన ఎత్తుకంటె తక్కువ వుండినచో నిత్యమూ దుఃఖమును అనుభవించెదరు. మిక్కిలి ఎత్తుపై పెట్టినచో సంపదలు నశించును ! ఈ బాధలు కలుగుకుండా ఆలయ నిర్మాత దేవాలయ ద్వారమును స్థానభ్రంశము కలుగనీయక సరియగు తావున, గోడకు నడిమి భాగమునందు, గర్భాలయ ద్వారమును ఏర్పడునట్లు నిర్మాణము చేయింపవలెను !**

## దారు, శిలా సంగ్రహణ కాలము

**భృగు–** సర్వారంభే ప్రశస్తంస్యా దాదిత్యేచోత్తరేస్థితే
అప్రశస్త మితిఖ్యాత మయనే దక్షిణేతథా
పుష్యమాసాది షాణ్మాసా దేవానాన్తు దివాస్మృతాః
యస్మిన్ మాసే కృతంసర్వం వివృద్యర్థమితిస్మృతమ్
రాత్రిరాషాడమాసాది రయుక్తస్సర్వకర్మసు॥ **ప్రకీర్ణం॥**

**తా॥ కర్షణాది ప్రతిష్ఠాంతం దారు సంగ్రహముతో సహా అన్ని కర్మల యందునూ ఉత్తరాయణము ప్రశస్తము. పుష్యమాసాది ఆరు మాసములు దేవతలకు పగటి కాలము ఆ మాసములలో చేసిన కార్యములు వృద్ధిచెందును ఆషాఢ మాసాది మాసములు అన్నికర్మలయందు వర్జించుట శ్రేయస్కరము.**

శ్లో॥ కార్తికాధ్యష్ఠ మాసేషు, ప్రశస్తో దారు సంగ్రహః ।
ప్రశస్తం సర్వ మాసేషు శిలా సంగ్రహణం మతమ్ ॥ పాద్మే

**తా॥ కార్తిక, మార్గశీర్ష, పుష్య, మాఘ, ఫాల్గుణ, చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ మాసముల యందు కొయ్యను ఆలయ నిర్మాణము కొఱకు సేకరింప వచ్చును. చైత్రము మొదలు, ఫాల్గుణమాస పర్యంతము (అన్ని మాసముల యందునూ) కొండ రాళ్ళను ఆలయము నిమిత్తము తెచ్చుకొన వచ్చును !**

## మూల బేర ప్రమాణము

**మరీచి–** గర్భాగారస్య చతుర్భాగం త్రిభాగం ద్విభాగశరాంశాద్గుణాంశం గర్భార్ధం పూర్వవత్కుర్యాత్పాధోత్సేధం ద్వారోత్సేధం వా తత్పాదాధికం పాదహీనమర్ధంవా నవాంశోన మష్టాంశోనంవా అధిష్ఠానస్య పాదమర్ధం త్రిపాద సమం సపాదాదిక మర్ధాధికం పాదోన ద్విగుణంవా హస్తమానేన గుణశరహస్త(ం) మానాంగులేన పంచవింశత్యంగులాద్యేక చత్వారింశ ద్యంగులాన్తం ద్వ్యంగుల వివృధ్యాంగులిభేదం నవధాభవతి. యజమాన సమం తదష్టాంశం కృత్వైకద్విచతురంశాధికం నేత్రాబాహుస్తనాన్త మిత్యేవం నవధా భవత్యేతేష్విష్టిమానం వినిశ్చిత్య పాదాదుష్ణీషాన్తం ధ్రువబేరం కారయేత్.

తా॥ గర్భాలయమును నాలుగు భాగములు చేసి అందు ఒకభాగమునూ, మూడుభాగములు చేసి అందు ఒకభాగమునూ, గర్భములో సగము గానూ, ద్వారమును అనుసరించి యునూ, అధిష్టానమును అనుసరించి యునూ, యజమానిని అనుసరించి యజమాని సమముగానీ, యజమాన ఉన్నతమును **8** భాగాలు చేసి **1, 2, 4,** అంశముల అధికముగానీ, నేత్ర, బాహు, స్తనాన్తముల సమముగానీ ధృవబేర ఉన్నతము పాదాది ఉష్ణీషాన్తము ఉండవలయును

## శిల్పదర్శనములో మూల బేర ప్రమాణములు

1. గర్భగృహం మానసూత్ర ప్రమాణమును అనుసరించి.
2. గర్భగృహం లోపలి కొలతలను అనుసరించి.
3. గర్భగృహ కట్టడంలో గోడ ఎత్తును అనుసరించి.
4. అధిష్టానం ఎత్తును అనుసరించి.
5. శుద్ధద్వారం ఎత్తును అనుసరించి.
6. కర్తయొక్క ఎత్తుననుసరించి.

గర్భగృహం స్తంభ బాహ్య విస్తారమును నాలుగు భాగాలు చేసి దానిలో రెండు భాగాలు తీసుకుని ఆకొలతతో విగ్రహము చేస్తే అది ఉత్తమము. గర్భగృహము లోపలి వెడల్పును **10** భాగాలు చేసి దానిలో **7** భాగముల ఎత్తుతో విగ్రహము నిర్మించిన అది ఉత్తమము. పడుకున్న విగ్రహమును అయితే గర్భగృహం లోపలివెడల్పును **16** భాగాలు చేసి తలప్రక్క నాలుగు భాగాలు, కాళ్ళ ప్రక్కన రెండు భాగాలు విడిచి మిగిలిన **10** భాగాలకొలతతో చేసినది ఉత్తమము. నిలబడిన విగ్రహం ద్వారం ఎత్తుకు సమానంగా ఉన్న విగ్రహం ఉత్తమోత్తమమని, **3/4** ఎత్తుఉన్నది ఉత్తమమని, అర్ధభాగం ఎత్తు ఉన్నది మధ్యమమని, పావుభాగము ఎత్తుఉన్నది అధమమని చెప్పారు. ఇలా అనేక ప్రమాణములు ఉన్నవి.

# విగ్రహ భేదములు

**మరీచి**–ఏతచ్చిత్రం చిత్రార్ధం చిత్రభాసమితి త్రిధాభవత్యుత్తమం బేరే చిత్రేర్చనమైహికాముష్మిక ఫలప్రదం, అర్ధచిత్రార్చనం కేవల మాముష్మి కప్రదం

**తా॥ విగ్రహాలు మూడు విధములు అవి 1. (పూర్ణ) చిత్రము 2. అర్థచిత్రము 3. చిత్రాభాసము : అనునవి.**

**(1) చిత్రము అని గానీ, పూర్ణ చిత్రము అనిగానీ చెప్పబడు విగ్రహము ముందును, వెనుకనూ సర్వ అవయవములు సంపూర్ణముగా, స్ఫుటముగా అందముగా కనుపించుదానిని పూర్ణచిత్రమని పిలుతురు !**

**(2) అర్థచిత్రము అనగా – ముందు భాగము మాత్రమే విగ్రహమునకు సర్వావయవ సౌందర్యముగ వుండి, వెనుక భాగము చదునుగా వుండు దానికి అర్థచిత్రము అని పేరు !**

**(3) చిత్రాఽభాసము అనగా విగ్రహము ఏమియును లేక గోడపైన తెలుపు, ఎఱుపు, పసుపు, పచ్చ, నలుపు మున్నగు వర్ణములతోగానీ, లేక శిలలయందే కొన్ని దైవచిహ్నములు కొంత స్పష్టముగానూ, కొంత అస్పష్టముగానూ కనుపించుదానిని చిత్రాఽభాసము అందురు !**

**యజమాని – భక్తి – శక్తిని అనుసరించి చిత్రమును ఆరాధించిన ఐహిక, ఆముష్మిక ఫలములు కలుగును, అర్ధచిత్రము వలన ఆముష్మిక ఫలము కలుగును, చిత్రాభాసమును ప్రతిష్ఠించరాదు.**

**శిల్ప విగ్రహములు అవయవములు భిన్నములైనచో వాటిని సంధించుటకు వీలుకలిగిన, సంధించి అర్చింప వచ్చును. సంధింప వీలులేనిచో నూతన విగ్రహ నిర్మాణము గావించి, భిన్నమైన దానిని పూజించి అలంకరించి మంగళ వాద్యములతో వేద ఘోషలతో ఊరేగించి, జీవనదుల యందు నిమజ్జనము చేయుట శ్రేయస్కరము!**

**నూతనముగా తెచ్చిన శిలా విగ్రహమును సకల యజ్ఞ క్రియలతో రాజా - రాష్ట్రముల, సర్వలోకముల, అభ్యుదయము కొరకు పునః ప్రతిష్ట చేయింపవలెను.**

**లోహ విగ్రహములు భిన్నములైన మరల కరిగించి నూతన విగ్రహములను చేయించి ప్రతిష్ఠింపవచ్చును.**

**జీర్ణ దేవాలయములను 'యథా పూర్వం ప్రకల్పయత్' అను ఆగమ (వేద) వచనము ప్రకారము వెనుకటి వాటి కొలతల ప్రకారము, రూపముల ప్రకారము, దిశల ప్రకారము ప్రమాణ పూర్వకముగా (విధిగా) కల్పింప వలయును.**

## ఆలయ నిర్మాణ ద్రవ్య భేదములు - వాని ఫలము

శ్లో॥ ముఖ్యంశిలా మయం గేహం మధ్యమం చేష్టకాదికమ్
జఘన్యం దారుజం విద్యాద్ మృణ్మయం హేయ ముచ్యతే ॥శ్రీ పాద్మే

**తా॥ 1. ఆలయము శిలలతో నిర్మించినచో = శ్రేష్ఠఫలము**
**2. ఇటుకలతో నిర్మించినచో = మధ్యమ ఫలము**
**3. కొయ్యతో నిర్మించినచో = అధమ ఫలము**
**4. మట్టితో నిర్మించినచో = అధమాధమఫలము.**

**1. ఆలయములు శిలలతో నిర్మించుటవలన అగ్ని, వాయు, జలములచే త్వరగా శిథిలము కావు ! అందువలననే వేలవేల సంవత్సరాల నుండియునూ నేటి వరకూ నిలిచియుండి యున్నవి ! కావున ఇది సర్వ శ్రేష్ఠమైనది !**

**2. ఇటుకలతో నిర్మించినచో - ఉప్పుచవుడు వలన వాతావరణ మార్పుల వలన, ఎలుకలు - పందికొక్కుల వలన, దొంగలవలన, కొద్ది కాలమునకు శిథిల స్థితికి చేరుట తథ్యము ! అందుచే ఇది మధ్యమము !**

**3. కొయ్యతో నిర్మించినచో - అగ్ని వలన, చెదపురుగువలన, కొయ్య ఊలిపోవుట వలన, శిథిలమగును ! ఇది అధమము**

**4. మట్టితో మాత్రమే నిర్మించినచో - ఎలుకలు, పందికొక్కులు, చెదలు, వర్షము, గాలితాకుడు, ఉప్పుచవుడు, చోరులు, మృగములు (పశువులు) రాచుకొనుట వలన ఆలయ సమీపమునందు గోతులు త్రవ్వుట వలన అతి శీఘ్రముగా శిథిలమగును - కావున ఇది అధమాధమము !**

## విగ్రహ నిర్మాణ ద్రవ్య భేదములు

**మరీచి**-అథబేరం తామ్రజం శైలం దారవంవా విధీయతే దారవాన్మృణ్మయం శ్రేష్ఠం, మృణ్మయాచ్ఛైలముత్తమం శైలత్తామ్రజం ముఖ్యంభవతి ధ్రువార్చా చేత్తామ్రజం శైలంవా కుర్యాత్.

**తా॥ విగ్రహమును రాగి(లోహము)తోను, శిలతోను, కఱ్ఱ(చెక్క)తోను, మట్టితోను తయారు చేయవచ్చును, కఱ్ఱకన్నా మట్టి విగ్రహము, మట్టికన్నా శిలావిగ్రహము, శిలకన్నా తామ్ర (రాగి, వెండి, బంగారం, ఇత్తడి, కంచుకలసిన) విగ్రహములు ఒకదానికన్నా ఒకటి శ్రేష్టమైనవి. వీనిలో శైలం, తామ్రం ప్రశస్తము.**

## శంకువు - స్థాపన

అథోర్ధ్వం ప్రథమశిలేష్టకాన్యాస విధిర్మాసేషు ఫాల్గున చైత్ర వైశాఖ తైష్య జేష్ఠేషూత్తమం శ్రావణాషాఢ కార్తికాశ్వయుజేషు మధ్యమం శేషేష్వధమం పూర్వపక్షే కృష్ణపక్షే అన్త్యం త్రిభాగం హిత్వా శ్రవణరోహిణ్యుత్తరహస్తస్వాతి పునర్వసు వారుణమైత్రేష్వేకస్మిన్ యజమానానుకూలే నక్షత్రే స్థిరరాశా వనిందితే చారభేత. **(మరీచి)**

**తా॥ ఆలయ శంకు స్థాపన ఫాల్గుణ, చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, పుష్యమాసములు ఉత్తమము, శ్రావణ, ఆషాఢ, కార్తీక, ఆశ్వీయుజ, మాసములు మధ్యమము, మిగిలినవి అథమము, శుక్లపక్షమునందు, శ్రవణం, రోహిణీ, ఉత్తర, హస్త, స్వాతి, పునర్వసు, శతభిషం, అనూరాధ, నక్షత్రములయందు, యజమాని అనుకూల నక్షత్రములయందు, స్థిరరాశియందు ఆరంభించవలయును.**

జలాన్తంవా శిలాన్తంవా ఖనిత్వా శల్యానపోహ్య వాలుకాభిరాపూర్య

హస్తిపాదేన ధృడంకృత్వా సప్తాహేతీతే తత్ఖాతం పంచధాకృత్వా త్రిభాగావసానే చోత్తమం ద్విభాగావసానే మధ్యమమేక భాగావసానే చాధమం తస్మిన్ శిలాంవా ఆధ్యేష్టకాంవా విన్యసే త్తయోర్లక్షణం. **(మరీచి)**

**తా॥ శంకుస్థాపన చేయవలసిన ప్రదేశమును జలము కన్పించు వరకుగానీ, శిల కన్పించు వరకుగానీ, త్రవ్వి శల్యములను తీసి క్రొత్త ఇసుకతో పూడ్చి ధృడము చెయ్యవలయును. ఏడురోజుల తర్వాత త్రవ్వబడిన గుంటను 5 భాగములు చేసి అందు 3వ భాగములో శిలాన్యాసము చేయుట ఉత్తమము, 2వ భాగంలో చేయుట మధ్యమము, 1వ భాగములో చేయుట అధమము.**

ఆచార్యః యజమానశ్చ స్థపతినా సార్ధం విమానం నిత్యసూత్రం ప్రసార్య ద్వారం విదిత్వా అభ్యన్తర ద్వారదక్షిణే యమద్వయం హిత్వా భిత్తిమధ్యే చతురశ్రముపలిప్య నవభాగం విభజ్య. **(మరీచి)**

**తా॥ ఆచార్య యజమానులు స్థపతితో కూడా విమానమునకు చెందిన సూత్రమును ప్రసరింపజేసి ద్వారమును గుర్తించి గర్భగృహ ద్వారదక్షిణ మునకు రెండు అంశములు విడిచి గోడ మధ్యయందు చతురస్ర స్థలమును ఏర్పరచి దానిని 9 భాగములు చేసి అందు శిలాన్యాసము చేయవలయును.**

ఆయుగ్మ హస్త విమానానాం తద్ధస్తంప్రతి త్ర్యంగులం ద్వ్యంగులం వా వర్ధయేత్. అంగులి సంఖ్యా సమాయామం తస్య అర్ధ విస్తారం, అర్ధ బాహుళ్యం, అథవా త్ర్యంగుళాద్యేకాదశాంగులాన్తం ఏకాంగులం వృద్ధ్యా విస్తారం నవధా భవతి. తదర్ధ బాహుళ్య విస్తారం ద్విగుణాయతం ఏవం చతస్రః శిలావా అథేష్టకావా అగ్రపాదం ముఖం పృష్టంచ సంలక్ష్యైవ ఆహరేత్. **(మరీచి)**

**తా॥ 3 మొదలు బేసి సంఖ్య హస్త ప్రమాణములు గల విమానములకు ప్రతి హస్తమునకు మూడు మూడు అంగుళములు గానీ, రెండు రెండు అంగుళములు గానీ పెంచి శిలయొక్క ఉన్నతమును నిర్ణయించవలయును. ఉన్నతములో సగము విస్తారము, విస్తారములో సగము మందము వుండ వలయును. లేక 3 అంగుళములు మొదలు 11 అంగుళముల వరకు**

**ఒక్కొక్క అంగుళము పెంచుతూ 9 విధములుగా శిలా విస్తారము వుండ వలయును. ఆవిస్తారములో సగము మందము, విస్తారమునకు రెండు రెట్లు ఉన్నతము ఉండవలయును. ఈ విధముగా నాలుగు శిలలు గానీ ఇటుకలు గానీ గ్రహించి వాటికి శిరస్సు, పాదము, ముఖము, పృష్టము గుర్తించవలయును.**

**ఆచార్యుడు వైదిక సంస్కారములతో శిలలను ప్రోక్షించి వేద మంత్రో చ్ఛారణతో, ఇంద్రస్థానమున శిరస్సు ఆగ్నేయమున పాదముగ ప్రథమ శిలను, ఆగ్నేయమున శిరస్సు నైఋతి యందు పాదముగ ద్వితీయ శిలను, వాయవ్యస్థానమున శిరస్సు పశ్చిమము యందు పాదముగ తృతీయ శిలను, ఈశాన్యస్థానమున శిరస్సు ఉత్తర పాదముగ చతుర్ధ శిలను ఉంచ వలయును. నాలుగు శిలలు ఊర్ధ్వ ముఖముగా స్థాపించ వలయును. మధ్యలో బ్రహ్మ స్థానమున నవరత్నములను సువర్ణమును ఉంచి శిల్పిని రప్పించి అతనిచే ధృడముగా ఉపపీఠ, అధిష్ఠాన, పాదవర్గాదులతో అక్కడ విమానమును నిర్మింప చేయవలయును.**

**పాద్మే**

శ్లో॥ హస్త మానాఽయతం శంకుం ద్వారకాఽంగుల మేవవా ।
క్షీర వృక్షజ మంగుష్ట పరిమాణ మృజుం శుభమ్ ॥
ప్రాసాద స్థాన మధ్యేతు, స్థాపయే స్మూల విద్యయా ।
అష్టదిక్షుః యధా న్యాయం, శంకు స్థాపన మాఽచరేత్ ।

**తా॥ శంకును ఇరువది నాలుగు అంగుళములు (హస్తము) కానీ, పదిరెండు (12) అంగుళములు గానీ పొడవు వుండవలెను. రావి, మఱ్ఱి, జువ్వి, మేడి శంకువుగా నొనర్చి గర్భమందిర మధ్యభాగమున ఓమ్ నమో నారాయణాయ అను మూల మంత్రముతో స లక్షణముగా స్థాపింప వలయును. ఎనిమిది (8) దిక్కుల యందునూ, శాస్త్ర ప్రమాణ ప్రకారము (మూల శంకువు వలనే) శంకువులను విధిగా స్థాపింపవలెను.**

# శిలా శంకువు

**గృహవాస్తు కల్పద్రుమే -**

శ్లో॥ దేవా గారే శిలా శంకుః, గృహే దారు మయం తథా ।
మానాంగుళం తు దేవానాం । నృణాం మాత్రాంగుళం భవేత్ ॥

**తా॥ దేవాలయములకు మానాంగుళముల కొలతతో శిలా శంకువునూ, మానవ గృహములకు మాత్రాంగుళముల కొలతతో కొయ్య శంకువునూ, స లక్షణముగా చెక్కించి ప్రతిష్ఠింపవలెను !**

# ప్రతిష్ఠా కాలః

**మరీచి–** అధాతో భగవతో నారాయణస్య ప్రతిష్ఠా విధింవ్యాఖ్యాస్యామః । ఉదగయనే ఫాల్గుణ, చైత్ర, వైశాఖ, జ్యేష్టే షూత్తమమ్ । దక్షిణాయనే శ్రావణాఽశ్వ్విజ కార్తికేషు మధ్యమమ్ । ప్రోష్ట (భాద్ర) పదాఽషాఢ యోరథమమ్ । మార్గశిర, మాఘయోర్వివర్జ్యయేత్ ।

ఉత్తరాత్రయ, రోహిణీ, శ్రవణ, పుష్య పునర్వసు, స్వాతి,హస్త, చిత్రాఽనురాధా ఽ(దిత్యా) శ్వినీషు । సితే పక్షే పక్ష చ్ఛిద్రాం వివర్జ్య । కృష్ణపక్షే ప్రథమా ద్వితీయా, పంచమీషు । సోమ, గురు, సౌమ్య, కవి, వారేషు । కరణేషు విశిష్టేషు, ధృవేషు । చరేషువా విష్టి మష్టవిధాం త్యక్త్వా, చరరాశిం విహాయ । స్థిర రాశే, వుభయ రాశౌ వా । శ్రేష్టే విష్ణోః ప్రతిష్ఠాం కుర్యాత్ । ఆర్ద్రాఽశ్రేషామూలా నక్షత్రేషు, కృష్ణాఽష్టమ్యా । ముల్కాపాతే అశనిపపాతేఽదిగ్దాహే, పాంశు రుధిరోపల వర్షే ! వ్యతీపాతే, భూకంపాఽతి మారుత, రాజమరణ, చంద్ర సూర్యోఽపరాగే యుక్తే, ష్వేతేషు, రాత్రౌ చ, పరివర్జ్యయేత్ ।

**ఉత్తరాయణము – చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, ఫాల్గుణ మాసములు ఉత్తమము, శ్రావణ, ఆశ్వయుజ, కార్తీక మాసములు మధ్యమము, మార్గశీర్ష మాఘ మాసములు పనికిరానివి. అశ్వని, రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర శ్రవణము**

**ఈ పది నక్షత్రములు – శుక్ల పక్షము, సోమ, బుధ, గురు, శుక్రవారములు ప్రశస్తములు, స్థిరలగ్నము ఉత్తమము చరలగ్నము పనికిరాదు – శుభులు కేంద్ర త్రికోణముల యందును పాపులు త్రిషడాయముల యందును ఉండగా స్థిర లగ్నమున దేవాలయమునందు పరమేశ్వరర్చా రూపమును ప్రతిష్ఠించుట ఉత్తమోత్తమము.**

**రత్నావళ్యాం : మాఘ, ఫాల్గుణ, జ్యేష్ఠా షాఢేషు పంచసు, మాసేషు శుక్ల పక్షేషు, లింగ స్థాపన ముత్తమం,**

**విశేషము : శ్లో॥ మాతృభైరవ వారాహ నారసింహ త్రివిక్రమాః।**
**మహిషాసురహంత్రీ చ స్థాప్యా వైదక్షిణాయనే।**

**వాస్తు దర్పణే –**

శ్లో॥ సోమసూత్రంతు పూర్వే చ, ధన ధాన్యాదికం మహత్ ।
ఆయుర్వృద్ధి ర్ధక్షిణే చ, పశ్చిమే యశ, సంపదౌ ॥
ఉత్తరే భోగ, భాగ్యాని, మునిభిః పరికల్పితమ్ ।

**తా॥ సోమసూత్రము – తూర్పునకు ఉండిన = ధన, ధాన్య సంపదలు మిక్కుటము, దక్షిణమునకు ఉండిన = ఆయుర్వృద్ధి, పడమరకు ఉండిన = కీర్తి, ఐశ్వర్యము, ఉత్తరమున ఉండిన = యజమానికి, ఊరివారికీ, సకలలోకములకును భోగము, భాగ్యము కలుగును.**

## సోమ సూత్ర ముఖా౭ కృతులు

వాసు దర్పణే–

శ్లో॥ గోముఖం పశు వృద్ధిం, మకరం జలవృద్ధిదమ్ ।
సింహం శతృ హరం చైవ, ఉరగం రోగనాశనమ్ ॥
క్రిమి, కీటౌ సస్యవృద్ధిః, సోమ సూత్ర ముఖా ౭కృతిః ।

**తా॥ వాస్తు దర్పణము నందు ఇట్లు చెప్పబడియున్నది–**

**(1) ఆవు ముఖము సోమసూత్రమునకు వుండినచో = పశువృద్ధి కలుగును.**

**(2) మొసలి ముఖము వుండినచో = జలసమృద్ధి కలుగును.**

**(3) సింహ ముఖము వుండినచో = శతృనాశనము కలుగును.**

**(4) సర్పముఖము వుండినచో = రోగ నాశనము కలుగును.**

**(5) పురుగులు, ఈగల ముఖములు వుండినచో = పంటలు అభివృద్ధి అగును.**

**వామే నాళం ప్రకర్తవ్యా : స్వామివారికి వామ భాగమున సోమ సూత్రము ఉండవలయును.**

## దేవ ధ్వజ దారువులు - కొలతలు

శ్లో॥ అన్తస్సారం బహిస్సారం ద్వివిదం దణ్డముచ్చతే
చమ్పకం చన్దనం చైవ వకులోర్జున మేవచ
ఖాదిరైః ఖాదిరైర్యుక్తం తత్పుత్ర దీపకమ్
అథవాలోహపాషాణైః అన్తస్సారం ప్రకీర్తితమ్
ఏతేష్వేవా అన్తస్సారేషు యధాలాభం ప్రగృహ్యాచ

శ్లో॥ అన్తస్సారో  బహిస్సార నిస్సారో స్త్రి విధ స్తరుః ।
క్రముకాది బహిస్సారో ప్రశస్తం విదు రుత్తమమ్ ॥
అన్తస్సారం చన్దనాది ప్రశస్తం స్థంభ కల్పనే ।
నిస్సారం వర్ణయేత్, స్థంభం శత తాలాయతంశుభం ॥
మానాంగుల ప్రమాణేన వింశత్యూన మధాపివా ।
ప్రసాదోచ్ఛ్రాయ మధవా యద్వా గోపుర సమ్మితమ్ ॥

**తా॥ లోపల చేవ గలది శ్రేష్ఠము, వెలుపల చేవ గలది మధ్యమము, ఎచటనూ చేవలేనిది అధమము, అలాగే లోహము, పాషాణము (శిల) ఇవి కూడా అన్తస్సారముతో ఉంటాయి. వీటిలో మనకు లభించిన దానితో ధ్వజనిర్మాణము చేయుట శ్రేయస్కరము.**

**1. అంతస్సార వృక్షములు = చందన, టేకు, మద్ది రక్తచందన, చంద్ర మున్నగునవి ఇవి సర్వశ్రేష్ఠము.**

**2. బహిస్సార వృక్షములు = పోక, తాడి, వెదురు మున్నగునవి ఇది మధ్యము.**

**3. నిస్సార వృక్షములు = గోగు, బాదము, ములగ మున్నగు వీనిని ఎట్టి పరిస్థితులయందునూ ఉపయోగించకూడదు.**

వా॥ సశిఖర విమానాలయ మానాద్ధ్వజః, విమానాన్న్యూనో మోక్షః, అధికః కీర్తిః, సవిమానసమోకామ్యః

**తా॥ ఆలయ విమానశిఖర సమముగా ధ్వజము ఉండవలయును, దానికన్నా తగ్గిన యెడల మోక్షము, శిఖరము కన్నా అధికమయిన కీర్తి, శిఖరముతో సమానమైన కామ్యధ్వజము, ఈఫలితములు కలుగును**

**మరీచి–** ధ్వజదండ మృజుం, కృమికీటక, కంటకరహితం, అనుద్వేజనం, విమానసమం, పాదాదిక, మర్ధాధికం, పాదహీనం, అర్ధహీనం వా, చతుర్వింశత్యంగుళ పరిణాహం, వేణుం, జాతి, చంపక, క్రముకంవా అన్య శుభవృక్షసారం, గృహ్ణీయందాగస్త్యం కేచిత్.

**తా॥ ధ్వజమునకు ముడులు, తొర్రలు, వంకరలు, ఉన్నవి కీటకములచే తినివేయ బడినవి, బుగిలిపోయినవి వదిలి వేయవలయును, ఆలయ విమానమునకు సమము గానీ 1/4, 1/2 ఎక్కువగానీ, తక్కువగానీ 24 అంగుళ పరిమాణము కలిగిన జాతి వృక్షములను స్వీకరించ వలయును. వెదురు, పోక, కొబ్బరి, ఈవృక్షములను వదిలి వేయవలయును.**

**(కపింజలే)**

శ్లో॥ అంతస్సారం, బహిస్సారం ద్వివిధం స్థంభ ముచ్యతే ।
చంపకో, దేవదారు శ్చ, చందనః ఖదిర స్థధా ॥
అర్జున, స్సాల వృక్ష శ్చ, బిల్వః పనస ఏవ చ ।
ఏవమా దీని దారూణి అంత స్సార ముదాహృతమ్ ॥
క్రముకం, నారికేళం చ, వేణు, హింతాళ మేవ చ ।
బహి స్సార మితి ప్రోక్తం తస్య లక్షణ ముచ్యతే ॥

**తా॥ దారువులు (కొయ్యలు) రెండు తెగలు, అంతస్సారము అనగా లోపల చేవ కలిగినది, బహి స్సారముఅనగా లోపల చేవ లేనిది వెలుపల**

**చేవకలది. భగవదాలయ గరుడ ధ్వజమునకు ఈ రెండింటినీ వాడవచ్చును.**

**అంతస్సార వృక్షములు** 1. చంపకము, 2. దేవదారు, 3. చందన, 4. చంద్ర, 5. ఏఱుమద్ది, 6. మద్ది, 7. మారేడు, 8. పనస (టేకు) మొదలైన వృక్ష దారువులు (చెట్ల కలప) చాలా ప్రశస్తమైనవి !

**బహిస్సారము వృక్షములు** 1. పోక 2. కొబ్బరి 3. వెదుఱు 4. గఱక తాడి, మధ్యమము, శీత, వాత, ఆతప, వర్షములకు ఎక్కువ కాలముమనజాలవు.

శ్లో॥ పీఠగోపురయోర్మధ్యే పఞ్చభాగం ప్రకల్ప్యచ
పీఠత్యక్త్వా చతుర్భాగం పఞ్చమే ధ్వజసంస్థితిః **(భృగు)**

**తా॥ పీఠము నుండి గోపురము వరకు మధ్య ఉన్న ప్రదేశమును కొలిచి దానిని 5 భాగములు చేసి, పీఠము నుండి 4 భాగములు వదిలి 5వ భాగమునందు ధ్వజమును ఉంచవలయును.**

ధ్వజస్సమనవవిభాజితః- అగ్రాదేకోమేఖలానామ్, పాదాదేకో భూమౌ, పాషాణార్ధం ద్వితీయః, మధ్యంషడ్భాగకమ్,

**తా॥ ధ్వజమును తొమ్మిదిభాగములు చేసి ఒక భాగమును మేఖలము లకు, ఒకభాగం భూమిలోపలను, ఒకభాగం భూమి ఉపరితలం మీద దిమ్మకు, ఆరుభాగములు మధ్యన ఉంచవలయును.**

## గర్భాలయమున విగ్రహస్థానములు

ప్రాగగ్రై ఉత్తరాగ్రైశ్చ సూత్రైషట్పంచాశ ద్విశతభాగంచ విభజ్య తన్మధ్యే షోడశ భాగం బ్రాహ్మం, తత్పరరిత శ్చతురధికాశీతి భాగం దైవికం, తత్పరిత ష్షణ్ణవతి భాగం మానుషం తద్బహిష్షష్టి భాగం పైశాచం భవతి.
తన్మధ్యే బ్రాహ్మే కౌతుక పీఠం, దైవిక భాగం త్రిధాకృత్వా తస్యాపర భాగే తన్మధ్యేవా స్థానకం, దేవమానుషయోరన్తరే చాసనం, కించిద్దైవిక మాశ్రిత్య మానుషాంశే శయానం స్థాపయేత్.

**తా॥ గర్భాలయమును తూర్పు అగ్రముగా 16 భాగములు ఉత్తరాగ్రముగా 16 భాగములుగా మొత్తం 256 (గడులు) భాగములుగా విభజింప**

**వలయును. అలా విభజించగా మధ్యలో ఉన్న 16 భాగములు బ్రహ్మ స్థానముగా, దానికి బయట ఉన్న 86 భాగములు దైవిక స్థానముగాను, దానికి బయట ఉన్న 96 భాగములు మానుష స్థానముగాను, దానికి బాహ్యముగా ఉన్న 60 భాగములు పైశాచిక స్థానమును గాను గ్రహించ వలెను. మధ్యలో బ్రహ్మ స్థానమునందు కౌతుక పీఠముగా నిర్ణయించవలయును. దైవిక భాగమును మూడుగా విభజించి మధ్యభాగమున నిలబడిన విగ్రహమును ప్రతిష్ఠించవలయును. కొద్దిగా మానుష భాగమును స్వీకరించి దైవిక భాగమును ప్రధానముగా చేసుకుని కూర్చుని ఉన్న విగ్రహములను ప్రతిష్ఠించవలయును. కొద్దిగా దైవిక భాగమును స్వీకరించి మానుష భాగమును ప్రధానముగా చేసుకుని శయనించిన విగ్రహములను ప్రతిష్ఠింప వలయును. పైశాచిక భాగమున ఎట్టి పరిస్థితులలోను విగ్రహ ప్రతిష్ఠ చేయరాదు.**

## విగ్రహ దృష్టి ఫలము

**మరీచి–** ఊర్ధ్వదృష్టి మధోదృష్టిం తిర్యణీక్షణంనైవ, బేరం సమదృష్టిం సంస్థాప్య, పశ్చాభివినాఘట శర్కరాదీని కారయేత్, యజమానిం నిహం తూర్ధ్వం అధోదృష్టిస్తధార్చకం, స్తపతిపార్శ్వదృష్టిశ్చ దృష్టిదోషం త్రిధామతం, అధోదృష్టి స్తతోదుఃఖం సమదృష్టిశ్చ సంపదః ఊర్ధ్వదృష్టి ర్మహాదోషం పార్శ్వదృష్టిశ్చ శిల్పినః

**తా॥ ఊర్ధ్వ దృష్టివలన యజమానియును, అధోదృష్టివలన అర్చ కుడును, పార్శ్వ దృష్టి వలన స్థపతియును, కష్టములను, నాశనమును, దుఃఖమును పొందెదరు, సమదృష్టి వలన సంపదకలుగును, కనుక సమ దృష్టినే ఉంచవలెను.**

కర్తునాశ మధోదృష్టిం ఊర్ధ్వదృష్టి విపత్కరం
పార్శ్వదృష్టి బంధునాశనం నాసాదృష్టి విసర్జయేత్
పార్శ్వేఊర్ధ్వదృష్టిదోషంతు కర్తు శిల్పినాశనం

పార్శ్వేధోదృష్టి దోషస్యాత్ తత్క్షేత్రం నాశనం భవేత్
తస్మాత్సర్వప్రయత్నేన సమదృష్టికరం భవేత్
దృష్టి శుభదం జ్ఞేయం సర్వకామ ఫలప్రదం

**తా॥ ఆలయమునందు ప్రతిష్ఠించిన విగ్రములకు, అథోదృష్టి వుండిన యెడల కర్తకు వినాశనము, ఊర్ధ్వదృష్టి వలన విపత్కరమైన పరిస్థితిలు ఏర్పడతాయి, పార్శ్వదృష్టి వలన బంధునాశనం కలుగును, నాసిక పైన దృష్టిని పెట్టకూడదు, విగ్రహం పక్కకు తిరిగి పైకిచూస్తే శిల్పికినీ, యజమానికినీ నాశనము కలుగును. విగ్రహం పక్కకు తిరిగి క్రిందకు చూస్తే ఆక్షేత్రమునకు నాశనము కలుగును. కావున సమదృష్టి వుండునట్లుగా విగ్రహమును ఉంచవలెను. సమమగు దృష్టివలన లోకములకు శాంతి, సర్వ జీవులకు సుఖములు కలుగును.**

**ఆత్రేయ తిలకే**

శ్లో॥ వామదృష్టిః పశుర్ నాశో, ఊర్ధ్వ దృష్టిః ధన క్షయః ।
అల్పాక్షీ మండలాక్షీంచ, కేకరాక్షీం, తథైవచ ॥
హీన దృష్టి మధో దృష్టిం, దూరతః పరివర్జయేత్
నిమ్న కుక్షి భవే దర్చా, సస్యనాశః సదా భవేత్ ॥

**తా॥ ఎడమవైపు దృష్టి పశునాశనము కల్గించును. ఎగువవైపు దృష్టి ధననాశనము కల్గించును. చాలా చిన్న కనులు, గుండ్రని కనులు, (కనులు చేపల ఆకారముతో వుండవలెను) చికిలించి నట్లుండిన కనులు, కాంతి వంతముగా లేని కనులు, క్రిందకు చూపుగల కనులు, ఉన్న విగ్రహములను ప్రతిష్ఠింపరాదు! విగ్రహమునకు పొట్ట సమముగా వుండక పైన సన్నగానూ, క్రింద పెద్దదిగానూ ఉండినచో ఆవిగ్రహము పూజించు గ్రామ, దేశములయందు, ఎల్లపుడునూ (పాడి) పంటలు నశించును.**

## దృష్టివేధా – ఛాయాదోష విషయములు

శివదృష్టి ర్విష్ణుపృష్ఠం దుర్గాయాః పార్శ్వతోదృశం
విఘ్నేశస్యోర్ధ్వ దృష్టించ తీక్ష్ణమాహుర్మనీషిభిః

యావచ్చావతరే ఛాయాతావతీ దోషభూమికా
దోషభూమిం పరిత్యజ్య నివాసం పరికల్పయేత్
త్యాగేసంపత్సమృద్ధిస్యా దన్యథా విపరీతకృత్
రథ్యాదిభిర్యదా విద్ధమన్తరం తన్నదోషకృత్
అథవా శతదండాంతం త్యక్త్వాన్యేవసతింజగుః
యావద్ధామాయతం తావత్ పృష్ఠంవా ముఖమేవవా
తతోధికంతచ్చుతచ్చ కేచిదాహుర్మనీషిణః **(భృగు)**

**తా॥ శివాలయమునకు ఎదురుగా ఇల్లు వుండిన శివదృష్టి వేధకల్గును, విష్ణు ఆలయమునకు వెనుక ఇల్లు వుండిన విష్ణుపృష్ట వేధకలుగును, దుర్గ మొదలగు స్త్రీ దేవతా ఆలయములకు కుడి –ఎడమ ప్రక్కల ఇల్లు వుండిన శక్తి పార్శ్వ వేధ కలుగును, విఘ్నేశుని దృష్టి పైకి ఉండుటచే ఎత్తుగా వుండిన మేడలకు(ఊర్ధ్వదృష్టి వేధాదోషము) ఈ వేధ వలన తీవ్ర బాధలు కలుగును. కనుక ఏదేవుని ఆలయమునకు అయిననూ ప్రాకారములకు వెలుపల కనీసము వందబారలు ఆవల వుండేటట్లు గృహనిర్మాణము చేసు కొనిన కనీసం రెండుబండ్లు (లేక రెండు బస్సులు) పోవుటకు తగిన విశాలము కలిగిన వీధులు వుండి దానికి ఆవల వుండిన స్థలముల యందు గృహనిర్మాణము చేసికొనినచో, దేవతావేధలు నివారింపబడి, సుఖ, సంతోష, భోగ, భాగ్య, ధన, ధాన్య, వంశాభివృద్ధి కలిగి ఐశ్వర్యమును పొందుతారు.**

విష్ణుంపృష్టం వీధిశూలం శక్తిపార్శ్వంచ వర్జయేత్
దృష్టించ శివమూర్త్యగ్రే శోకరోగ భయప్రదం **(గార్గేయాగమమ్)**

**తా॥ విష్ణువునకు వెనుక, శక్తిదేవతలకు ఇరుప్రక్కలయందు, శివునకు ముందుభాగములో దృష్టిదోషము ఉండును. దానివలన శోకరోగభయములు కలుగును.**

ధ్వజస్య గోపురచ్ఛాయా పురగ్రామప్రసారితా
పూర్వయామం శుభం ప్రోక్తం ద్వియామం నష్టకారకం
త్రియామం దుఃఖదం కుర్యాచతుర్థంతుశుభంకరం **(గార్గేయాగమమ్)**

**తా॥ ధ్వజమునీడ, గోపురమునీడ, మొదటిజామున గ్రామముపై ప్రసరించిన శుభము, రెండవజామున ప్రసరించిన నష్టము, అశుభము, మూడవజామున ప్రసరించిన దుఃఖము, అశుభము, నాల్గవజామున ప్రసరించిన శుభమును యిచ్చును. కనుక ఛాయపడిన ప్రదేశమును వదిలి, ఛాయాదోషములేని ప్రదేశము నందు గ్రామమున గృహనిర్మాణము గావించుకున వలయును.**

## దేవాలయముపై విగ్రహములు

**మరీచి–**

| తూర్పు | దక్షిణం | పశ్చిమం | ఉత్తరం |
|---|---|---|---|
| **పురుష** | **నృసింహ** | **అచ్యుత** | **అనిరుద్ధ** |
| **చక్ర** | **దక్షిణామూర్తి** | **నృసింహ** | **బ్రహ్మ** |
| **ప్రధానమూర్తి** | **సత్య** | **అచ్యుత** | **అనిరుద్ధ** |
| **పురుష** | **నృసింహ** | **అచ్యుత** | **వరాహ** |
| **పురుష** | **నృసింహ** | **వరాహ** | **హయగ్రీవ** |

**ప్రకీర్ణం–** విమానే ప్రాచ్యాం విష్ణుః ప్రకుర్వీత యస్యగర్భ గృహేస్థితిః, దక్షిణే సత్యమూర్తేస్తు, పశ్చిమేఅచ్యుతస్యచ, ఉత్తరేచానిరుద్ధస్య స్థితిమేవం ప్రకల్పయేత్, గలేపురుషమూర్తిస్తు, దక్షిణేనారసింహః, పశ్చిమేతు వరాహస్య, హయగ్రీవ స్తథోత్తరే.

ముఖ మండపం దక్షిణే బాహ్యే విఘ్నేశం, ఉత్తరే వింధ్య వాసినీం, ఆగ్నేయాది కోణేషు ప్రస్తరోపరి గళస్థానేషు వాహనం మృగేశం ఖగేశం వాన్యస్మిన్ పర్వత: దేవస్య విజయక్రీడా కరణాదీని ఏవం కారయేత్.

**తా॥ ఆలయ విమాన గోపురమునకు ప్రతి తలమునకునూ నాలుగు దిక్కుల యందునూ పై విధముగా దేవతలను ఏర్పరచవలెను. ఆలయము నందలి గర్భగృహము నందు ప్రతిష్ఠింపబడిన ప్రధానమూర్తి నిల్చోని వుండిననూ, కూర్చొని వుండిననూ, పరుండి వున్ననూ సింహద్వారం వైపు ముఖము కలిగి విమాన తలమునందు, దేవుని మూలబింబము వలెనే**

**మలచు ఏర్పాటు చేయవలెను. విమానపాలకులను, దిగ్మూర్తులగు ఇంద్రాదులను ఏర్పాటు చేయవలయును, ముఖ మండపము బయట దక్షిణ భాగమునందు విఘ్నేశ్వరుని, ఉత్తర భాగమునందు వింధ్య వాసినినీ ఉంచవలయును, ఆగ్నేయాది కోణముల యందు సింహమును లేక గరుత్మంతుడను ఏర్పరచవలెను, దేవతా సంబంధ విజయక్రీడా చిత్రములను కూడా ముఖ మండప భాగములయందు ఉంచవచ్చును.**

## విమాన భేదములు

నాగరం ద్రావిడం వేసరమితి త్రివిధం హర్మ్యరూపం
ఖురాది స్థూపికాన్తం చతురశ్రం నాగరం, తద్దైవ వృత్తం వేసరం
అథవా ప్రస్తరాన్తం సమచతురశ్రం తదుపరి వృత్తగ్రీవా శిఖరంచ
వేసరం, తద్దైవ వస్వశ్ర శిఖరగ్రీవం ద్రావిడం స్యాత్. **(మరీచి)**

**తా॥ నాగరం, ద్రావిడం, వేసరం అని హర్మ్యము మూడు విధములు.**

నాగరం : **అధిష్ఠానము నుండి స్థూపికాన్తము చతురశ్రముగా ఉండును.**

వేసరం : **అధిష్ఠానము నుండి స్థూపికాన్తము వృత్తాకారముగా ఉండును. లేక అధిష్ఠానము నుండి ప్రస్తరాన్తము వరకు సమచతురశ్రముగా ఉండి దానిపై గ్రీవము, శిఖరము వృత్తముగా వుండునది వేసరం.**

ద్రావిడం : **అధిష్ఠానము నుండి ప్రస్తరాన్తము వరకు చతురశ్రముగా ఉండి గ్రీవము, శిఖరము ఎనిమిది కోణములుగ ఉండును.**

షడ్వర్గ సహితం నిత్యం విమానం దోషవర్ధితమ్
తత్రరన్తుం మనీషా స్యాత్ దేవతానాం విశేషతః
విమానానాంచ సర్వేషాం సామాన్య మిదముచ్యతే
అధిష్ఠానం పాదవర్గః ప్రస్తరః గ్రీవకావపి
శిఖరం స్థూపికా చేతి షడ్వర్గం ఇతి కీర్తితాః **(సమూర్తార్చనా)**.

**అధిష్ఠానం - పాదం - ప్రస్తరం - గ్రీవం - శిఖరం - స్థూపి అను ఆరు అంగములతో కూడినది విమానం.**

**ఏకతలాది ద్వాదశ తలముల వరకు విమానములు 12 విధములుగా చెప్పబడి వున్నవి. విమానము యొక్క అంగములలో ఒకటైన పాదవర్గు ఒక పర్యాయము మాత్రము నిర్మించి నట్లయితే ఏకతలమని, రెండు పర్యాయములు పాదవర్గు నిర్మించినట్లయితే ద్వితలమని, ఈ విధంగా 12 పర్యాయములు పాదవర్గు కల్పించినట్లయితే ద్వాదశ తలవిమాన మనబడును.**

పంచధోత్సేధముద్దిష్ఠం, శాంతికాదిక్రమేణవై
శాంతికం పౌష్టికం జయ్యమద్భుతం సార్వకామికమ్. (**భృగు**)

**ఉన్నతమును బట్టి విమానములు ఐదు విధములు. అవి**

**శాంతికం, పౌష్టికం, జయదం, అద్భుతం, సార్వకామికం.**

విమాన విపులస్య సపాదోత్సేథం శాంతికం, అర్థాధికోత్సేధం పౌష్టికం, పాదోన ద్విగుణం జయదం, ద్విగుణం అద్భుతం, పాదాధికంద్విగుణం సార్వకామికం. **(మరీచి)**

**విమాన విస్తారమునకు 11/4 అధికంగా ఉన్నతము కల్పించి నట్లయితే అది శాంతిక విమానం.**

**విమానం విస్తారమునకు 11/2 అధికంగా ఉన్నతమును కల్పించి నట్లయితే అది పౌష్టికవిమానం.**

**విమాన విస్తారమునకు 13/4 అధికంగా ఉన్నతమును కల్పించి నట్లయితే అది జయదం.**

**విమాన విస్తారమునకు 2 రెట్లు అధికంగా ఉన్నతమును నిర్మించినట్లయితే అది అద్భుతం.**

**విమాన విస్తారమునకు 21/4 రెట్లు అధికంగా ఉన్నతమును నిర్మించినట్లయితే అది సార్వకామికం అనబడును.**

## సంకీర్ణ విమానం

**ఆయాది శుభాశుభములతో పరీక్షించిన తదుపరి నిర్ణయించిన విమాన విస్తారము ద్వారా ఏర్పడ్డ హస్త ప్రమాణములతో పొడవు వెడల్పులను నిర్ణయించి సమచతురశ్రం, వృత్తంగా గానీ నిర్మించుకొనవచ్చు.**

**విమాన విస్తారమునకు 11/4, 11/2, 13/4, 2 రెట్లు అధికంగా గానీ పొడవును నిర్ణయించి గ్రీవ భాగమునకు చతురశ్రంగా గానీ, వృత్తాకారంగా గానీ, నిర్మించి శిఖర స్థూపికలను భిన్నముగా నిర్ణయించుకొన్నట్లయితే అది సంకీర్ణ విమానం అగును.**

## విమాన ద్రవ్య భేదము

విమన మేక ద్రవ్య కృతం శ్రేష్ఠం
ద్విద్రవ్యకృతం మధ్యమం, త్రిద్రవ్య కృతమధమమ్ (**మరీచి**)

**విమానము ఒకే ద్రవ్యముతో నిర్మించిన శ్రేష్ఠము, రెండు ద్రవ్యములతో నిర్మించిన మధ్యమము, మూడు ద్రవ్యములతో నిర్మించిన అథమము అగును.**

## గర్భగృహం

విమాన విస్తారం త్రి చతుష్పంచ సప్త నవ ఏకాదశ భాగం కృత్వా యథాక్రమేణ ఏక ద్వి త్రి చతుష్పంచ షడంశం గర్భ గృహవిస్తారం స్యాత్

(**మరీచి**)

**విమాన విస్తారమును 3,4,5,7,9,11 భాగములు చేసి అందు క్రమముగా 1,2,3,4,5,6 అంశములలో ఏదైనా ఒక ప్రమాణమును గ్రహించి గర్భ గృహవిస్తారము నిర్ణయించవలయును. మిగిలిన భాగము గోడ భాగములగును.**

**ఉదా:-**

| గోడభాగం | గర్భగృహం | గోడభాగం | | |
|---|---|---|---|---|
| **1** | **1** | **1** | **=** | **3** |
| **1** | **2** | **1** | **=** | **4** |
| **1** | **3** | **1** | **=** | **5** |
| **1 1/2** | **4** | **1 1/2** | **=** | **7** |
| **2** | **5** | **2** | **=** | **9** |
| **2 1/2** | **6** | **2 1/2** | **=** | **11** |

## అధిష్ఠాన భేదములు

**రూపభేదములను బట్టి అధిష్ఠానము ఎనిమిది విధములు. అవి**

**పాదబంధం పద్మబంధం, పుష్పబంధం, శ్రీప్రియాంబుజం, ప్రతి బంధం, ప్రతిక్రమం, కపోతబంధం, శ్రీబంధమితి అష్టావధిష్ఠానాని భవన్తి. (మరీచి)**

## ముఖమంటపం

విమానవిస్తారసమం త్రిపాదమర్థం వా ముఖమంటపం తద్వ్యంతరం త్రయోదశ భాగం కృత్వా ఉ థైకైకాంశాధికేనాయామం సప్తవింశతి భేదం స్యాత్ **(మరీచి)**

**మానసూత్ర విస్తారమునకు సమానము, 3/4, 1/2 ముఖమంటప విశాలము.**

**ఈ విశాలమును 13 భాగములుచేసి ఒక్కొక్క అంశముగా పెంచుతూ 27 విధములుగా ముఖమంటప ఆయామము కల్పించవచ్చు.**

## అంతరాలం

అంతరాలం తస్య వేశనం ద్విదండం దండార్థం దండమర్థం పాదం వా తదాయామం.

**అంతరాలము యొక్క వేశనము 2, 1 1/2, 1, 1/2, 1/4, దండముగా ఉండును.**

హస్తేన పాదమర్ధం త్రిపాద మేక హస్తాది త్ర? పాదపంచ హస్తాంతం సభిత్తికం ద్వారం జాలకం వా కుర్యాత్

**హస్తప్రమాణ రీత్యా 1/4, 1/2, 3/4, 11/4 మొదలు 5 హస్తముల వరకు గోడతోకూడిన ద్వారము, జాలకము నిర్మాణము చేయవచ్చును.**

## ద్వారలక్షణం

అథ ద్వారలక్షణం వక్ష్యే పాదాయామం ద్వారోత్సేధం, తదర్ధవిస్తారం విస్తారాధికమానం విమాననిర్ధేశాంగులే నైకాద్యష్టాంగులాన్తం భవత్యథవా దండేన పాదదండాదిపాదాధికద్విదండాన్తం పాదదండవృద్ధ్యా నవవిధం స్యార్ధస్తేన పాదం సార్ధపాదమర్ధం భిత్తి విస్తారసమంవా **(మరీచి)**

**పాదవర్గు ఉన్నతమునకు సమానము ద్వార ఉన్నతము, ద్వార ఉన్నతములో సగము ద్వారవిస్తారము.**

**విస్తారము అధికముగా అవసరమగునపుడు విమాన నిర్మాణము నకు నిర్దేశింపబడిన అంగుళ ప్రమాణరీత్యా 1 నుండి 8 అంగుళముల వరకు విశాలము కల్పించుకొనవచ్చు. లేక 1/4, 1/2, 3/4, 11/4, 11/2. 13/ 4, 2, 21/4 వరకు దండ ప్రమాణరీత్యా విస్తారము 9 విధములుగా నిర్మించుకొనవచ్చు. హస్త ప్రమాణరీత్యా 1/4, 3/4, 1/2 గానీ కల్పించ వలయును.**

**భిత్తి విస్తార సమముగా ద్వారము యొక్క విస్తారము ఉండవచ్చు.**

## శుద్ధద్వారం

ద్వార విపులం పాదోత్సేధం సప్తాష్టనందదశభాగం కృత్వా షట్సప్తాష్ట నవభాగం శుద్ధద్వారం శేషాంశం ద్విధాకృత్వైకాంశం భువంగమేకాంశం పతంగం **(మరీచి)**

**పాద ఉన్నతమును 7,8,9,10 భాగములు చేసి అందు 6,7,8,9 భాగములు శుద్ధ ద్వారం అగును. మిగిలిన 1 భాగమును రెండు భాగములు చేయగా భువంగం 1, పతంగం 1, అగును.**

## స్తంభ నిర్గమం

**భువంగపతంగముల ఉన్నతమే స్తంభ నిర్గమము.**

## స్తంభ విశాలం

తద్బహులాత్పాదాధికమర్ధాధికం పాదోనద్విగుణం వా తేషాం విపులం

**1/4, 1/2, 13/4, స్తంభనిర్గమమునకు అధికముగా స్తంభవిశాలం కల్పించవచ్చు.**

## యంత్రిక

కవాట పృష్ఠీ బంధనార్థం దారుణా యంత్రం యంత్రికాంచ కృత్వా బాహ్యపార్శ్వేచాఽఽయసా రక్షాబంధనపరం యంత్రం యంత్రికాం ఆయత వలయోపేతాం అయసా కాంచనేనవా వల్మీకాం కృత్వా అర్పయేత్.

**(మరీచి)**

**కవాట వెనుక భాగమునందు దృఢము కొరకు దారువుతో గానీ ఇనుముతోగానీ యంత్రికను చేసి, బాహ్యపార్శ్వమునందు ఇనుముతో రక్షా బంధనతో కూడిన యంత్రమును యంత్రికను కల్పించి పొడవుగా గుండ్రముగా ఉండునట్లు చేయవలయును.**

## కవాట విస్తారం

**కవాట విస్తారాయామం ద్వారసమం**

**కవాటవిస్తార ఆయామము ద్వారవిస్తార ఆయామమునకు సమము.**

**కవాట ద్వయము నానాపుష్పవల్లికలతో నానాచిత్ర విచిత్ర రూపములతో కూడి, శోభనార్థం రక్షణార్థంగా నిర్మించవలయును.**

## ద్వారదేవతా లక్షణం

**ద్వారదేవతలుగా ధాతృ – విధాతృ – భువంగ – పతంగ – పతిర – వరుణులు స్థాపించవలయును.**

## మహాద్వారం

తన్మహాద్వారం చేత్‌షోడశాంశం కృత్వా త్రయోదశాంశం శుద్ధద్వారోత్సేధం సప్తాంశమష్టాంశం వా ద్వారవిస్తారం షోడశాంశం ద్విధాకృత్వైకాంశం భువంగమేకాంశం పతంగంస్యాదన్యత్సర్వం పూర్వవత్కారయేత్. **(మరీచి)**

**పాద ఉన్నతమును 16 భాగములు చేయగా 13 భాగములు మహద్వారం యొక్క శుద్ధ ద్వారపు ఉన్నతమగును. 7,8 భాగములు మహద్వారవిపులము.**

**షోడశాంశమును రెండుగా విభజించి ఏకాంశము భువంగము, ఏకాంశము పతంగము నిర్ణయమగును.**

**మిగిలినదంతయూ ద్వారప్రమాణమువలే కల్పించవలయును.**

## కవాటం

ద్వారస్తంభ కవాటార్థం శిరీష పున్నాగ నింబ వకులార్జున మధూక పనసానన్యాన్ శుభాన్ పుంవృక్షాన్ విధినాహృతం దారు ద్విధాకృత్వా దక్షిణాంశం దక్షిణస్తంభకవాటం వామాంశ ముత్తర స్తంభ కవాటంచ తస్యోర్ధ్వభాగం ఊర్ధ్వపట్టికాంచ కారయేత్ **(మరీచి)**

**ద్వారస్తంభ, కవాటముల నిర్మాణము కొరకు శిరీష (దిరిశెన) పున్నాగ (సురపొన్న) నింబ (వేప) వకుళ (అశోక) అర్జున (మద్ది) మధూక (ఇప్ప) పనస మొదలగు శుభ పురుష వృక్ష దారువులను గ్రహించి ఆ దారువును రెండుగా విభజించి దక్షిణభాగము దక్షిణపు స్తంభకవాటము గనూ, ఉత్తర భాగము ఉత్తరపు స్తంభ కవాటముగను, ఊర్ధ్వభాగమును ఊర్ధ్వపట్టికగను చేయవలయును.**

## మహామంటపం

అథ ఆలయాభిముఖే మహామంటపం మూలాలయ సమం, అధ్యర్థం, ద్విగుణార్థం, త్రిగుణం, త్రిగుణార్థం, చతుర్గుణమితి, సమచతురశ్రం ఆయత చతురశ్రంవా యుగ్మపాద యుగ్మ భక్తికం మూల ధామ్న ఆదిభూమి ప్రమాణేన

అధిష్ఠాన పాద ప్రస్తరాణి కృత్వా సంఛాద్య మధ్యే సభాం యుక్త్యా కల్పయేత్ **(మరీచి)**

**ఆలయమునకు ఎదురుగా మహామంటపమును నిర్మించవలయును. మానసూత్ర విస్తారమునకు సమము 11/2, 2, 3, 31/2, 4 రెట్లు సమచతురశ్రంగా గానీ, దీర్ఘచతురశ్రంగా గానీ, సరిసంఖ్యగల స్తంభములు సరిభిత్తితో మూలాలయ ప్రమాణరీత్యా అధిష్ఠాన – పాద – ప్రస్తరములు కల్పించి పైకప్పుతో మధ్యయందు సభాస్థలిని యుక్తితో కల్పించవలయును.**

## నృత్త మంటపం

తత్రప్రముఖే తథైవ నత్త మంటపం

**మహామంటమునకు ఎదురుగా మహామంటపమువలే నృత్త మంటమును కల్పించవలయును.**

## యాగ మంటపం

ప్రథమావరణే ద్వితీయేవా దక్షిణే హోమస్థానం కారయేదితి కేచిత్ యాగశాలాం ద్వితీయావరణే తద్దక్షిణ ఆగ్నేయ్యాం వా పంచహస్త నవహస్తా యత విస్తారం చతుర్ద్వారయుతం మంటపం కూటం వా కుర్యాత్.

**(మరీచి)**

**ప్రథమావరణమునందు లేక ద్వితీయావరణమునందు దక్షిణ భాగ మున హోమస్థానమును నిర్మించవలయును.**

**యాగశాలను ద్వితీయావరణమునందు దక్షిణ ఆగ్నేయమునందు 5, 9 హస్తముల పొడవు వెడల్పులతో 4 ద్వారములతో కూడిన మంటపమును గానీ కూటంగా గానీ చేయవలయును.**

## స్నపనమంటపం

ప్రథమావరణే ద్వితీయావరణే మాలికావిహీ నే చాలయాభిముఖే మంటపపూర్వేసోపాన పూర్వేవా స్నపనాగారం మంటపం కూటం వా అనేక ద్వారయుతం ఏకద్వారయుతం వా కృత్వా **(మరీచి)**

**ప్రథమావరణమునందు గానీ ద్వితీయావరణము నందుగానీ, అలంకార రహితముగా ఆలయాభిముఖముగా మహామంటమునకు ముందుగ, సోపానములకు ముందుగ, స్నపనమంటపము కల్పించ వలయును. దీనిని మంటపముగా గానీ, కూటముగా గానీ, అనేక ద్వారము లతో కూడినదిగా గానీ, ఏకద్వారము కల్గినదిగా గానీ చేయవచ్చును.**

## ఆస్థాన మంటపం

తటాకం కృత్వా తత్పరిత శ్శిలయేష్టకయా వా తీరంకారయేత్తత్తీరే మనోరమేవా ఉ స్థానమంటపం కారయేదితి కేచిత్.

**తటాక తీరమునందుగానీ మనస్సునకు ఆహ్లాదమగు ప్రదేశము నందు గానీ ఆస్థాన మంటపము కల్పించవలయును.**

ఆగ్నేయాది కోణేషు తద్దైవ ఆస్థానమంటపం కారయేత్.

**ఆగ్నేయాదికోణములందు మహామంటపమువలే ఆస్థాన మంటపము నిర్మించవలయును.**

ప్రముఖే దక్షిణే పశ్చిమే ఉత్తరేవా విస్తీర్ణేదేశే తత్తద్దిశి బాహ్య ప్రాకార సమాయామం తత్సమం పాదం అర్థంవా విస్తారం అంకణం కృత్వా తస్మిన్నా స్థానమంటపం కారయేత్.

**ఆలయమునకు ఎదురుగానీ, దక్షిణమునందు గానీ, పశ్చిమము నందు గానీ, ఉత్తరమునందుగానీ విశాలమైన ప్రదేశమునందు ఆయా దిక్కులందు బయట ప్రాకారపు పొడవుతో సమానము, లేక 1/4, 1/2, వెడల్పుతో సరిచేసి అందు ఆస్థానమంటపం కల్పించవలయును.**

చతుస్సోపాన సంయుక్తం కుర్యాత్ స్నపనమంటపం
ప్రాక్ సోపానే కుంభపూజాం విదధ్యాత్
యామ్యే హోమం వారుణే తైలకర్మ
కృత్వోదీచ్యాం తైలమోక్షం విధిజ్ఞః
శ్వభ్రే మద్యే స్థాపయేత్ స్నాపయేచ్చ ॥ **(భృగు)**

**నాలుగు సోపానములతో స్నపనమంటపం నిర్మించవలయును అందు**

| | |
|---|---|
| **తూర్పు సోపానమున** | **కుంభ పూజ** |
| **దక్షిణ సోపానమున** | **హోమము** |
| **పశ్చిమ సోపానమున** | **తైలకర్మ** |
| **ఉత్తర సోపానమున** | **తైల మోక్షము** |

**ఆచరించవలయును.**

**వేదిక మధ్యయందు స్వామిని స్థాపించి స్నపన చేయవలయును.**

**దేవాలయము ఉత్తరద్వారమైనట్లయితే వాయవ్య ఉత్తర దిక్కుల మధ్య భాగమున స్నానోదకాది ద్రవ్య సంచయస్థానమును, ఉత్తర ఈశాన్య దిక్కుల మధ్య భాగమున శయ్యాస్థానమును కల్పించవలయును.**

## తటాకం

ఆలయాభిముఖే వా ఉత్తరే వా బహూదకం విస్తీర్ణం తటాకం కృత్వా

**ఆలయమునకు ఎదరుగాగానీ, ఉత్తరమునందు గానీ, అధిక జలముతో విశాలమైన తటాకమును కల్పించవలయును.**

**జలార్గళ శాస్త్రే –**

శ్లో॥ ద్వారహీనో భవేత్ 'కూపః', ద్వారే త్వైకేన 'వాపి' కా ।
నైక ద్వార 'పుష్కరిణీ', దీర్ఘా ఉ కారాతు 'దీర్ఘికా' ॥
'కుల్యా' విధూత' తోయ శ్చ । తటాకాః ప్రకీర్తితాః ।

**1. నీటిపట్టును సూర్యకిరణ ప్రవేశము లేకుండగ పై భాగము మూసివేసి ప్రక్క భాగము గుండా నీటిని యంత్రములు మున్నగు వానివలన తోడుకొనునటువంటి దానిని కూపము అందురు !**

**2. నీటిపట్టుకు తోడుకొనుటకు వీలుగానూ, సూర్యరశ్మి మధ్యాహ్నపు వేళతప్పక నీటి పట్టుయందు పడునట్లుగానూ ఒక ద్వారము కలిగిన దానిని వాపీ (బావి) అని అందురు.**

**3.** నీరు పుష్కలముగా – నిర్మలముగా వుండిన నీటిపట్టుకు నలు వైపుల యందునూ నీటిని తీసికొనుటకువీలుగా మెట్లు కలిగి, పద్మములచే నిండి, ఒడ్డుల యందు పత్ర ఫల, పుష్పాదులచే నిండిన చెట్లు కలిగి, కలహంసల తోడనూ, జల విహంగముల తోడనూ, చేపలూ–తాబేళ్ళతోడనూ, సుందర ముగా, మనోహరముగా కళకళ లాడు దానిని 'పుష్కరిణీ' అని అందురు !

**4.** నాలుగు వైపులయందును ప్రవేశమునకు మార్గము కలిగి పొడవు ఎక్కువగా ఉండిన నీటి పట్టును దీర్ఘికా అందురు.

**5.** కొత్తనీరు వచ్చుచూ, పాతనీరు నిలుపకుండా పోవుచూ వుండెడు సౌకర్యము కలిగిన నీటిపట్టును, 'కుల్యా' (కాలువ) అందురు.

## తీర్థ మంటపం

తటాకమునకు పశ్చిమ తీరంలో తీర్థస్థానము తూర్పు ముఖముగా కల్పించవలయును.

మంటప విస్తారము 3, 5, 7, 9, 11 హస్త ప్రమాణము కలిగి చతురశ్రముగా గానీ, దీర్ఘ చతురశ్రంగా గానీ, సరి లేక బేసి సంఖ్యగల స్తంభములను, భిత్తులను కల్పించి, మంటప కూట ప్రపలతో చేయవలయును.

తీర్థ మంటపమునకు వెలుపలి భాగమున ప్రాకారమును కల్పించ వలయును.

శ్లో॥ వారుణోవా భవేత్సౌమ్యే కూపం శార్వేపివా భవేత్
యత్రవాపాం సిరాస్సన్తి తత్ర కూపం ప్రకల్పయేత్
అష్ట దిక్షుః యథాయోగం తటాకం కారయేన్మహత్
ప్రాకారాణాంచ సర్వేషాం బహిష్టా దీర్ఘికా మతా (పాద్మే)

**తా॥** భగవదాలయమునకు పడమర, ఉత్తర, ఈశాన్య, దిక్కుల యందు బావులు ఏర్పరచవచ్చును, ఏదిక్కున అంతర్ జల ప్రవాహములు తటస్థించునో ఆదిక్కున ఆయాచోటులయందు ఏర్పరచ వచ్చును. ఎనిమిది

**దిక్కుల యందునూ చెఱువులు త్రవ్వింప వచ్చును. అన్ని ప్రాకారము లకు వెలుపల కోనేరులూ, దీర్ఘికలూ, (నీరు వచ్చి నిలుచుటకునూ ఎక్కువైనచో పోవుటకునూ మార్గము కలిగిన పొడవైన నీటి పట్టులు) ఏర్పరచ వచ్చును.**

## పచనాలయం

ద్వితీయావరణ తృతీయేవా ఆగ్నేయ్యాం పచనాలయం. విమాన సమం పాదాధికం అర్ధాధికం పాదోనద్విగుణం ద్విగుణం ద్విగుణార్థం త్రిగుణమతి విస్తారం సప్తధాభతి.

విస్తారాత్ పాదాధికం అర్ధాధికం వా ఆయామం. చతురశ్రం చతుశ్శాలోపేతం, తస్మధ్యే కూపం, తద్దక్షిణతోవా మూలధామ పాదుకాది ప్రస్తరాన్తోత్సేధం చతుర్ధాకృత్యా ఏకాంశం అధిష్ఠానం సోపపీఠంవా ద్వ్యంశం, పాదవర్గమేకాంశం ప్రస్తరం, ప్రాకారాభ్యంతరం ప్రాకారమధ్యం ప్రాకార బాహ్యం వా అస్య భిత్తి విష్కంభం హస్తమాత్రం పాదహీనం పాదాధికం వా మంటపాకారం లుపాయుక్తం వా కారయేత్

**ద్వితీయావరణలో గానీ తృతీయావరణలో గానీ ఆగ్నేయములో పచనాలయము నిర్మించవలయును. పచనాలయ విశాలము విమాన విస్తారసమము, 1/4, 1/2, 13/4, 2, 21/2, 3, రెట్లు అధికముగా నిర్ణయించుకొనవచ్చు.**

**విస్తారమునకు 1/4, 1/2, అధికముగా ఆయామము కల్పించ వలయును. చతురశ్రముగా ఉండవలయును. చతుశ్శాలలతో కూడి మధ్యలో బావిని కల్పించవలయును. బావికి దక్షిణమున అధిష్ఠాన, పాద, ప్రస్తరము లతో పై కప్పును నిర్మించవలయును.**

**పై కప్పు మూలదేవాలయ పాద ప్రస్తర ఉన్నతమును నాలుగు భాగములు చేయగా అందు అధిష్ఠానం 1, పాదవర్గు 2, ప్రస్తరం 1 అగును.**

**పచనాలయ విశాలమును ప్రాకారభిత్తి అంతరముగా గానీ, ప్రాకార భిత్తిమధ్యగాగానీ, ప్రాకారబాహ్యంగా గానీ నిర్ణయించవలయును.**

**ఖిత్తి విశాలము హస్త ప్రమాణముగా గానీ, 1/4 తక్కువగా గానీ, 1/4 అధికంగా గానీ, కల్పించి మంటపాకారంగా గానీ, లుపాయుక్తంగా గానీ చేయవలయును.**

**పచనాలయమందు తూర్పుశాలలో దక్షిణాదిగ ఉత్తరాంతమువరకు సరి బేసి సంఖ్యలలో పొయ్యిలను కల్పించవలయును. దక్షిణశాల మధ్యలో నిత్యాగ్ని కుండమును, పశ్చిమ శాలామధ్యలో సోపానద్వారమును, ఉత్తర శాలలో హవిర్ద్రవ్య ఉపసంచయస్థానమును, క్రింద భాగమును దక్షిణము నుండి తూర్పు దిక్కునకు నీరు వెళ్లు విధముగా మార్గమును కల్పించ వలయును.**

**సర్వత్రాపిమహానసం ఆగ్నేయ్యామేవకారయేత్. దేవాలయము ఏ దిక్కునకు అభిముఖముగా ఉన్నప్పటికి పచనాలయం ఆగ్నేయమున మాత్రమే కల్పించవలయును.**

స్నానోదక పానీయ పుష్పసంచయ
ప్లోతవస్త్ర ఉత్తరీయ గంధ తాంబూల
అర్చానాద్రవ్యస్థానం, శయ్యాప్రదేశం చ

## స్నానోదకాదుల స్థానము

ప్రథమావరణే ద్వితీయేవా ఇంద్ర ఈశానయోః అంతరే స్నానోదక పానీయపుష్పసంచయ స్థానం, ప్లోత వస్త్రోత్తరీయ గంధ తాంబూలాద్యర్చనా ద్రవ్యసంచయస్థానం. దైంద్రాగ్నేర్మధ్యే శయ్యాదేశం.

**ప్రథమామావరణమునందుగానీ ద్వితీయావరణము నందుగానీ ఇంద్ర ఐశాన్య మధ్యయందు స్నానోదక పానీయ - పుష్ప సంచయ స్థానమును, ప్లోతవస్త్ర - ఉత్తరీయ - గంధ - తాంబూలాది అర్చనా ద్రవ్య సంచయస్థానమును కల్పించవలయును.**

**తూర్పు - ఆగ్నేయ దిక్కులమధ్యయందు శయ్యా ప్రదేశమును నిర్మించవలయును.**

## మంటప నిర్ణయం

ద్వితీయాంశే ద్వితీయేతుకుర్యాత్ స్నపనమంటపం
తృతీయాంశే తృతీయేతు కుర్యాత్ ఆస్థానమంటపం
చతుర్థావరణే వా౨ థ పంచమావరణే౨ థవా
ద్వితీయాంశే తటాకంచ మంటపంచ తదుత్తరే
పరితః పుష్పవృక్షాంశ్చ కల్పయేత్ భక్తి సంయుతః **(భృగు)**

**ద్వితీయావరణమందు ద్వితీయాంశమున స్నపన మంటపము, తృతీయావరణమందు తృతీయాంశమున ఆస్థానమంటపము, చతుర్థావరణ మందుగానీ పంచమావరణమందు గానీ, ద్వితీయాంశమున తటాకము, దానికి ఉత్తరమున మంటపము కల్పించి తటాకము చుట్టూ పుష్పవృక్షములు భక్తి ప్రబోధములైనవాటిని కల్పించవలయును.**

## దేవాలయ క్షేత్రములకు ఆయాది నిరూపణం

వ్యాసాయామసమూహే అష్టగుణితే భక్తావశిష్టమాయం, త్రిగుణితే మనుభిర్హృతావశిష్టం వ్యయం, అష్టభక్తావశిష్టం యోనిః, అష్టగుణితే సప్తవింశతి హృతం ఫలం యచ్ఛిష్టం ఋక్షం, నాహే త్రింశద్ధృతే అవశిష్టం తిథిః, చతుర్భిర్గుణితే నవభిర్హృత మంశకం **(మరీచి)**

**క్షేత్రము యొక్క పొడవు వెడల్పులను గుణించగా ఏర్పడిన సంఖ్యను**

సంఖ్య × 8÷12= శేషం ఆయం

సంఖ్య × 3÷14= శేషం వ్యయం

సంఖ్య × 3÷8 = శేషం యోని

సంఖ్య × 8÷27= శేషం నక్షత్రం

సంఖ్య × 8÷30= శేషం తిథి

సంఖ్య × 8÷7 = శేషం వారం

సంఖ్య × 4÷9 = శేషం అంశం

దేవాలయ నిర్మాణ గర్భప్రదేశము యొక్క గణితమును చేసి, ఆయ వ్యయ, యోని, నక్షత్ర, తిథి, వార, అంశలను శుభప్రదముగా సాధించి గర్భ నిర్మాణము చేసి, గర్భాలయ కొలతను అనుసరించి మిగిలిన భాగము లైన అంతరాలయ, ముఖమండప, మహామంటప, ఇతర మంటప, ప్రాకార గోపురాదలతో సశాస్త్రీయ ఆలయ నిర్మాణము చేయవలయును.

దేవాలయములోని భాగములు-**1.** ఉపపీఠము, **2.** అధిష్టానము, **3.** స్తంభముల వర్గు, **4.** ప్రస్తరము, **5.**వేదిక, **6.** కంఠము, **7.** శిఖరము **8.** స్తూపి. ఇవి ఒక్కఅంతస్థుగల దేవాలయములో కనుపించు భాగములు. అంతస్థులు పెరిగే కొద్ది ప్రస్తరము, దానిమీద కర్ణకూటము ఇలా **16** అంతస్థుల వరకు పెంచుకోవచ్చును.

*సర్వేజనాః సుఖినోభవంతు*

## ఉపకరించిన గ్రంథములు


| | |
|---|---|
| వాస్తు నారాయణీయమ్ | నేమాని గృహ వాస్తు |
| గృహ వాస్తు కల్ప ద్రుమమ్ | లక్ష్మీ వాస్తు వైభవం |
| విశ్వకర్మ వాస్తు ప్రకాశిక | మరీచి విమానార్చన కల్పం |
| మయ వాస్తు | భృగు ప్రకీర్ణాధికారం |
| శ్రీ కృష్ణ వాస్తు శాస్త్రం | గార్గేయ ఆగమం |
| వాస్తు శాస్త్ర ముహూర్త కాల నిర్ణయం | ఆలయ వాస్తు దీపిక |
| కామేశ్వర వాస్తు సుధాకరం | దేవాలయం |
| వాస్తు సార సూర్యోదయం | విశ్వజ్ఞ వాస్తు సుధ |
| ముహూర్త కల్ప ద్రుమమ్ | శిల్పదర్శనము |


